భగవాన్ వేదవ్యాస మహర్షి రచించిన

# శ్రీ వరాహ పురాణం



వచనం : డా॥ జయంతి చక్రవర్తి

భగవాన్ వేదవ్యాస మహర్షి రచించిన

# శ్రీ వరాహ పురాణం






జిల్లెళ్ళమూడి అమ్మ

**మాతృశ్రీ అనసూయాదేవి ఆశీస్సులతో...**

**వచనం : డాక్టర్ జయంతి చక్రవర్తి**

ఎం.ఏ., ఎం.ఫిల్., పిహెచ్.డి.,

ప్రచురణ



**శ్రీ బాలాజీ పబ్లికేషన్స్**

28-25-32/1, అరండల్‌పేట, ఏలూరురోడ్, విజయవాడ-2

సెల్ : 9441176276 / 9966675815

# శ్రీ వరాహ పురాణం


| | | |
|---|---|---|
| వచనం | : | డాక్టర్ **జయంతి చక్రవర్తి**<br>విజయవాడ. 9390526272 |
| కాపీరైట్ | : | పబ్లిషర్స్ |
| ప్రథమ ముద్రణ | : | 2014 |
| ముఖచిత్రం | : | రమణ |
| డి.టి.పి. &<br>పేజి లే-అవుట్ | : | విద్యార్థి క్రియేషన్స్<br>విజయవాడ |
| ముద్రణ | : | శ్రీ స్వామి ఆఫ్‌సెట్ ప్రింటర్స్<br>విజయవాడ-3 |
| ప్రచురణ | : | **శ్రీ బాలాజీ పబ్లికేషన్స్**<br>నసురుల్లాఖాన్ వీధి<br>అరండల్‌పేట, విజయవాడ |
| వెల | : | ₹. 60 /- |




ఆర్షవిజ్ఞాన భాండాగారాలైన అష్టాదశ పురాణాలని ఆంధ్రజాతికి అందించిన శ్రీ వేంకటేశ్వర ఆర్షభారతి ట్రస్ట్ వారికి, ఆ పురాణాలను అనువదించిన మహారచయితలకి సహస్రాధిక ప్రణామాలు సమర్పిస్తున్నాం.

# భగవాన్ వేదవ్యాస మహర్షి

## వ్యాసగుహ, సరస్వతీ తీరం, బదరీనాథ్



*అచతుర్వదనో బ్రహ్మా ద్విబాహురపరో హరిః ।*
*అఫాలలోచనః శంభుర్భగవాన్ బాదరాయణః ॥*

## కృతజ్ఞతలు

అష్టాదశ పురాణాలని సామాన్య జనానికి అందించాలని సంకల్పించిన శ్రీ బాలాజీ పబ్లికేషన్స్ అధినేత **శ్రీ పుట్టగుంట వీరయ్యచౌదరి (బోస్) గారికి** ముందుగా ప్రత్యేక కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

ఈ గ్రంథాలకి తమ అమూల్యమైన ఆశీస్సులందించిన శ్రీ పీఠాధిపతులు పరమపూజ్య **శ్రీశ్రీశ్రీ పరిపూర్ణానంద సరస్వతీ స్వామివారికి,** అస్మద్గురువర్యులు ఆర్షవిద్యాసాగర **బ్రహ్మశ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి గారికి** సహస్రాధిక వందనాలు సమర్పిస్తున్నాను.

ప్రోత్సహించిన మిత్రులు రోహిత్ ప్రింటర్స్ అధినేత శ్రీ పుప్పాల అప్పారావు గారికి, డా॥ కానుకొల్లు బాలకృష్ణ, వలివేటి శివరామకృష్ణమూర్తి, వేదాంతం సార్వభౌమ, ఉన్నవ గణేష్‌లకి..... అలాగే ఈ గ్రంథాన్ని డి.టి.పి. చేసిన శ్రీమతి వినీల గారికి పేజి మేకింగ్ చేసిన విద్యార్థి క్రియేషన్స్ వారికి ప్రత్యేక అభినందనలు...





Sreepeetam

# 1-9-278/10/1, Lalitha Nagar, Vidyanagar, Hyderabad - 500 044.

Ph: 27076655, M: 098490 33991


# ఆశీస్సులు

డా॥ జయంతి చక్రవర్తి గారు అనేక ఆధ్యాత్మిక రచనల ద్వారా తెలుగు పాఠకులకు సుపరిచితులు. విజయవాడ కనకదుర్గ దేవస్థానం పక్షాన వెలువడుతున్న 'కనకదుర్గ ప్రభ' పత్రికకు ప్రారంభ సంపాదకులుగా ఆయన పేరు తెచ్చుకున్నారు. 'దశ మహావిద్యలు' పుస్తక రచన తరువాత డా॥చక్రవర్తి గారు అష్టాదశ పురాణాలను తెలుగు పాఠక ప్రపంచంలోకి లోతుగా తీసుకువెళ్లాలని సంకల్పించారు. ఒక్కొక్క పురాణ సారాంశాన్ని ఒక్కొక్క చిన్న పుస్తకంగా విడుదల చేయాలన్న ఆ రచయిత సంకల్పం ప్రశంసనీయం.

ఈ చిన్నిపొత్తాలు పాఠకులందరికీ ప్రయోజనకరంగా, సదుపాయకరంగా ఉంటాయి. వీటి ఉపయోగాన్ని పాఠకులందరూ అందిపుచ్చుకోవాలని మనసారా ఆకాంక్షిస్తున్నాను.



స్వామి పరిపూర్ణానంద

**జయ వత్సరం, శ్రావణ పూర్ణిమ**

**(10.8.2014)**

"ఆర్షవిద్యాసాగర", "మధురభారతి"
మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి



దూరవాణి : 81061 96418

301, శ్రీ సాయి ఎన్‌క్లేవ్, అడవి శేషగిరిరావు వీధి, లక్ష్మీనగర్
సత్యనారాయణపురం, విజయవాడ-520011



తేది : 19-8-2014

## ఇది సృష్టి కథ

"అన్నీ వేదాల్లోనే ఉన్నాయిష" అనే వెక్కిరింపు లోకంలో బాగా ప్రచారంలో ఉంది. వెక్కిరించడానికి అన్నమాటే అయినా, ఇది నిజమని మాత్రం చెప్పక తప్పదు. వేదం సృష్టితత్త్వాన్ని, సృష్టికి మానవుడికి ఉన్న సంబంధాన్ని, మానవుడికి సృష్టికర్తతో గల అనుబంధాన్ని వ్యక్తం చేసింది. వేదం ఏ ఒక్కరో రచించిన గ్రంథం కాదు. సృష్టితత్త్వాన్ని, పరమాత్మ తత్త్వాన్ని తెలుసుకోవాలని ఆరాటపడిన మహర్షి సముదాయానికి అంతర్నేత్రానికి గోచరించిన ఒక దర్శనం. హృదయస్థానంలో వినిపించిన ఒక నాదం (శ్రుతి).వేదం 'అపౌరుషేయం' అని కూడా పెద్దలు గుర్తించారు. 'అపౌరుషేయం' అంటే మానవుమాత్రుడి రచన కాదు అని అర్థం.

అనాదిగా అలా దిగి వచ్చిన వేదం వ్యాసమహర్షి కాలానికి చిక్కువడిన దారాల రాశిగా ఉంటే, ఆ చిక్కును విడదీసి, వేదవిభాగ నిర్ణయంచేసి, వేదం మనకు అక్కరకు వచ్చేలా చేశాడు ఆ మహర్షి. ఆనాటి నుండి అతడికి 'వేదవ్యాసుడు' అనే పేరు వచ్చింది. సకల వేదాల సారాన్ని 555 సూత్రాలుగా "బ్రహ్మసూత్రాలు" రచించాడు. అయినా, ఆ మహర్షికి తృప్తి కలుగలేదు. వేదమనే విత్తనంలో నుంచి విశాలమైన పురాణ మహావృక్షాలను అంకురింపచేశాడు. అందుకే పురాణాలకు

“వేదోపబృంహణాలు” అని పేరు. “ఉపబృంహణం” అంటే విత్తనాలు నుంచి మొలక రావడం. విత్తనంలో ఏమి ఉన్నదో మొలకలో, మొక్కలో, చెట్టులో అదే ఉంటుంది.

వేదవాఙ్మయంలో దాగిన సృష్టితత్త్వాన్ని కథారూపంగా వివరించడానికి అష్టాదశ పురాణాలను రచించాడు వ్యాసమహర్షి. మానవాభ్యుదయం కోసం వెలువడిన ఈ పురాణ వాఙ్మయసారాన్ని సంక్షిప్తంగా సంకలనం చేసి అందిస్తే, ఈనాటి సమాజానికి శ్రేయస్సు కలుగుతుందని సంకల్పించాడు మా శిష్యమిత్రుడు డా॥ జయంతి చక్రవర్తి. తన ఓర్పు నేర్పులతో అష్టాదశ పురాణాల ఆంతర్యాన్ని వాడుకభాషలో నేటి జన సామాన్యానికి అందుబాటులోకి తెచ్చే పవిత్రమైన బాధ్యతను నెరవేర్చాడు.

మంచి సాహిత్యాన్ని మన సమాజానికి అందించే మహత్తర లక్ష్యంతో శ్రీ బాలాజీ పబ్లికేషన్స్ వారు ఈ అష్టాదశ పురాణాలని ప్రచురించటానికి ముందుకు వచ్చారు. వీరిద్వారా ఇంకా ఎన్నో చక్కని గ్రంథాలు వెలుగు చూస్తున్నాయి.

పురాణ వాఙ్మయంలోని పుణ్యకథా విశేషాలను ఈనాటి సమాజానికి పంచే కృషిలో పాలు పంచుకుంటున్న మా చక్రవర్తి, సంప్రదాయ సాహిత్యాన్ని ప్రచురించే సత్కార్యాన్ని మహాయజ్ఞంగా స్వీకరించిన ప్రచురణకర్త శ్రీ బాలాజీ పబ్లికేషన్స్ వారు ఎంతైనా అభినందనీయులు.

వీరిద్దరికీ అంతర్యామి అనంత శుభాలనూ ప్రసాదించాలని ఆశీర్వదిస్తూ, ఈ గ్రంథాలు ప్రజలకు చేరువ కాగలవని ఆకాంక్షిస్తున్నాను.

- మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి



# పురాణ పురుషుడు శ్రీమన్నారాయణుడు



# విషయసూచిక

# ఉపోద్ఘాతము

అం.ఆ

**వక్రతుండ మహాకాయ కోటిసూర్య సమప్రభ ।**
**నిర్విఘ్నం కురుమేదేవ సర్వకార్యేషు సర్వదా ॥**

**వ్యాసం వశిష్ఠనప్తారం శక్తేః పౌత్ర మకల్మషమ్ ।**
**పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్ ॥**

## అష్టాదశ పురాణాలు

మన భారతవాఙ్మయంలో వేదాల తరువాత అంతటి ప్రాశస్త్యాన్ని పొందిన గ్రంథాలు పురాణాలు. వేదాల్లో చెప్పిన ధర్మాల్ని కథలరూపంలో, ఆఖ్యానాల రూపంలో సామాన్యులకు సైతం అర్థమయ్యేలా తెలియచెప్పేవే పురాణాలు. అందుకే పురాణాల్ని పంచమవేదంగా కీర్తించారు. అసలు పురాణం అంటే? పురా అపినవం-పురాతనమైనప్పటికీ నూతనంగా వుండేది అని అర్థం. అలాగే 'పురా ఆనతి' అంటే ప్రాచీనకాలంలో జరిగింది అని, వాయుపురాణం పురాణశబ్దాన్ని నిర్వచిస్తే, 'పురాఏతత్ అభూత్' పూర్వం ఇలా జరిగింది అని బ్రహ్మాండ పురాణం పురాణశబ్దానికి అర్థాన్ని చెబుతుంది. వీటన్నిటినీ క్రోడీకరించి చూస్తే పురాణం అంటే పూర్వకాలంలో జరిగిన ఎన్నో విషయాల్ని వివరించి చెప్పేది అని తెలుస్తోంది.

పురాణాలు ఎన్ని-

పురాణాలు మహాపురాణాలు, ఉపపురాణాలని రెండు విధాలుగా వున్నాయి. మహాపురాణాలు 18, అలాగే ఉపపురాణాలు 18.

**బ్రహ్మం పాద్మం వైష్ణవం చ వాయవీయం తథైవచ ।**
**భాగవతం నారదదీయం మార్కండేయంచ కీర్తితమ్ ॥**

**ఆగ్నేయంచ భవిష్యంచ బ్రహ్మవైవర్త లింగకే ।**
**వారాహంచ తథా స్కాందం వామనం కూర్మ సంజ్ఞకమ్ ।**
**మాత్స్యం చ గారుడం తద్వద్బ్రహ్మాండాఖ్యమితి త్రిషట్ ॥**

1.బ్రహ్మపురాణం 2.పద్మపురాణం 3.విష్ణుపురాణం 4.వాయు పురాణం 5.భాగవత పురాణం 6.నారదపురాణం 7.మార్కండేయ పురాణం

8.అగ్నిపురాణం 9.భవిష్యపురాణం 10.బ్రహ్మవైవర్త పురాణం 11.లింగపురాణం 12. వరాహ పురాణం 13.స్కాంద పురాణం 14.వామన పురాణం 15.కూర్మ పురాణం 16.మత్స్య పురాణం 17.గరుడ పురాణం 18.బ్రహ్మాండ పురాణం- ఈ పద్దెనిమిదీ మహాపురాణాలు. అలాగే 18 ఉపపురాణాలు కూడా వున్నాయి. ఈ మహాపురాణాల పేర్లని గుర్తుంచుకోవటానికి శ్లోకం కూడా వుంది.

**'మ' ద్వయం 'భ' ద్వయం చైవ 'బ్ర'త్రయం 'వ' చతుష్టయం।**
**అనాపలింగ కూస్కాని పురాణాని పృథక్ పృథక్ ॥**

'మ' తో మొదలయ్యేవి రెండు 1.మత్స్య 2.మార్కండేయ

'భ' తో మొదలయ్యేవి రెండు 1.భాగవత 2.భవిష్య

'బ్ర' తో మొదలయ్యేవి మూడు 1.బ్రహ్మ 2.బ్రహ్మవైవర్త 3.బ్రహ్మాండ

'వ' తో మొదలయ్యేవి నాలుగు 1.వాయు 2.విష్ణు 3.వామన 4.వరాహ

అ-అగ్ని, నా-నారద, ప-పద్మ, లిం-లింగ, గ-గరుడ, కూ-కూర్మ, స్కా-స్కాంద ఇలా మొత్తం పద్దెనిమిది పురాణాలు.

## పురాణాలు విష్ణుస్వరూపం

అష్టాదశ పురాణాలను సాక్షాత్తు విష్ణు స్వరూపంగా పోల్చారు. 18 పురాణాలని మహావిష్ణువు శరీరంలోని 18 అంగాలుగా భావిస్తారు మన ప్రాచీన ఋషులు.

1. బ్రహ్మపురాణం - శ్రీ మహావిష్ణువు శిరస్సు
2. పద్మపురాణం - శ్రీ మహావిష్ణువు హృదయం
3. విష్ణుపురాణం - శ్రీ మహావిష్ణువు కుడిభుజం
4. వాయుపురాణం - శ్రీ మహావిష్ణువు ఎడమభుజం
5. భాగవతపురాణం - శ్రీ మహావిష్ణువు ఊరువులు
6. నారదపురాణం - శ్రీ మహావిష్ణువు నాభి
7. మార్కండేయపురాణం - శ్రీ మహావిష్ణువు కుడిపాదం
8. అగ్నిపురాణం - శ్రీ మహావిష్ణువు ఎడమపాదం

9. భవిష్యపురాణం - శ్రీ మహావిష్ణువు కుడిమోకాలు
10. బ్రహ్మవైవర్తపురాణం - శ్రీ మహావిష్ణువు ఎడమమోకాలు
11. లింగపురాణం - శ్రీ మహావిష్ణువు కుడి చీలమండ
12. వరాహపురాణం - శ్రీ మహావిష్ణువు ఎడమ చీలమండ
13. స్కందపురాణం - శ్రీ మహావిష్ణువు కేశాలు
14. వామనపురాణం - శ్రీ మహావిష్ణువు చర్మం
15. కూర్మపురాణం - శ్రీ మహావిష్ణువు పృష్ఠభాగం
16. మత్స్యపురాణం - శ్రీ మహావిష్ణువు మెదడు
17. గరుడపురాణం - శ్రీ మహావిష్ణువు మాంససారం
18. బ్రహ్మాండపురాణం - శ్రీ మహావిష్ణువు ఎముకలు

పురాణ లక్షణం :-

**సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశోమన్వంత రాణి చ ।**
**వంశానుచరితం చేతి పురాణం పంచ లక్షణం ॥**

పురాణానికి ఐదు లక్షణాలు ప్రధానంగా వుండాలని చెప్పారు. 1.సర్గ-అంటే ప్రపంచ సృష్టి, 2.ప్రతిసర్గ-ఈ ప్రపంచ ప్రళయం, 3.వంశం-రాజుల, ఋషుల, దేవతలకు సంబంధించిన వంశ విశేషాలు-అవతారాలు 4.వంశానుచరితం-రాజవంశాలలో, ఋషుల వంశాలలో పుట్టిన వారి జీవితచరిత్రలు, 5.మన్వంతరాలు-మనువులు, మనువు ద్వారా ఏర్పడ్డ సంతతి, ఆయా మన్వంతరాలలో జరిగిన విశేషాలు. ఈ విధంగా ప్రతిపురాణం పంచలక్షణాలతో కూడి వుంటుంది.

పురాణకర్త :-

**విష్ణోరంశో మునిర్జాత సత్యవత్యాం పరాశరాత్ ।**
**పురాణ సంహితాం దద్యే తేషాం ధర్మ విధిత్సయా ॥**

అనే ఈ ప్రమాణ శ్లోకం ప్రకారం సత్యవతీ పరాశర మహర్షి కుమారుడుగా శ్రీ మహావిష్ణు అంశంతో జన్మించిన వ్యాసుడే అష్టాదశ పురాణాల కర్త అని తెలుస్తోంది. ఈయననే కృష్ణద్వైపాయనుడు అని కూడా అంటారు. పురాణాలకు కర్త వ్యాసుడైతే వక్త సూతమహర్షి. ఈయన నైమిశారణ్యంలో శౌనకాది మహామునులకు ఈ పురాణాలన్నిటినీ ప్రబోధించాడు.

పురాణాల ప్రాచీనత :-

వేద వాఙ్మయం ఎంత విస్తృతంగా వుందో, పురాణ వాఙ్మయం కూడా అంత విస్తృతంగా వుంది. సాధారణంగా లోకంలో వేదాలు అత్యంత ప్రాచీనమైనవని చెబుతారు. అయితే ఈ శ్లోకం వేదాలకన్నా పురాణాలే ప్రాచీనమైనవని చెబుతుంది.

**పురాణం సర్వశాస్త్రాణాం ప్రథమం బ్రహ్మణాస్మృతమ్ ।**
**నిత్యం శబ్దమయం పుణ్యం శతకోటి ప్రవిస్తరమ్ ।**
**అనంతరంచ వక్త్రేభ్యః వేదాంతస్య వినిర్గతాః ॥**

పూర్వం బ్రహ్మ నోటి నుంచి వందకోట్ల శ్లోకాలతో ముందు పురాణాలు బయలుదేరి ఆ తరువాత వేదాలు బయలుదేరాయట. ఇలా వందకోట్ల శ్లోకాలతో చతుర్ముఖ బ్రహ్మతో చెప్పబడ్డ పురాణం మొత్తం ఒక్కటిగానే వుండేది. అల్పబుద్ధులైన మానవుల కోసం ఆ బ్రహ్మదేవుడే వ్యాసుడి రూపంలో వచ్చి ఆ కోటిశ్లోకాల పురాణాన్ని నాలుగు లక్షల శ్లోకాలలోకి కుదించి దాన్ని పద్దెనిమిది పురాణాలుగా రచించాడని స్కందపురాణం చెబుతుంది.

**పురాణమేక మేవాసీ దస్మిన్ కల్పాంతరే నృప ।**
**త్రివర్గ సాధనం పుణ్యం శతకోటి ప్రవిస్తరమ్ ॥**
**స్మృత్వా జగాదచ మునీన్ ప్రతి దేవశ్చతుర్ముఖః ।**
**చతుర్లక్ష ప్రమాణేన ద్వాపరే ద్వాపరే సదా ।**
**తదష్టాదశధా కృత్వా భూర్లోకేఽస్మిన్ ప్రభాష్యతే ॥** *(స్కంద పురాణం)*

## పాఠకులకు నమస్కారం

భగవాన్ వేదవ్యాస మహర్షి రచించిన అష్టాదశ పురాణాలు ఆర్షవిద్యా భాండాగారాలు. ఆ భాండాగారాలలో నిక్షిప్తమైన ప్రధాన విషయాల్ని 18 పుస్తకాలుగా క్రోడీకరించి మీ ముందుకు తెస్తున్నాం. సరళమైన భాషలో మేము ప్రచురించిన ఈ 18 పురాణాలని ఆదరించి, మమ్మల్ని ప్రోత్సహిస్తారని ఆశిస్తూ... మీ

***- ప్రకాశకులు, వచనకర్త***

# అష్టాదశ పురాణాల మొదటి వక్త - శ్రోత

అష్టాదశ పురాణాలను మొదటగా చెప్పిన వక్తలు వారి నుంచి మొదటిసారి విన్న శ్రోతలు ఈ క్రింద చెప్పిన విధంగా వుంటారు. అదేవిధంగా ఒక్కొక్క పురాణానికి వక్తృ శ్రోతృపరంపర వేరువేరు విధాలుగా కూడా ఉంటుంది.

| సం. పురాణం | ఏకల్ప వృత్తాంతం | వక్తృశ్రోతలు |
|---|---|---|
| 1. బ్రహ్మ పురాణాన్ని | బ్రహ్మ కల్పంలో | బ్రహ్మ మరీచి మహామునికి బోధించాడు |
| 2. పద్మ పురాణాన్ని | పద్మ కల్పంలో | స్వాయంభువమనువు బ్రహ్మకు బోధించాడు |
| 3. విష్ణు పురాణాన్ని | వరాహ కల్పంలో | పరాశరుడు బ్రహ్మకు బోధించాడు |
| 4. శివ(వాయు)పురాణాన్ని | శ్వేత కల్పంలో | శివుడు వాయువుకు బోధించాడు |
| 5. భాగవత పురాణాన్ని | సారస్వత కల్పంలో | విష్ణువు బ్రహ్మకు బోధించాడు |
| 6. నారద పురాణాన్ని | బృహత్ కల్పంలో | పూర్వ భాగాన్ని – సనకాదులు నారదునికి బోధించారు. ఉత్తరభాగాన్ని – వశిష్ఠుడు మాంధాతకు బోధించాడు |
| 7. మార్కండేయ పురాణాన్ని | శ్వేత వారాహకల్పంలో | మార్కండేయుడు జైమినికి బోధించాడు |
| 8. అగ్ని పురాణాన్ని | ఈశాన కల్పంలో | అగ్నిదేవుడు వశిష్ఠుడికి బోధించాడు |
| 9. భవిష్య పురాణాన్ని | అఘోర కల్పంలో | బ్రహ్మ మనువుకు బోధించాడు |
| 10. బ్రహ్మవైవర్త పురాణాన్ని | రథంతర కల్పంలో | సావర్ణి నారదుడికి బోధించాడు |
| 11. లింగ పురాణాన్ని | కల్పాంత కల్పంలో | పరమశివుడు నారదుడికి బోధించాడు |
| 12. వరాహ పురాణాన్ని | మనుకల్పంలో | విష్ణువు పృథ్వికి బోధించాడు |
| 13. స్కాంద పురాణాన్ని | తత్పురుషకల్పంలో | స్కందుడు భూమికి బోధించాడు |
| 14. వామన పురాణాన్ని | కూర్మ కల్పంలో | బ్రహ్మ పులస్త్య మహామునికి బోధించాడు |
| 15. కూర్మ పురాణాన్ని | లక్ష్మీ కల్పంలో | విష్ణువు పులస్త్య మహామునికి బోధించాడు |
| 16. మత్స్య పురాణాన్ని | సప్త కల్పంలో | విష్ణువు మనువుకు బోధించాడు |
| 17. గరుడ పురాణాన్ని | గరుడ కల్పంలో | విష్ణువు మనువుకు బోధించాడు |
| 18. బ్రహ్మాండ పురాణాన్ని | భవిష్య కల్పంలో | బ్రహ్మ మనువుకు బోధించాడు |

# పురాణాలు ఎందుకు చదవాలి?

**పురాణశ్రవణే శ్రద్ధా యస్య స్యాద్భ్రాతరస్వహమ్ ।**
**తస్య సాక్షాత్ప్రసన్నః స్యాత్ శివో విష్ణుశ్చ సానుగః ॥**

**యత్స్నాత్వా పుష్కరే తీర్థే యాగే సింధౌ చ సంగమే ।**
**తత్ఫలం ద్విగుణం తస్య శ్రద్ధయా వై శృణోతి యః ॥**

**యే పఠంతి పురాణాని శృణ్వన్తి చ సమాహితాః ।**
**ప్రత్యక్షరం లభంత్యేతే కపిలాదానజం ఫలమ్ ॥**

**అపుత్రో లభతే పుత్రం ధనార్థీ లభతే ధనమ్ ।**
**విద్యార్థీ లభతే విద్యాం మోక్షార్థీ మోక్షమాప్నుయాత్ ॥**

**యే శృణ్వన్తి పురాణాని కోటిజన్మార్జితం ఖలు ।**
**పాపజాలంతు తే హిత్వా గచ్ఛన్తి హరిమందిరమ్ ॥**

పురాణాలు వినడంలో ఎవరికైతే శ్రద్ధ ఉంటుందో మరియు నిత్యము ఎవరైతే శ్రవణం చేస్తారో, అటువంటి వారి విషయంలో శివ-కేశవులు మరియు వారి గణాలు సంపూర్ణానుగ్రహం ప్రదర్శిస్తారు. పుష్కర తీర్థాల్లో, ప్రయాగ మొదలైన నదీసంగమ క్షేత్రాల్లో స్నానాలాచరిస్తే ఏవిధమైన పుణ్యం పొందగలరో దాని రెట్టింపు పుణ్యం పురాణ శ్రోతలకు లభిస్తుంది. భక్తి శ్రద్ధలతో పురాణ పఠన-శ్రవణాలు చేసేవారు కపిలగోవును దానం చేస్తే కలిగే పుణ్యరాశిని పొందగలరు. పుత్రులు లేనివారు పుత్రులను, దరిద్రులు ధనాన్ని, విద్యార్థులు విద్యను, మోక్షగాములు మోక్షాన్ని పొందగలరు. పురాణ శ్రోతలు తమ కోటి జన్మల పాపాలను దూరం చేసికొని చివర్లో శ్రీమన్నారాయణమూర్తి సాయుజ్యం పొందగలరు.

# పురాణ వైభవం

**అష్టాదశ పురాణానాం నామధేయాని యః పఠేత్ ।**
**త్రి సంధ్యాం జపతే నిత్యం సోఽశ్వమేధ ఫలం లభేత్ ॥**

ఈ అష్టాదశ మహాపురాణాల పేర్లను ఉదయ-మధ్యాహ్న-సాయంకాల సమయాల్లో ఎవరైతే పఠిస్తారో వారు అశ్వమేధ ఫలాన్ని పొందగలరని భావం.

# శ్రీ వరాహ పురాణం



శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ ।
ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వ విఘ్నోపశాంతయే ॥

నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమమ్ ।
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయముదీరయేత్ ॥

అష్టాదశ పురాణాలలో వరాహపురాణం పన్నెండవది. 'వరాహం వామగుల్ఫకమ్' ఈ వరాహపురాణం శ్రీమహావిష్ణువుకి ఎడమ చీలమండగా వర్ణించబడింది. 'చతుర్వింశతి సహస్రాణి తత్పురాణమిహోచ్యతే" అన్న వాక్యాన్ని బట్టి ఈ పురాణంలో మొత్తం 24000 శ్లోకాలున్నాయి. 'విష్ణునాఽభిహితం క్షోణ్యై తద్వారాహముచ్యతే" అన్న మాట ప్రకారం శ్రీమహావిష్ణువు వరాహావతారాన్ని ధరించి భూదేవికి ఈ పురాణాన్ని చెప్పాడని తెలుస్తోంది. ఆ కారణంగానే ఈ పురాణానికి వరాహపురాణం అనే పేరు వచ్చింది. ఈ దివ్యపురాణంలో మొత్తం 215 అధ్యాయాలున్నాయి. పురాణం మొత్తం అధ్యాయాలుగానే విభాగించబడింది.

## శ్రీ వరాహ పురాణంలో చెప్పిన విషయాలు

**1-50 అధ్యాయాలు :** వీటిలో భూదేవి ప్రార్థన, నారదుడి పూర్వజన్మ వృత్తాంతం, ప్రియవ్రతోపాఖ్యానం, కపిల-జైగీషవ్యుల వృత్తాంతం, పుండరీకాక్షుడు పారస్తోత్రమహిమ, రైభ్యుడి వృత్తాంతం, గయామహిమ, సృష్టి-మత్స్యావతార కథనం, సుప్రతీకుడి వృత్తాంతం, గౌరముఖుడి వృత్తాంతం, సుప్రతీకుడు చేసిన శ్రీరామస్తుతి, శ్రాద్ధవిధి, దేవతలు చేసిన గోమేధయజ్ఞం, సరమకథ, పంచభూతసృష్టి, అశ్వినీదేవతల కథ, గణపతి జన్మవృత్తాంతం, నాగవృత్తాంతం - పంచమీతిథి, స్కందుడి వృత్తాంతం-షష్ఠీతిథి, సూర్యుడి ఉపాఖ్యానం - సప్తమీతిథి, మాతృకావృత్తాంతం - అష్టమీ తిథి, దుర్గాదేవి చరిత్ర -నవమీతిథి,

దిక్కుల వృత్తాంతం – నవమీతిథి, కుబేరుడి చరిత్ర – ఏకాదశి, వైష్ణవ సృష్టి – ద్వాదశి తిథి, ధర్మోత్పత్తి – త్రయోదశి, రుద్ర సంభూతి వృత్తాంతం – చతుర్దశి, పితృదేవతలు–అమావాస్య, చంద్రుడి ఉత్పత్తి – పౌర్ణమాసీతిథి, నారాయణుడి ఆరాధన ఫలం, దుర్వాసుడు చెప్పిన ద్వాదశీవ్రత విధానం, మాఘద్వాదశీ, ఫాల్గుణ, చైత్ర, వైశాఖ, జ్యేష్ఠ, ఆషాఢ, శ్రావణ భాద్రపద, ఆశ్వయుజ, కార్తీక ద్వాదశీవ్రతవిధానం ఫలితాలు వంటి ప్రధానమైన విషయాలు వివరించబడ్డాయి.

**50–100 అధ్యాయాలు :** ఈ అధ్యాయాలలో–పశుపాలక వృత్తాంతం, నారదుడు అప్సరసలకు చెప్పిన వ్రత విధానం, అగస్త్యమహర్షి చెప్పిన వ్రతాలు ధన్యవ్రతం, కాంతివ్రతం, సౌభాగ్యకరణ వ్రతం, అవిఘ్నకరవ్రతం, శాంతివ్రతం, కామవ్రతం, ఆరోగ్యవ్రతం, పుత్రప్రాప్తి వ్రతం, శౌర్యవ్రతం, సార్వభౌమవ్రతం అనేవి. అలాగే అగస్త్యుడు చెప్పిన పంచరాత్ర శాస్త్రం ప్రధానమైనవి. ఇంకా పగలు–రాత్రి–సంవత్సరపురుషుల వృత్తాంతం, యుగాచారవర్ణనం, త్రిమూర్తుల ఏకత్వభావన, పాశుపతవ్రత ఆవిర్భావకథనం, రుద్రకృతవిష్ణుస్తుతి, జంబూద్వీప విస్తారం, పర్వతం ప్రక్కనున్న మైదానాలు, దక్షిణదిక్కున ఉన్న పర్వతాలు, దక్షిణంవైపునున్న నదులు, భారతవర్షం, కుశ, క్రౌంచ శాల్మలద్వీపాలు, శక్తిస్వరూపం, బ్రహ్మచేసినశక్తి స్తుతి, వైష్ణవీ దేవిమహిమ, మహిషాసుర వధ, రౌద్రీ శక్తి, రుద్రవ్రతం, సత్యతపుడి వృత్తాంతం, శ్రీవిష్ణుపూజా విధానం, జలధేను పూజావిధానం వంటి ప్రముఖ విషయాలు వర్ణించబడ్డాయి.

**100–150 అధ్యాయాలు :** ఈ అధ్యాయాలలో– రస, గరుడ, శర్కర, మధు, క్షీర, దధి, నవనీత, లవణ, కార్పాస ధేనువుల వ్రతవిధానాలు, దానమహిమ, కపిల ధేనువు దానమహిమ, భూదేవి చేసిన విష్ణువర్ణన, భక్తిఫలం, స్వర్గఫలం, కర్మమార్గసాఫల్యం, ఆహారనియమాలు, దేవార్చనావిధానం, శ్రీమన్నారాయణ పూజావిధానం, ఉత్తమ ధర్మాలు, కోకాముఖతీర్థమహిమ, ముక్తిని ప్రసాదించే ధర్మాలు, ఆయా ఋతువుల్లో చేయదగిన ఉత్తమ కర్మలు, మాయారహస్యం, సనాతన ధర్మం, దీక్షావిధానం, క్షత్రియదీక్ష, సంధ్యార్చనావిధి, రాజాన్నదోష ప్రాయశ్చిత్తం, పూజలో చేసే అపచారాలు–ప్రాయశ్చిత్తాలు,

అపావాయుదోష ప్రాయశ్చిత్తం, మలవిసర్జనదోషప్రాయశ్చిత్తం, కొన్ని ఇతర దోషాలు వాటి ప్రాయశ్చిత్తాలు, సౌకరకక్షేత్రమహిమ, కోకాముఖ బదరీక్షేత్ర మహిమ, సోమేశ్వరలింగం ముక్తిక్షేత్రం, సాలగ్రామ క్షేత్ర మాహాత్మ్యం, రురు-హృషీకేశ క్షేత్రమాహాత్మ్యాలు, గోనిష్క్రమణతీర్ధమాహాత్మ్యం, ద్వారకా మహాత్మ్యం లాంటి సుప్రసిద్ధ విషయాలు వివరించబడ్డాయి.

**150-215 అధ్యాయాలు :** వీటిలో ప్రధానంగా - లోహార్గళక్షేత్ర మాహాత్మ్యం, మథురాతీర్ధప్రశంస, మథురామండలంలోని బృందావనం తదితర తీర్థాలమహిమ, మథురాతీర్థం ప్రదక్షిణ విధి, దేవవనం, చక్రతీర్థాల మాహాత్మ్యం, గోవర్ధన గిరి పరిక్రమ, అసికుండతీర్థం, మథుర ఆవాంతర తీర్థాలు, బ్రహ్మప్రేత సవాదం, వామనపూజావిధి, సాంబుడు పొందిన శాపం, సూర్యారాధన వ్రతం, మథురామాహాత్మ్యం, ధృవతీర్థటమహిమ, కాష్ట, పాషాణ, విగ్రహాల నిర్మాణం, ప్రతిష్ఠ, పూజావిధి, కంచువిగ్రహప్రతిష్ఠ, రజత తామ్ర, స్వర్ణ ప్రతిమల ప్రతిష్ఠావిధి, సాలగ్రామ శివలింగాల పూజావిధానం, పితృయజ్ఞం, పిండకల్పం, అశౌచం, శ్రాద్ధదోషాలు, దానప్రకరణం, శాంతిపాఠమహిమ, నచికేతుడి వృత్తాంతం, యమపురి విశేషాలు, యమయాతనలు, కర్మవిపాక నిరూపణం, దానధర్మ మాహాత్మ్యం, పతివ్రతోపాఖ్యానం, పాపవిముక్తికి ఉపాయాలు, గోకర్ణేశ్వర మాహాత్మ్యం లాంటివి సవివరంగా వర్ణించబడ్డాయి.

ఈ విధంగా ఎన్నో విశేషాలతో వరాహపురాణం భగవాన్ వ్యాసమహర్షి చేత రచించబడింది. ఈ వరాహమహాపురాణంలో చెప్పిన అంశాలలో ముఖ్యమైన వాటిని స్వీకరించి వాటిని సంక్షిప్తంగా శ్రీవరాహపురాణం అనే పేరుతో ఈ గ్రంథం ద్వారా పాఠకులకి అందిస్తున్నాం.

## భూదేవి ప్రార్థన

నమస్తస్మై వరాహాయ లీలయోద్ధరతే మహీమ్ ।
ఖురమధ్యగతోయస్య మేరుః ఖణఖణాయతే ॥
దంష్ట్రాగ్రేణోద్ధృతా గౌరుదధిపరివృతా పర్వతైర్నిమ్నగాభిః ।
సాకం మృత్పిండవత్ ప్రాగ్బృహదురువపుషా౽ నంతరూపేణయేన ॥

సో౽ యంకంసాసురారిర్మురం నరక దశాస్యాన్తకృత్ సర్వసంస్థః ।
కృష్ణో విష్ణుః సురేశో మదతు మమరి పూనాది దేవో వరాహః ॥
యః సంసారార్ణవే నేరివ మరణ జరావ్యాధి నక్రోర్మి భీమే ।
భక్తానాం భీతి హర్తా మురనరక దశాస్యాన్త కృత్ కోలరూపీ ॥
విష్ణుః సర్వేశ్వరో౽యం యమిహ కృతధియోలీలయా ప్రాప్నువన్తి ।
ముక్తాత్మానో నపాపంభవతు ప్రణుదితా రాతిపక్షః/క్షితీశః ॥

*(శ్లో॥1-3, అధ్యా1)*

ఎవరు విలాసంగా భూమిని ఉద్ధరిస్తుంటే ఆయన కాలి గిట్టల మధ్య చిక్కుకున్న మేరుపర్వతం ఖణ ఖణలాడిందో అలాంటి వరాహదేవుడికి నమస్కరిస్తున్నాను.

పూర్వం మహాబలవంతుడైన వరాహమూర్తి అత్యంత విశాలమైన తన శరీరంతో- పర్వతాలు, నదులు, సముద్రాలతో కూడిన భూమండలాన్నంతా, తన కోర అంచుతో ఒక మట్టిబెడ్డలాగా పైకెత్తాడు. ఆయనే వివిధ అవతారాలు ధరించి, కంసుడు, మురుడు, నరకుడు, రావణుడు అనే రాక్షసుల్ని తుదముట్టించాడు. అలాంటి దివ్య పరాక్రమం చూపిన నల్లనివాడు, సర్వత్రా వ్యాపించినవాడు, దేవతలందరికీ ప్రభువు, అన్నిటా నెలకొన్నవాడు, ఆదిదేవుడు అయిన ఆ వరాహమూర్తి నా పగవారిని పారద్రోలుగాక!

సంసారం అనే సముద్రం భయంకరమైన చావు, వార్ధక్యం, రోగం అనే మొసళ్ళతో, అలలతో నిండి వుంటుంది. అలాంటి సంసారం ఎంతో భయానకమైంది. తన భక్తుల్ని ఆ సంసారభయంనుంచి దూరం చేసేవాడు. మురనరక రావణాది అసురుల్ని పరిమార్చినవాడు, వరాహ రూపాన్ని ధరించినవాడు, స్వర్గలోకాధిపతి అయినవాడు, భూదేవికి నాథుడు, శుత్రువుల్ని అవలీలగా అంతం చేసేవాడు మహాపండితులకు ముక్తి పొందిన పుణ్యాత్ములకు మాత్రమే లీలగా దర్శనమిచ్చేవాడు అయిన శ్రీమహావిష్ణువు అందరికీ సుఖస్వరూపుడు అగుగాక!

ఈ విధంగా పూర్వం తనని ఉద్ధరించిన వరాహమూర్తికి భూదేవి భక్తిగా నమస్కరించి ఇలా అడిగింది.

ప్రభూ! ప్రతికల్పంలో ఎంతో దయతో నన్ను నీవు ఉద్ధరిస్తున్నావు. చాలా సంతోషం. అయితే స్వామీ! నేను నీ మొదటిరూపం ఎలాంటిదో నీవు చేసిన తొలిసృష్టి ఎలాంటిదో తెలుసుకోలేకపోయాను. పూర్వం హయగ్రీవాసురుడు వేదాల్ని అపహరించినప్పుడు నీవు మత్స్యావతారాన్ని ధరించి రసాతలంలోకి వెళ్ళి ఆ వేదాల్ని పైకితెచ్చి బ్రహ్మకు ఇచ్చావు. ఆ తరువాత దేవదానవులు సముద్రాన్ని మథించినప్పుడు నీవు తాబేలు రూపాన్ని ధరించి మందర పర్వతాన్ని పైకెత్తి ఆ సాగర మథనం నిర్విఘ్నంగా కొనసాగేలా చేసావు. ఇంకో కల్పంలో భూదేవినైన నేను రసాతలంలోకి జారిపోతుంటే నీవు వరాహరూపాన్ని ధరించి ఒక్క కోరతో నన్ను పైకెత్తి రక్షించావు.

లోకరక్షకా! భూలోకంలో హిరణ్యకశిపుడు బ్రహ్మచేత అజేయమైన వరాల్ని పొంది లోక కంటకుడైనప్పుడు నరసింహావతారాన్ని ధరించి అతన్ని దారుణంగా వధించావు. అలాగే వామన రూపాన్ని ధరించి మహారాక్షసుడైన బలి చక్రవర్తి దర్పాన్ని అణిచావు. ఆ తరువాత భార్గవరాముడిగా (పరశు రాముడిగా) అవతరించి అమోఘమైన నీ గండ్రగొడ్డలితో క్షత్రియలోకాన్నంతా సమూలంగా రూపుమాపావు. త్రేతాయుగంలో రాముడిగా అవతరించి లోక కంటకుడైన రావణాసురుణ్ణి సంహరించి ముల్లోకాల్నీ రక్షించావు.

దేవా! ఇలా నీ లీలలు ఎన్నెన్నో ఉన్నాయి. అయితే వాటి అంతరార్థాన్ని నేను ఏ కొంచెం కూడా తెలుసుకోలేక పోతున్నాను. స్వామీ! అసలు ఈ సృష్టి అంతా ఎవరిచేత నాశనం చేయబడుతోంది. ఎవరిద్వారా రక్షించబడుతోంది. నన్ను ఉద్ధరించిన తరువాత తిరిగి ఈ విశ్వాన్ని నీవెలా సృష్టిస్తావు? ఎలా దాన్ని పాలిస్తావు? ఏ కారణంతో ఈ సృష్టిని నీవు రక్షిస్తున్నావు స్వామీ! నిన్ను చేరుకునే మార్గం ఏది? అసలు ఈ సృష్టికి మొదలు ఏది? ఇది ఎలా ఎప్పుడు అంతమవుతుంది? యుగాలు ఎలా ఏర్పడ్డాయి? నాలుగు యుగాల విభాగం ఎలా జరిగింది? ఆ నాలుగు యుగాలలో జరిగిన విశేషాలు ఏమిటి? మహాప్రభూ!

ఈ యుగాల్లో ప్రస్తుతం నడుస్తున్న యుగం ప్రత్యేకత ఎలాంటిది? అసలు కోరిక అంటే ఏమిటి? యజ్ఞాలు ఎవరెవరు చేశారు? అలా చేసిన వారిలో రాజులెవరు? సిద్ధిపొందిన వారెవరు? దయచేసి నా సందేహాల్ని తీర్చి నన్ను ధన్యురాల్ని చేయి ప్రభూ!

భూదేవి ప్రార్థన విన్న వరాహమూర్తి ఒక్కసారి నోరుతెరిచి గట్టిగా నవ్వటం ప్రారంభించాడు. అలా నవ్వుతున్న ఆయన కడుపులో భూదేవికి ఏకాదశరుద్రులు, అష్టవసువులు, సిద్ధులు, మహర్షులు దర్శనమిచ్చారు. ఇంకా సూర్యచంద్రులతో గ్రహాలతో కూడిన సమస్తలోకాలూ తమ తమ ధర్మాల్ని చూసిన భూదేవి ఒక్కసారి ఆశ్చర్యంతో భయంతో నిలువెల్లా ఒణికిపోయింది. వరాహమూర్తి నవ్వటం ఆపి కొద్ది సేపటి తరువాత మరోసారి తన నోటిని తెరిచాడు. అప్పుడు నాలుగు భుజాలు కలిగి, మహాసముద్రం మీద నిద్రిస్తున్న విష్ణుమూర్తి ఆమెకి కనిపించాడు. శేషపాన్పుమీద నిద్రించిన ఆ మహావిష్ణువుతో పాటు ఆయన బొడ్డునుంచి ఉద్భవించిన తామరపువ్వులో కొలువున్న బ్రహ్మను కూడా చూసింది. ఒక్కసారిగా ఆమెకి ఆనందం కలిగి వారిద్దర్నీ ఇలా స్తుతించింది.

## భూదేవి చేసిన విష్ణుస్తుతి

నమః కమల పత్రాక్ష నమస్తే పీతవాససే ।
నమః సురారి విధ్వంసకారిణే పరమాత్మనే ॥ 1

శేష పర్యంక శయనే ధృత వక్షఃస్థల శ్రియే ।
నమస్తే సర్వదేవేశ నమస్తే మోక్షకారిణే ॥ 2

నమః శార్ఙ్గాసి చక్రాయ జన్మమృత్యు వివర్జితే ।
నమోనాభ్యుత్థిత మహత్కమలాసనజన్మనే ॥ 3

నమోవిద్రుమ రక్తాస్య పాణిపల్లవ శోభినే ।
శరణం త్వాం ప్రసన్నాస్మి త్రాహినారీమనాగసమ్ ॥ 4

పూర్ణనీలాంజనాకారం వరాహం తేజనార్ధన ।
దృష్ట్వా భీతాస్మి భూయోఽసి జగత్ త్వద్దేహగోచరమ్
ఇదానీం కురుమే నాథ దయాం త్రాహిమహాభయాత్ ॥ 5

కేశవఃపాతుమే పాదౌ జంఘే నారాయణోమమ ।
మాధవోమే కటిం పాతు గోవిందో గుహ్యమేవచ ॥ 6
నాభిం విష్ణుస్తుమే పాతు ఉదరం మధుసూదన ।
ఊరూత్రివిక్రమః పాతు హృదయం పాతువామనః ॥ 7
శ్రీధరఃపాతుమేకంఠం హృషీకేశో ముఖంమమ ।
పద్మనాభస్తు నయనే శిరోదామోదరో మమ ॥ 8
ఏవంన్యస్యహరే ర్న్యాసనామాని జగతీతదా ।
నమస్తే భగవన్ విష్ణో ఇత్యుక్త్వా విరహమహ ॥ 9

*(శ్లో॥20-28,అధ్యా-1)*

దేవతల తామరరేకుల్లాంటి కళ్ళు కలిగిన స్వామీ! పీతవస్త్రాన్ని ధరించి, శత్రువుల్ని రూపుమాపే పరమాత్మా నీకు నమస్కరిస్తున్నాను. శేషతల్పం మీద శయనించి, హృదయంమీద లక్ష్మీ దేవిని ధరించిన సర్వదేవేశా! నీకు నమస్సులు సమర్పిస్తున్నాను. శార్ఙ్గం, ఖడ్గం, చక్రం ధరించి బొడుతామర నుంచి బ్రహ్మ దేవుణ్ణి సృష్టించిన ప్రభూ! జరామరణాలు లేని ఓ స్వామీ! నీకు నేను కైమోడ్పు లందిస్తున్నాను.

పగడాలలాంటి ముఖం, లేత చిరుళ్ళలాంటి చేతులు కలిగి అలరారుతున్న దేవా! నీకు నమస్కారం. స్వామీ! నేను నిన్నే శరణువేడుకుంటున్నాను. ఏపాపం ఎరుగని స్త్రీనైన నన్నుకాపాడు. ఓ జనార్ధనా! నిలువెల్లా నల్లని కాటుకలాంటి ఆకారం కలిగిన నీ దివ్య వరాహరూపాన్ని, నీ శరీరంలో నాకు కనిపించిన జగత్తును చూసి ఎంతో భయపడ్డాను. ఇప్పటికీ నా భయం తగ్గలేదు నాథా! దయచేసి నా భయాన్ని పోగొట్టు అని దీనంగా ప్రార్ధించి ఆ తరువాత శ్రీహరిని వివిధ నామాలతో సంబోధిస్తూ తన శరీరావయవాలన్నిటినీ రక్షించమని ఇలా కోరింది.

కేశవుడు నా పాదాల్ని రక్షించుగాక! నారాయణుడు నా పిక్కల్ని, మాధవుడు నా నడుముని, గోవిందుడు నా గుహ్యభాగాన్ని రక్షించుగాక!

అదేవిధంగా విష్ణువు నా పొక్కిలిని, మధుసూదనుడు నా ఉదరాన్ని, త్రివిక్రముడు నా తొడల్ని, వామనుడు నా హృదయాన్ని రక్షించుగాక! శ్రీధరుడు నా కంఠాన్ని, హృషీకేశుడు నా ముఖాన్ని, పద్మనాభుడు నా కళ్ళని, దామోదరుడు నా శిరస్సుని కాపాడుగాక! అని పలికి ఆయనకి భక్తిగా నమస్కరించింది.

## సృష్టి వృత్తాంతం

భూదేవి చేసిన స్తుతిని విన్న వరాహమూర్తి ఎంతో సంతోషించి ఆమెతో "దేవీ! నీ ప్రశ్నలు చాలా యుక్తమైనవి. ఇలాంటి ప్రశ్నలు, సందేహాలు అందరికీ కలగవు. నీవు నన్నడిగిన సందేహాలన్నీ పురాణాలకు సంబంధించిన విషయాలు. అవి శాస్త్ర జ్ఞానంతో చెప్పతగినవి. వాటినిప్పుడు చెబుతున్నా విను" అని ఇలా చెప్పటం ప్రారంభించాడు. భూదేవీ! పురాణాలన్నిటికీ ఒక సామాన్య లక్షణ ముంటుంది. ఆ లక్షణం మొత్తం అయిదు విధాలుగా చెప్పబడింది.

సర్గశ్చ ప్రతిసర్గశ్చవంశో మన్వంతరాణిచ ।
వంశానుచరితం చైవ పురాణం పంచలక్షణమ్ ॥

సృష్టి, లయం, వంశం, మన్వంతరం, రాజవంశాల చరిత్ర అనే అయిదు లక్షణాలతో కూడుకున్నదే పురాణం. దేవీ! నీకు పురాణలక్షణాలలో మొదటిదైన సృష్టిని గురించి చెబుతాను.

ప్రారంభంలో నేను ఆద్యంతాలు లేని ఆకాశ స్వరూపుడిగా ఉన్నాను. ఆ తరువాత అణువు అనేది ఏర్పడింది. అణువు తరువాత నా నుండి బుద్ధి అనేది ఆవిర్భవించింది. అణురూపంలో ఉన్న ఆ బుద్ధే సత్త్వం, రజస్సు, తమస్సు అనే మూడు తత్త్వాలుగా మారింది. వాటినే త్రిగుణాలంటారు. ఆ మూడు గుణాల సముదాయంలో నేను 'మహత్' అనే వాడుగా ఉంటున్నాను. సర్వాన్ని తెలిసిన వాళ్ళలో నేనే మొదటివాడిని. నా నుంచి క్షేత్రజ్ఞుడనేవాడు ఆవిర్భవించాడు. తిరిగి ఆ క్షేత్రజ్ఞుడినుంచి బుద్ధి రూపొందింది.

దేవీ! బుద్ధి నుంచి అయిదు జ్ఞానేంద్రియాలు అయిదు కర్మేంద్రియాలు ఆవిర్భవించాయి. అలా ఇంద్రియాలు నెలకొన్న తరువాత ఆ పంచభూతాల

సాయంతో ఒక పిండస్వరూపాన్ని నేనే తయారుచేసాను. దేవీ! సృష్టి మొదట్లో అంతా శూన్యమే ఉంది. ఆ శూన్యం నుంచి ఆకాశం, దానినుంచి శబ్దం, వాయువు, దాని నుంచి అగ్ని, ఆ అగ్నినుంచి జలాన్ని నేనే సృష్టించాను. ఆ జలం నుంచే సకలజీవులకీ తల్లివైన (భూమాత) నిన్ను సృజించాను. ఆకాశాదులకి భూమివైన నీతో కలయిక జరగగా ఆ కలయిక వల్ల బుడగలతో కూడి జలమయమైన ఒక గర్భకోశం ఏర్పడింది. అది క్రమంగా పెరిగి పెద్దదై ఒక అండంగా మారింది. కొన్నాళ్ళకి ఆ అండం పగిలి రెండుగా అయ్యింది. దేవీ! ఆ సమయంలో నన్ను నేను మొదట జలమయస్వరూపుడిగా సృష్టించుకున్నాను.

ఆ విధంగా నేను నారాలు అనగా జలాన్ని సృష్టించి ఆ నీళ్ళనే నా నివాస స్థానంగా మార్చుకోవటం వల్ల నాకు నారాయణుడు అనే పేరు వచ్చింది. ప్రతికల్పంలో నేను తిరిగి ఆ ఆండంలోకి వెళుతూనే ఉంటాను. దేవీ! కొంత కాలం తరువాత నా నాభికమలం నుంచి ఒక పద్మం ఆవిర్భంచింది. ఆ పద్మం నుంచి తొలి సంతతిగా సృష్టికర్త అయిన చతుర్ముఖ బ్రహ్మ అవతరించాడు. అలా అవతరించిన బ్రహ్మను చూసి "ఓయీ! నీవు ప్రజల్ని సృష్టించు" అని పలికాను. దేవీ! నేనలా పలికి అతడికి కనపడకుండా అదృశ్యమయ్యాను. అయితే బ్రహ్మదేవుడికి ఎంత ఆలోచించినా సృష్టిని ఎలా చేయాలో బోధపడలేదు. కొంత సేపటికి బ్రహ్మకి- తన జన్మానికి కారకుడైన వారెవరు? అన్న సందేహం కలిగింది. అది కూడా ఎంత సేపటికీ తెలియకపోవటంతో, ఆయనకి ఒక్కసారిగా తనమీద తనకే కోపం వచ్చింది. వెంటనే ఆయన కోపం నుంచి ఒక పిల్లవాడు జన్మించి ఆయన తొడమీద వచ్చి కూర్చున్నాడు. ఉన్నట్టుండి పెద్దగా ఏడవటం మొదలుపెట్టాడు. ఆ పిల్లవాణ్ణి బ్రహ్మ ఓదార్చటానికి ప్రయత్నించగా అతడు తనకొక పేరుపెట్టమని బ్రహ్మని కోరాడు. గట్టిగా రోదిస్తున్నాడు కాబట్టి ఆ పిల్లవాడికి రుద్రుడు అనే పేరు పెట్టాడు బ్రహ్మ.

దేవీ! బ్రహ్మదేవుడు ఆ రుద్రుణ్ణి పిలిచి సృష్టి చేయమని చెప్పాడు. అయితే అతడు శక్తి లేక నీళ్ళలో మునిగి తపస్సు చేసుకోవటానికి సిద్ధపడ్డాడు. అలా రుద్రుడు నీళ్ళలో మునగటంతో ఆ బ్రహ్మ తన కుడి బొటనవేలి నుంచి

ఒక ప్రజాపతిని, ఎడమ బొటనవేలి నుంచి ఆ ప్రజాపతికి తగిన ఒక భార్యని ప్రజల్ని సృష్టించటం కోసం సృజించాడు. అలా బ్రహ్మ వేలి నుంచి పుట్టిన ప్రజాపతి తన భార్య ద్వారా మొదట స్వాయంభువ మనువుని కన్నాడు. ఇక ఆ స్వాయంభువ మనువు నుంచి ప్రజాసృష్టి ప్రారంభమైంది.

**తొమ్మిదిరకాల సృష్టులు :** సృష్టిమొత్తం తొమ్మిది విధాలుగా చేయబడింది 1.వీటిలో మొదటిది 'మహత్తు' అనే సృష్టి. 2.రెండోది 'తన్మాత్ర' సృష్టి. 3.ఇక మూడో సృష్టి 'వైకారిక' అనగా వికారాలు మార్పు చెందటం వల్ల ఏర్పడిన సృష్టి అని అర్థం. ఈ వైకారిక సృష్టినే ఐన్ద్రియకం (ఇంద్రియాలకు సంబంధించినది) అని కూడా అంటారు. ఇది బ్రహ్మ తన బుద్ధి పూర్వకంగా చేసిన సృష్టి. 4.నాలుగో సృష్టిపేరు ముఖ్య సృష్టి. ఇక్కడ ముఖ్యాలు అంటే స్థావరాలు. అనగా కదలలేని పర్వతాలు లాంటివి సృష్టించటం. 5. అయిదోసృష్టి తైర్యక్స్రోతస్సు అనేది. అనగా పశుపక్ష్యాదులకి సంబంధించింది. 6.ఆరోసృష్టి ఊర్ధ్వస్రోతస్సులకి సంబంధించింది కాగా 7.ఏడో సృష్టి మానవులకు సంబంధించింది. 8. దేవీ ఇక ఎనిమిదో సృష్టిని అనుగ్రహసృష్టి అంటారు. ఈ సృష్టి సత్త్వరజస్తమో గుణాలకి సంబంధించినది. ఇప్పటిదాకా చెప్పిన ఎనిమిది రకాల సృష్టులలో అయిదు వికృతికి సంబంధించిన సృష్టులు కాగా మిగిలిన మూడు ప్రకృతికి సంబంధించిన సహజ సృష్టులు. 9. చివరిదైన తొమ్మిదోసృష్టి కౌమారం అని వ్యవహరించబడుతుంది. ఇది సహజసృష్టి-వికృతి సృష్టుల కలయిక వల్ల ఏర్పడుతుంది. ఇవన్నీ జగత్తుకి మూలకారణంగా ప్రజాపతి చేసిన తొమ్మిది రకాల సృష్టులు.

**సృష్టి వృద్ధి చెందటం :** దేవీ! బ్రహ్మదేవుడు మొదటి రుద్రుడు వంటి తపోధనుల్ని సృష్టించాడు. ఆ తరువాత తన మనసు ద్వారా సనక సనందనాది ఋషుల్ని ఆ తరువాత మరీచ్యాది మహర్షుల్ని సృష్టించాడు. ఈ మహర్షులు మొత్తం పదిమంది 1. మరీచి 2.అత్రి 3.అంగిరసుడు 4.పులహుడు 5.క్రతువు 6.పులస్త్యుడు 7.ప్రచేతసుడు 8.భృగువు 9.నారదుడు 10.వశిష్ఠుడు. బ్రహ్మదేవుడు ఈ పదిమందిలో ఒక్క నారదుణ్ణి వదిలి మిగిలిన వారందర్నీ ప్రవృత్తి మార్గంలో

సంచరిస్తూ ప్రజాసృష్టి చేయమని ఆజ్ఞాపించాడు. అలాగే వీరికన్నా ముందు జన్మించిన సనక సనందాదుల్ని నివృత్తి మార్గంలో సంచరించమని ఆదేశించాడు.

బ్రహ్మదేవుడి కుడిబొటనవేలి నుంచి పుట్టిన ప్రజాపతి నుంచే ఈ సకల జగత్తూ ఆవిర్భవించింది. ఈ ప్రజాపతి వంశంలోని వారికి దేవతలు, దానవులు, గంధర్వులు, నాగులు, పక్షులు అనే వారంతా జన్మించారు. అలాగే బ్రహ్మ క్రోధం వల్ల ఆయననొసటి నుంచి పుట్టిన రుద్రుడు తానే సగం స్త్రీగా, సగం పురుషుడుగా విభాగించుకున్నాడు. ఆ తరువాత తన పురుష రూపాన్ని తిరిగి పదకొండు మంది రుద్రులుగా విభాగించాడు. వారే ఏకాదశ రుద్రులుగా ప్రఖ్యాతి గాంచారు.

**యుగాలు :** భూదేవీ! యుగాలు మొత్తం నాలుగు 1.కృతయుగం 2.త్రేతాయుగం 3.ద్వాపరయుగం 4.కలియుగం అనేవి. ఈ నాలుగు యుగాలలో ఎంతో మంది దేవతలు, పుణ్యాత్ములు ఎన్నో ధర్మ కార్యక్రమాలు చేసారు. అసురులు విజృంభించారు.వారి గురించి కొన్ని విశేషాలు చెబుతున్నా విను.

**ప్రియవ్రతోపాఖ్యానం :** పూర్వం మొదటి కల్పంలో స్వాయంభువ మనువు ఉండేవాడు. ఆయనకి మహాశక్తి మంతులైనవారు, పరమధార్మికులు అయిన ప్రియవ్రతుడు–ఉత్తానపాదుడు అనే ఇద్దరు పుత్రులు జన్మించారు. వారిలో ప్రియవ్రతుడు గొప్ప యజ్ఞాలు చేసి భరతుడు మొదలైన ఏడుగురు పుత్రుల్ని కన్నాడు. వారందర్నీ భూమండలం మీదున్న ఏడుద్వీపాలకీ అధిపతుల్ని చేసి తాను అన్ని కోరికల్ని ప్రసాదించే 'విశాల' అనే ప్రదేశానికి వెళ్ళి తపస్సు చేసుకున్నాడు. మహాత్ముడైన ప్రియవ్రతుడు అలా తపోదీక్షని కొనసాగిస్తుండగా ఆయన్ని చూడటానికి ఒకనాడు నారదుడు అక్కడికి వచ్చాడు. ప్రియవ్రతుడు ఆనందంగా నారదమహర్షికి స్వాగత సత్కారాలు సమర్పించి ఆసీనుణ్ణి చేసాడు. ప్రియవ్రతుడు నారదుడితో మహర్షీ! ఈ కృతయుగంలో మీరు విన్న ఏదైనా గొప్ప విషయం ఉంటే దయచేసి నాకు చెప్పండి అని ప్రార్థించాడు.

రాజేంద్రా! ప్రియవ్రతా! నేనొక ఆశ్చర్యకరమైన విషయాన్ని చూసాను. అదేమిటంటే–నేను నిన్న రాత్రి శ్వేత ద్వీపానికి వెళ్ళాను. అక్కడ వికసించిన

పద్మాలతో అందంగా ఉన్న ఒక సరోవరాన్ని చూసాను. ఆ సరోవర తీరంలో అందమైన కళ్ళతో ప్రకాశిస్తున్న ఒక దివ్య సుందరిని చూసాను. ఆమె దగ్గరకి వెళ్ళి దేవీ! నీవెవరు? ఎందుకిక్కడున్నావు? ఇక్కడేం చేస్తున్నావు? అని ప్రశ్నించాను. ఆ మాటలు విన్న ఆమె నా వైపు తదేకంగా కొద్ది సేపు చూసింది. ఆ తరువాత మనసులో ఏదో స్మరించి స్తబ్దంగా నిలుచుంది. కొద్ది క్షణాలు గడిచాయి. ఒక్కసారిగా నాకు తెలిసిన వేదాలు, శాస్త్రాలు, యోగవిద్యలు, శబ్దశాస్త్రాలు అన్నీ నా బుద్ధి నుంచి తొలగిపోయాయి. నాకు ఏవీ గుర్తుకురాలేదు. ఆ సుందరి కేవలం తన కంటి చూపుతోనే నా విజ్ఞానాన్నంతా ఆకర్షింప చేసింది.

ప్రియవ్రతా! ఒక్కసారిగా నాకు దుఃఖం ముంచుకువచ్చింది. నాకేవీ గుర్తు లేకపోవటంతో ఏం చేయాలో నాకు తోచలేదు. వెంటనే ఆమె దగ్గరకి వెళ్ళి శరణువేడాను. నాకు ఆమెలో ఒక దివ్యపురుషుడు కనిపించాడు. ఆ పురుషుడిలో ఎర్రటి కళ్ళతో వెలుగొందే మరోపురుషుడు, ఆ పురుషుడిలో పన్నెండు సూర్యులకాంతితో ప్రకాశించే ఇంకో పురుషుడు నాకు దర్శనమిచ్చారు. అలా ఆ కన్య శరీరంలో ముగ్గురుపురుషుల్ని చూసాను. ఒక్క క్షణం గడిచిందో లేదో వారు ముగ్గురూ అదృశ్యమయ్యారు. తిరిగి ఆమె ఒక్కతే నాకు కనిపించింది. ఆ దృశ్యాన్ని చూసి ఆశ్చర్యపోయాను నేను. అమ్మా! నీలో నేను చూసిన దివ్య పురుషులు ఎవరు? నా విద్యలన్నీ ఎలా నశించిపోయాయి? దీనికి కారణమేమిటో తెలియచేయమని ఆమెని ప్రార్థించాను. అప్పుడా దేవి నాతో ఇలా అన్నది.

నారదా! నేను వేదమాతని. నాపేరు సావిత్రి. నన్ను నీవు తెలుసుకోని కారణంగా నీవు చదివిన వేదాలన్నీ వ్యర్థమైపోయాయి. ఇక నాలో నీవు దర్శించిన పురుషులు ఎవరంటే–మొదటిపురుషుడు ఋగ్వేదం అనే పేరుగల నారాయణుడు. ఆయన్ని ఉచ్చరిస్తే చాలు అగ్నిలా పాపాలన్నిటినీ దహించేస్తాడు. ఆ ఋగ్వేద పురుషుడి హృదయంలో నీవు దర్శించిన మరో పురుషుడు యజుర్వేదరూపంలో వున్న బ్రహ్మ. ఆ యజుర్వేద బ్రహ్మ శరీరంలో నీవు చూసిన మూడో పురుషుడు దివ్యకాంతితో ప్రకాశించే సామవేదం అనే పేరు గల రుద్రుడు. ఈ రుద్రుడు కూడా సూర్యుడిలాగా సమస్త పాపాల్నీ దహించేస్తాడు.

ఓ నారదా! నీవు చూసిన ఈ ముగ్గురూ వేదపురుషులు. వీరినే మునులంతా దైవస్వరూపాలుగా భావించి పూజిస్తారు. అన్ని రకాల వర్ణాలు, యజ్ఞాలు ఈ వేదాల్లోనే నెలకొన్నాయి. ఇదిగో ఈ కనుపించే సరస్సే వేద సరోవరం. ఇందులో స్నానం చేయి. వెంటనే నీకు పోయిన జ్ఞానమంతా తిరిగి గుర్తుకు వస్తుంది అని చెప్పి అదృశ్యమయ్యింది. ప్రియవ్రతా! అలాంటి ఆశ్చర్యకరమైన సంఘటన చూసి అక్కణ్ణుంచి సరాసరి నీ దగ్గరకొచ్చాను" అని చెప్పాడు నారదమహర్షి.

## బ్రహ్మాపార స్తోత్రం

ప్రియవ్రతుడు నారదమహర్షి చెప్పిన వృత్తాంతం విన్నాక ఎంతో ఉత్సాహంగా "మహర్షీ! మీరు చెప్పిన విషయం ఎంతో కుతూహలంగా ఉంది. తరువాత ఏం జరిగిందో చెప్పండి" అని అడిగాడు. రాజేంద్రా! నేను సావిత్రీదేవి మాటననుసరించి అక్కడున్న వేదసరోవరంలోకి దిగి స్నానం చేసాను. వెంటనే నాకు వేయి జన్మల స్మరణ ఒక్కసారిగా కలిగింది. ఆ జన్మల్లో జరిగిన విశేషాలు చెబుతున్నా విను. పూర్వం అవంతీపురం అనే మహానగరం ఉండేది. పూర్వకలంలో నేనా నగరంలో ఒక విప్రుడుగా జన్మించాను. అప్పటి నా పేరు సారస్వతుడు. వేదవేదాంగాలన్నీ పరిపూర్ణంగా అధ్యయనం చేసాను. అప్పుడు నాకు ఎంతోమంది సేవకులు, దాసదాసీలు, పరివారం ఉండేది. గొప్ప ధనధాన్య సంపదలు కలిగినవాడిగా పేరు పొందాను.

ఒకనాడు నేను ఏకాంతంగా కూర్చుని ఇలా ఆలోచించాను. సుఖ దుఃఖాలతో కూడిన ఈ జీవితాన్ని ఇంకెంతకాలం అనుభవించాలి. ఈ సంపదలేవీ నాకు సుఖాన్నివ్వటం లేదు. ఇక నా బాధ్యతలన్నీ నా కుమారులకి అప్పగించి తపస్సు చేసుకుంటే మంచిది" అని భావించాను. వెంటనే అన్ని బాధ్యతల్నీ పుత్రులకి అప్పగించి వైరాగ్య భావంతో సారస్వతం అనే పేరుతో ప్రసిద్ధమైన ఒక దివ్యక్షేత్రానికి వెళ్ళాను. అక్కడే తపస్సు చేసుకోవటం ప్రారంభించాను. పురాణ పురుషుడైన శ్రీమహావిష్ణువుని ఆరాధిస్తూ ఎంతోకాలం ధ్యానం చేసాను.

## నారదుడు చేసిన బ్రహ్మాస్తుతి

పరం పరాణా మమృతం పురాణం పారం పరం విష్ణు మనన్త వీర్యమ్ ।
నమామి నిత్యం పురుషం పురాణం పరాయణం పారగతం పరాణామ్ ॥ 1
పురాతనం త్వప్రతిమం పురాణం పరాపరం పారగ ముగ్రతేజసమ్ ।
గమ్భీరగమ్భీరధియాం ప్రధానం నతోఽస్మి దేవం హరి మీశితారమ్ ॥ 2
పరాత్పరం చాపరమం ప్రధానం పరాస్పదం శుద్ధపదం విశాలమ్ ।
పరాత్పరేశం పురుషం పురాణం నారాయణం స్తౌమి విశుద్ధ భావః ॥ 3
పురా పురం శూన్య మిదం ససర్జ తదా స్థితత్వాత్ పురుషః ప్రధానః ।
జనే ప్రసిద్ధః శరణం మమాస్తు నారాయణో వీతమలః పురాణః ॥ 4
ధృతక్షమం శాన్తిధరం క్షితీశం శుభం సదాస్తౌమి మహానుభావమ్ ।
సహస్రమూర్ధాన మనన్తపాద మనేకబాహుం శశిసూర్యనేత్రమ్ ॥ 5
పారం పరం విష్ణు మపారరూపం పురాతనం నీతిమతాం ప్రధానమ్ ।
క్షరాక్షరం క్షీర సముద్ర నిద్రం నారాయణం స్తౌమ్యమృతం పరేశమ్ ॥ 6
త్రివేద గమ్యం త్రినవైకమూర్తిం త్రిశుక్ల సంస్థం త్రిహుతాశభేదమ్ ।
త్రితత్త్వలక్ష్యం త్రియుగం త్రినేత్రం నమామి నారాయణ మప్రమేయమ్ ॥ 7
కృతే సితం రక్తతనుం తథా చ త్రేతాయుగే పీతతనుం పురాణమ్ ।
తథా హరిం ద్వాపరతః కలౌ చ కృష్ణీకృతాత్మాన మథో నమామి ॥ 8
ససర్జ యో వక్త్రత ఏవ విప్రాన్ భుజాన్తరే క్షత్ర మథోరుయుగ్మే ।
విశః పదాగ్రేషు తథైవ శూద్రాన్ నమామి తం విశ్వతనుం పురాణమ్ ॥ 9
పరాత్పరం పారగతం ప్రమేయం యుధాంపతిం కార్యత ఏవ కృష్ణమ్ ।
గదాసిచర్మణ్య భృతో త్థపాణిం నమామి నారాయణ మప్రేయమ్ ॥ 10

*(శ్లో॥11-20,అధ్యా-3)*

ఈ విధంగా పరబ్రహ్మతత్త్వంతో కూడిన స్తోత్రాన్ని పఠించగానే భగవానుడు ఎంతో ప్రసన్నుడై మధురమైన స్వరంతో వరం కోరుకోమన్నాడు. అప్పుడు నేను ఆయనకి నమస్కరించి ప్రభూ! నన్ను నీలో లయం చేసుకో. ఇదే నేను కోరే వరం" అని అన్నాను. వెంటనే ఆ దేవదేవుడు ఓ బ్రాహ్మణోత్తమా!

ఇదిగో నాశనం లేని నా ప్రకృతిలోకి ప్రవేశించు. నీ దివ్యస్తుతి నాకెంతో ఆనందాన్ని కలిగించింది. నీకు వెయ్యి బ్రహ్మయుగాల ఆయుర్ధాయాన్ని ప్రసాదిస్తున్నాను. అలాగే నీకు ఒక అర్ధవంతమైన పేరు కూడా ఏర్పడుతుంది.

నారంపానీయమిత్యుక్తం తం పితౄణాం సదభవాన్ ।
దదాతి తేన తే నామ నారదేతి భవిష్యతి ॥ *(శ్లో॥24, అధ్యా-3)*

నారం అంటే త్రాగేనీరు, నీవు పితృదేవతలకి ఎల్లప్పుడూ నీటిని ఇస్తావు. కాబట్టి నీకు 'నారదుడు' అనే పేరు కలుగుతుంది". అని పలికి ఆ పరమాత్మ అంతర్ధానమయ్యాడు.

ప్రియవ్రతా! ఆ పరమాత్మ ఇచ్చిన వరం ప్రకారం నేను నా దేహాన్ని విడిచి బ్రహ్మ దేహంలో లయమైపోయాను. తిరిగి ఆ బ్రహ్మదేవుడి మనసునుంచి పుట్టిన మరీచ్యాది మహర్షులతో పాటు నేను జన్మించాను. ఆ విధంగా ఎక్కడనుంచి ఆవిర్భవించాడో తెలియని బ్రహ్మదేవుడి రోజు మొదలే సమస్త దేవతల సృష్టికీ మొదలు. రాజా! ఇందులో ఏమాత్రం సందేహం లేదు. ఇదే సమస్తజగత్తు సృష్టి ఇదే నా పూర్వజన్మ వృత్తాంతం. నేను ఏవిధంగా నారాయణుణ్ణి ధ్యానించి ఉత్తమ పదవిని పొందానో అలాగే నీవు కూడా శ్రీ మహావిష్ణువుని సేవిస్తే ఉత్తమ గతులు పొందగలవు.

## అశ్వశిరుడి వృత్తాంతం

పూర్వం ధర్మబద్ధంగా భూమిని పాలించేవాడుగా అశ్వశిరుడనే మహారాజున్నాడు. ఆరాజు ఎన్నో ధార్మిక కార్యక్రమాలు చేసేవాడు. ఒకనాడు ఎంతో వైభవంగా అశ్వశిరుడు అశ్వమేధయాగాన్ని చేసి విప్రులందరికీ భూరిదక్షిణలిచ్చాడు. యాగానంతరం ఆ విప్రులతో కలిసి అవబృధ స్నానం ఆచరించి విశ్రాంతిగా కూర్చున్నాడు. ఆ సమయంలో ఆయన దగ్గరకి కపిలమహర్షి, జైగీషవ్యుడు వచ్చారు. వారిని చూసి పరమానందభరితుడైన అశ్వశిరుడు వారిని సాదరంగా ఆహ్వానించి అతిథిసత్కారాలు జరిపి వారితో "విప్రులారా! మహాత్ములారా! ఎప్పటినుంచో నాకొక సందేహం ఉంది. జగన్నాథుడైన నారాయణుణ్ణి ఎలా ఆరాధించాలి? అని వారిని ప్రశ్నించాడు.

కపిల జైగీషవ్యులు అశ్వశిరుడితో రాజా! నీవు నారాయణుడు అని ఎవర్ని గురించి అడుగుతున్నావు. మేమిద్దరం నారాయణులమే. ఇదిగో నీ ఎదురుగా నిల్చున్నాం అన్నారు. అది విన్న అశ్వశిరుడు అయ్యా! మీరిద్దరూ బ్రాహ్మణులు, సిద్ధపురుషులు, తపస్సుతో మీ పాపాలన్నీ భస్మమై పోయాయి. అసలు మీరిద్దరూ మేమే నారాయణులం అని చెప్పటమేమిటి. నారాయణుడి చేతిలో శంఖం, చక్రం, గద ఉంటాయి. ఆయన పట్టు పీతాంబరాలు ధరిస్తాడు. గరుత్మంతుడు ఆయన వాహనం. ఆయనే మహాదైవం. ఆయనకి సాటి రాగలవాడెవ్వడూ లోకంలో లేడు అని పలికాడు.

అశ్వశిరుడి మాటలు విన్న కపిల–జైగీషవ్యులు చిన్నగా నవ్వుతూ అశ్వశిరా! ఇదిగో నీవు చెప్పిన విష్ణువు ఇలాగేనా ఉండేది అని కపిలుడు ఒక్కసారిగా విష్ణువులా మారిపోయాడు. అలాగే జైగీషవ్యుడు కూడా విష్ణు వాహనమైన గరుత్మంతుడిలా మారిపోయాడు. అలా దివ్యమంగళాకారుడై దర్శనమిచ్చిన శ్రీమన్నారాయణుణ్ణి చూసి అశ్వశిరుడు వినయంగా "స్వామీ! విష్ణువంటే ఇలాకాదు. ఆయన బొడ్డు తామర నుంచి బ్రహ్మదేవుడు పుట్టాడు. ఆ బ్రహ్మ నుంచి రుద్రుడు ఉదయించాడు. ఆయనే విష్ణువంటే" అని అన్నాడు. అప్పుడు కపిల–జైగీషవ్యులిద్దరూ మహామాయని ప్రయోగించారు. ఆ ప్రభావంతో కపిలుడు బొడ్డులో తామరతో సహా మహావిష్ణువుగా మారిపోగా, జైగీషవ్యుడు ఒక పిల్లవాణ్ణి ఒళ్ళో ఉంచుకుని బ్రహ్మగా ఆ తామర పువ్వులో కూర్చున్నాడు.

అశ్వశిరుడికి సంతృప్తి కలగలేదు. వారితో స్వామీ! ఇలా కాదు మీరేదో మాయచేస్తున్నట్టున్నారు. "శ్రీమహావిష్ణువు శ్రీమహాలక్ష్మితో కలిసి అంతటా వ్యాపించి ఉంటాడు" అని అన్న వెంటనే ఆ ప్రాంతంలో దోమలు, నల్లులు, పేలు, తుమ్మెదలు, పక్షులు, పాములు, గుర్రాలు, ఆవులు, ఏనుగులు, సింహాలు, పులులు, నక్కలు, లేళ్ళు, పశువులు, పురుగులు, అడవిలో సంచరించే జంతువులు – ఇలా కోట్లకొద్దీ జంతువులు అశ్వశిరుడికి కనిపించాయి. అన్ని ప్రాణుల్ని చూసి ఆ రాజు ఎంతో ఆశ్చర్యపోయాడు. కొద్ది సేపటికి ఆయనకి జ్ఞానోదయమైంది. కపిల జైగీషవ్యులిద్దరూ సామాన్యులు కారని గ్రహించాడు.

అశ్వశిరుడు ఆ మహర్షులిద్దరికీ నమస్కరించి "మహర్షులారా! ఇదంతా ఎంతో వింతగా ఉంది. ఈ మాయ ఏమిటి? అని ప్రశ్నించాడు. అప్పుడా మహర్షులు" రాజా! నీవు మమ్మల్ని శ్రీమహావిష్ణువుని ఎలా అర్చించాలి? అని ప్రశ్నించావు. ఆయన్నెలా పొందాలి? అని అడిగావు. అదే విషయాన్ని నీకు ఇలా చూపించాం. నీవు చూసినవన్నీ నారాయణుడి గుణాలు. ఆయన సర్వజ్ఞుడు. తనకిష్టమైన రూపాల్ని ధరించగలిగినవాడు.

కొన్ని సందర్భాలలో నారాయణుడు చాలా సౌమ్యుడుగా, సుస్థిరుడుగా మానవులకి లభిస్తున్నాడు. ఆయన్ని ఆరాధించటం వల్లనే మనుషుల వాక్కు ఎంతో అర్థవంతమవుతోంది. జగాలన్నిటికీ ప్రభువైన ఆ పరంధాముడు అన్నిజీవుల శరీరాల్లో వ్యాపించి ఉన్నాడు. నిజమైన భక్తి శ్రద్ధలు కలిగినవాళ్ళు తమ శరీరంలోనే ఆయన్ని దర్శించగలరు. ఆయన ఎదో ఒకచోటే ఉండేవాడు కాడు.

అశ్వశిరమహారాజా! ఆ విష్ణుపరమాత్మ రూపాన్ని నీకు అందుకే చూపించాం. ఆయన సర్వవ్యాపకత్వాన్ని నీవు గ్రహించాలని మా భావన. నీవు కోరిన మహావిష్ణువు నీ దేహంలో, నీ మంత్రుల, సేవకుల దేవతల, పురుగుల, పశు పక్ష్యాదుల అన్ని శరీరాల్లో కొలువైఉన్నాడు. ఈ సర్వం విష్ణుమయమే అని గ్రహించు. సర్వాంతర్యామి అయిన ఆయన దివ్యస్వరూపాన్ని మనసులో సదా ధ్యానించు" నిండు మనసుతో ఆయన్ని స్మరించటం, భక్తిగా పూజించటం, ధూపదీపనైవేద్యాలు సమర్పించటం, బ్రహ్మవేత్తల్ని సంతృప్తి పరచటం, నిత్యం ధ్యానం చేయటం అనే వాటిద్వారా శ్రీమహావిష్ణువుని సులభంగా పొందవచ్చు" అని అశ్వశిరుడికి బోధించారు. వారు చెప్పిన విధంగా అశ్వశిర మహారాజు తన కుమారుడికి రాజ్యాన్ని అప్పగించి నైమిషమనే అరణ్యానికి వెళ్ళి యజ్ఞవరాహమూర్తిని ఇలా స్తుతించాడు.

## యజ్ఞవరాహ స్తుతి

నమామి యాజ్యం త్రిదశాధిపస్య భవస్య సూర్యస్య హుతాశనస్య ।
సోమస్య రాజ్ఞో మరుతా మనేక రూపం హరిం యజ్ఞవరం నమస్యే ॥ 1

సుభీమదంష్ట్రం శశిసూర్యనేత్రం సంవత్సరే చాయనయుగ్మ కుక్షమ్ ।
దర్భాఙ్గరోమాణ యథేధ్మ శక్తిం సనాతనం యజ్ఞవరం నమామి ॥ 12
ద్యావాపృథివ్యో రిద మన్తరం హి వ్యాప్తం శరీరేణ దిశశ్చ సర్వాః
త మీడ్య మీశం జగతాం ప్రసూతిం జనార్దనం తం ప్రణతో ఽస్మి నిత్యమ్॥ 13
సురాసురాణాం చ జయాజయాయ యుగే యుగే యః స్వశరీర మాద్యమ్ ।
సృజత్యనాదిః పరమేశ్వరో య స్తం యజ్ఞమూర్తిం ప్రణతోఽస్మి నిత్యమ్ ॥ 14
దధార మాయామయ ముగ్రతేజా జయాయ చక్రం త్వమలాంశు శుభ్రమ్ ।
గదాసి శార్ఙ్గాది చతుర్భుజోఽయం తం యజ్ఞమూర్తిం ప్రణతోఽస్మి నిత్యమ్॥ 15
క్వచిత్ సహస్రం శిరసాం దధార క్వచి న్మహా సర్వతతుల్య కాయమ్ ।
క్వచిత్ స ఏవ త్రసరేణు తుల్యో య స్తం సదా యజ్ఞనరం నమామి॥ 16
చతుర్ముఖో యః సృజతే సమగ్రం రథాఙ్గపాణిః ప్రతిపాలనాయ ।
క్షయాయ కాలానల సన్నిభో య స్తం యజ్ఞమూర్తిం ప్రణతోఽస్మి నిత్యమ్॥ 17
సంసార చక్రక్రమణ క్రియాయై య ఇజ్యతే సర్వగతః పురాణః ।
యోయోగిభి ర్ధ్యాయతే చాప్రమేయ స్తం యజ్ఞమూర్తిం ప్రణతోస్మి నిత్యమ్॥ 18
సమ్యఙ్మన స్యర్పితవా నహం తే యదా సుదృశ్యం స్వతనౌ ను తత్త్వమ్ ।
న చాన్య దస్తీతి మతిః స్థిరా మే యత స్తతో మావతు శుద్ధభావమ్ ॥ 19

*(శ్లో॥46-54,అధ్యా-5)*

ఈ విధంగా స్తుతించిన తరువాత అశ్వశిరుడి ముందు ఒక అగ్నిజ్వాల ప్రత్యక్షమైంది. ఆ మహారాజు నిశ్చలంగా యజ్ఞవరాహమూర్తిని స్మరిస్తూ ఆ దివ్యతేజస్సులోకి ప్రవేశించి అందులో లయమైపోయాడు.

## వసుమహారాజు వృత్తాంతం

పూర్వం కాశ్మీర రాజ్యాన్ని వసువు అనే మహారాజు పాలించేవాడు. ధర్మతత్త్వాన్ని తెలిసిన ఆ మహారాజు ఎంతో నీతిమంతంగా రాజ్యాన్ని పాలిస్తూ యజ్ఞయాగాది క్రతువుల ద్వారా దేవతల్ని కూడా సంతృప్తి పరుస్తున్నాడు. నిత్యం శ్రీమన్నారాయణుడి మీదే మనసు నిలిపి జీవితాన్ని కొనసాగిస్తున్న

ఆ వసుమహారాజుకి లౌకిక విషయాల మీద ఆసక్తి తగ్గిపోయింది. తపస్సు చేసి తద్వారా మోక్షాన్ని పొందాలన్న కాంక్ష ఆయనకి ఎక్కువైంది. ఒకనాడు తన వందమంది సోదరుల్లో గొప్పవాడైన వివస్వంతుణ్ణి పిలిచి, అతడి కుమారుడికి రాజ్యాధికారాన్ని అప్పగించాడు. తాను మాత్రం అన్నిటినీ అందర్నీ విడిచి తపస్సు కోసం రాజ్యం వదిలి బయలుదేరాడు.

అలా బయలుదేరిన వసుమహారాజు తీర్థాలన్నిటిలోకీ ఉత్తమ తీర్థంగా ప్రసిద్ధి చెందినది, శ్రీమన్నారాయణుడు పుండరీకాక్షుడుగా నెలకొన్నది అయిన పుష్కరం అనే తీర్థానికి వచ్చాడు. ఆ దివ్య తీర్థంలో తన శరీరం శుష్కించి పోయేలా కఠోరదీక్షతో తపస్సు చేసాడు. తపస్సులో భాగంగా నిరంతరం పుండరీకాక్షుడే పరమదైవం అని భావిస్తూ ఈ విధంగా పుండరీకాక్షపార స్తోత్రాన్ని పఠించసాగాడు.

## పుండరీకాక్ష పారస్తుతి

నమస్తే పుణ్డరీకాక్ష నమస్తే మధుసూదన ।
నమస్తే సర్వలోకేశ నమస్తే తిగ్మచక్రిణే ॥ 1

విశ్వమూర్తిం మహాబాహుం వరదం సర్వతేజసమ్ ।
నమామి పుణ్డరీకాక్షం విద్యాऽవిద్యాత్మకం ప్రభుమ్ ॥ 2

ఆదిదేవం మహాదేవం వేదవేదాఙ్గ పారగమ్
గమ్భీరం సర్వదేవానాం నమామి మధుసూదనమ్ ॥ 3

విశ్వమూర్తిం మహామూర్తిం విద్యామూర్తిం త్రిమూర్తికమ్,
కవచం సర్వదేవానాం నమస్తే వారిజేక్షణమ్ ॥ 4

సహస్ర శీర్షిణం దేవం సహస్రాక్షం మహాభుజమ్,
జగత్ సంవాప్య తిష్ఠన్తం నమస్తే పరమేశ్వరమ్ ॥ 5

శరణ్యం శరణం దేవం విష్ణుం జిష్ణుం సనాతనమ్ ।
నీలమేఘ ప్రతీకాశం నమస్తే చక్రపాణినమ్ ॥ 6

శుద్ధం సర్వగతం నిత్యం వ్యోమరూపం సనాతనమ్
భావాభావ వినిర్ముక్తం నమస్యే సర్వగం హరిమ్ ॥ 7

నాన్యత్ కిఞ్చిత్ ప్రపశ్యామి వ్యతిరిక్తం త్వయాచ్యుత
త్వన్మయం చ ప్రపశ్యామి సర్వమేత చ్చరాచరమ్ ॥ 8

*(శ్లో॥10-17,అధ్యా-6)*

ఈ విధంగా వసుమహారాజు పుండరీకాక్షుడిని స్తుతిస్తుండగా ఒక్కసారిగా అయన ముందు నల్లగా ఎర్రటి కళ్ళతో భయంకరంగా ఉన్న పురుషుడు ఆవిర్భవించి రాజా! ఏమి ఆజ్ఞ! అని అడిగాడు. వసుమహారాజుకి ఆశ్చర్యం కలిగింది. ఓయీ! కిరాతకా! ఎవరునీవు? ఎక్కణ్ణుంచి వచ్చావు? అని ప్రశ్నించాడు. రాజా! పూర్వం కలియుగంలో నీవు దక్షిణాపథాన ఒక ధర్మప్రభువుగా ఉన్నావు. అలాంటి నీవు ఒకనాడు కౄరమృగాల్ని వేటాడటం కోసం అడవికి వెళ్ళావు. ఆ అడవిలో మృగంలా దూరం నుంచి కనిపిస్తున్న ఒక మహర్షిని తెలియక మృగమే అనుకుని బాణాలతో కొట్టావు. ఆ బాణం తగిలిన వెంటనే ఆ మునీశ్వరుడు మరణించాడు. నీవు ఒక మృగాన్ని చంపావన్న ఆనందంతో అక్కడికి వెళ్ళి చూడగానే మునీశ్వరుడు చచ్చిపడివున్నాడు. అతన్నలా చూసేసరికి రాజా! నీకు ఎంతో ఆందోళన కలిగింది. నీ మనసెంతో బాధపడింది. లోలోపలే నీవెంతో కుమిలిపోయావు. రాజ్యానికి తిరిగివచ్చాక నీవా వృత్తాంతాన్ని మరొకడికి చెప్పావు. అలా కొంత కాలం గడిచిపోయింది.

మహారాజా! నీకు మాత్రం మనశ్శాంతి కల్గటం లేదు. బ్రహ్మ హత్య చేసానన్న అపరాధ భావం మీ మనసుని తొలిచేస్తుంది. ఎలాగైనా ఆ పాపం నుంచి విముక్తి పొందుదామని భావించావు. శ్రీమన్నారాయణుణ్ణి మనసారా ధ్యానించి శుద్ధద్వాదశినాడు ఉపవాసమున్నావు. ఆ పుణ్య దినాన "శ్రీమన్నారాయణుడు నన్ను అనుగ్రహించుగాక" అని సంకల్పించి ఒక ఆవుని దానం చేసావు. ఆ వెంటనే ఉదరశూలతో బాధపడుతూ నీవు మరణించావు.

వసుమహారాజా! నీవానాడు ద్వాదశిరోజు ఉపవాసముండటానికి ఒక కారణం వుంది. ఆనాటి నీ ధర్మపత్ని పేరు నారాయణి. నీవు నీ ప్రాణాలు కంఠం దాకా వచ్చిపోతున్నప్పుడు నారాయణీ! అని ఉచ్చరించావు. ఆ కారణంగా రాజా నీకు ఒక కల్పందాకా విష్ణులోక నివాసం లభించింది.

రాజా! నేనొక బ్రహ్మ రాక్షసుణ్ణి, మహాఘోరమైన వాణ్ణి. నీ దేహంలో వున్న నాకు ఇదంతా తెలుసు. నేను నిన్నెలాగైనా పీడించాలనుకున్నాను. ఇంతలో విష్ణుదూతలు నన్ను బైటికి లాగి రోకళ్ళతో చావగొట్టారు. ఇక లోపలికి ప్రవేశించలేక నీ రోమకూపాలనుంచి పూర్తిగా బైటపడ్డాను. నీవు స్వర్గంలో ప్రవేశించావు. అలాగే నీతో పాటూ నా తేజస్సుని నీలో నింపి, నేను కూడా స్వర్గానికి వచ్చాను. ఇదంతా గడిచిన కల్పంలోని చరిత్ర.

మహారాజా! ఈ కల్పంలో నీవు కాశ్మీర మహారాజు కుమారుడిగా జన్మించావు. నేను నీ రోమకూపాల్లో అలాగే ఆనాటి నుంచి ఉండిపోయాను. నీవు ఎన్నెన్నో గొప్ప యాగాలు చేసావు. అయితే నీవు చేసిన యాగాల్లో ఎక్కడా విష్ణుస్మరణ లేకపోవటంతో అవన్నీ నన్నేం చేయలేకపాయాయి. అయితే రాజేంద్రా! ఇప్పుడు నీవు పుండరీకాక్షుడి దివ్య పారస్తోత్రాన్ని చదవగానే నేను నీ రోమకూపాలనుంచి బైటపడి ఇదిగో ఇలా కిరతుడిలా ఏకరూపాన్ని పొందాను. ప్రభూ! నేను పరమాత్మ స్తోత్రాన్ని విని పూర్వజన్మలో చేసిన పాపరూపం నుంచి విముక్తి పొందాను. రాజా! నాకిప్పుడు ధర్మబుద్ధి కలిగింది" అని విన్నవించాడు.

కిరాతుడి ద్వారా తన పూర్వజన్మవృత్తాంతం విన్న వసుమహారాజు ఎంతో ఆశ్చర్యపోయి ఆ కిరాతకుణ్ణి వరం కోరుకోమన్నాడు. అలాగే అతడితో "ఓ వ్యాధుడా!(కిరాతుడా)నీవల్ల నా పూర్వజన్మ వృత్తాంతాన్నంతా తెలుసుకున్నాను. నా అనుగ్రహంతో నీవు ఈనాటి నుంచి ధర్మవ్యాధుడిగా ప్రసిద్ధిచెందుతావు. పుండరీకాక్షుడే (విష్ణువే)పరమదైవమని ప్రతిపాదించే ఈ దివ్యస్తోత్రాన్ని విన్నవారికి, పఠించినవారికి పుష్కరతీర్థంలో పవిత్రస్నానం చేసిన ఫలం లభిస్తుంది" అని పలికి దివ్యమైన దేవ విమానాన్ని అధిరోహించి స్వర్గానికి వెళ్ళి పోయాడు.

## రైభ్యుడి వృత్తాంతం

రైభ్యుడనే మహర్షి ఒకనాడు పితృతీర్థమైన గయాక్షేత్రానికి వెళ్ళాడు. ఆ తీర్థంలో పితృదేవతలకి ఎంతో భక్తిగా పిండ ప్రదానం చేసి వారిని సంతృప్తి పరిచాడు. ఆ తరువాత రైభ్యమహర్షి ఎవరూ చేయనంత కఠోరదీక్షతో

గొప్పతపస్సు చేసాడు. ఆ విధంగా రైభ్యుడు తపస్సు చేస్తుండగా, ఒక దివ్య విమానంలో గొప్ప తేజశ్శాలి అయిన యోగి అక్కడకి వచ్చాడు. ఆ విమానం ఒక నలుసంత ప్రమాణంలో సూర్యుడిలా వెలుగొందుతుంటే అందులో వున్న యోగి కేవలం పరమాణువంత ప్రమాణంలో ప్రకాశిస్తున్నాడు. వచ్చిన ఆ యోగి 'ఓ రైభ్యా! ఎందుకింత కఠోరంగా తపస్సు చేస్తున్నావు? అని ప్రశ్నించి వెంటనే భూమిని ఆకాశాన్ని తన శరీరంతో పూర్తిగా కప్పేశాడు.

ఆయన శరీరంలో అయిదు రథాల ప్రమాణంతో సూర్యుడిలా ప్రకాశించేది, బ్రహ్మలోకం దాకా వ్యాపిస్తున్నది అయిన విమానాన్ని రైభ్యుడు దర్శించాడు. ఆ దివ్య దృశ్యాన్ని చూసిన రైభ్యుడు ఆశ్చర్యపోయి ఎంతో వినయంగా మహాత్మా! తమరెవరు? అని ప్రశ్నించాడు. అందుకా యోగి నవ్వుతూ నాయనా నేను రుద్రుడికి సోదరుణ్ణి బ్రహ్మ మానసపుత్రుణ్ణి. నా పేరు సనత్కుమారుడు. నేను ఈ భూలోకం నుంచి పైనున్న అయిదోలోకంలో అనగా జనలోకంలో నివసిస్తుంటాను. నాయనా! నీవెంతో గొప్పవాడివి, తపస్సంపన్నుడివి, బ్రహ్మ కులాన్ని ఉద్ధరించేవాడివి. ఎందుకంటే? నీకు వేదం అంటే అభిమానం, గౌరవం.పరమపవిత్రమైన ఈ గయాక్షేత్రానికి వచ్చి పితృదేవతలకు పిండప్రదానాలు చేసినవారికెంతో సంతృప్తి పరుస్తున్నావు. రైభ్య మహర్షీ! నీకొక వృత్తాంతాన్ని చెబుతా విను.

**విశాలుడి వృత్తాంతం :** పూర్వం విశాలానగరంలో విశాలుడనే మహారాజుండేవాడు. అతడెంతో పుణ్యాత్ముడు. అయితే అతడికి పుత్ర సంతానం లేదు. ఒకనాడు ఆ విశాలుడు విప్రుల్ని పిలిపించి తనకు సంతానం ఎలా కలుగుతుందో చెప్పండి అని వారిని కోరాడు. విప్రులు రాజా! పుత్ర సంతానం పొందాలంటే మీరు గయాతీర్థానికి వెళ్ళి అక్కడ అన్నదానం చేసి పితృదేవతల్ని సంతోషపరిస్తే మీకు తప్పకుండా సంతానం కలుగుతుంది"అని చెప్పారు. విప్రుల మాటలు విన్న విశాలుడికి ఎంతో ఆనందం కలిగింది. వెంటనే సకల సంభారాలతో గయా తీర్థానికి బయలుదేరాడు. అక్కడ మాఘనక్షత్రం నాడు ఎంతో భక్తితో పితృదేవతలకి తర్పణాలు, పిండప్రదానాలు చేయటం ప్రారంభించాడు.

విశాలుడు పిండప్రదానాలు చేస్తున్న సమయంలో ఆకాశంలో తెల్లగా, పచ్చగా, నల్లగా వున్న ముగ్గురు పురుషులు ఆయనకి కనిపించారు. వారిని చూసిన విశాలుడు అయ్యా! తమరెవరు? ఎందుకోసం వచ్చారు? మీకేం కావాలి? అని వినయంగా అడిగాడు. ఆ మాటలు విన్న వారిలో తెల్లగా వున్న పురుషుడు నాయనా! విశాలా! నేను నీ తండ్రిని. పేరునిబట్టి నడవడిక, చేష్టల్ని బట్టి నన్ను పితుడు అంటారు. ఇదిగో నా పక్కనున్న పచ్చని పురుషుడు నా తండ్రి. అనగా నీకు తాత. ఇతడు క్రూర కర్మలు చేసినవాడు, బ్రహ్మహత్య ఇంకా ఎన్నో పాపాలు చేసాడు. ఇతడి పేరు అధీశ్వరుడు. అదిగో నల్లగా ఉండే ఆ పురుషుడు నా తండ్రికి తండ్రి. అనగా నీకు ముత్తాత. ఆయన పూర్వజన్మలో ఎంతో మంది పురాణ ఋషుల్ని చంపాడు.

**గయాతీర్థ మాహాత్మ్యం :** నాయనా విశాలా! నాతండ్రి అధీశ్వరుడు. అతడి తండ్రి కృష్ణుడు (నల్లని పురుషుడు) మరణించిన తరువాత మహాఘోరమైన 'అవీచి' అనే నరకంలో ఎంతోకాలం భయంకరమైన శిక్షలనుభవించారు. నేను మాత్రం వారిలాగా పాపకార్యాలు చేయకుండా ఎన్నో పుణ్యకర్మల్ని ఆచరించటం వల్ల ఇంద్ర సింహాసనాన్ని పొందాను. ఈనాడు నీవు ఎంతో శ్రద్ధగా గయాక్షేత్రంలో పిండప్రదానం చేయటం వల్ల నరకంలో ఉన్న వారిద్దరూ నన్ను కలుసుకోగలిగారు. పరమపవిత్రమైన గయలో తండ్రుల్ని తాత ముత్తాతల్ని సంతోషపరుస్తానని సంకల్పించి నీవు తర్పణాలు విడిచావు. నీ సంకల్పం వల్ల మేము ముగ్గురం ఒకే సారి కలుసుకోగలిగాం. ఈ తీర్థమహిమవల్ల మేము ముగ్గురం పితృలోకానికి వెళతాం. ఇక్కడ పిండ ప్రదానం చేయటం వల్ల ఎంత దుర్గతి పొందినవారైనా సద్గతులు పొందుతారు. ఇందుకేమాత్రం సందేహం లేదు.

బ్రహ్మహత్య చేసిన వాడికి కూడా అతడి కొడుకు గనక ఈ గయలో పిండప్రదానం చేస్తే ఆ పాపం నుంచి అతడు తప్పక విముక్తి పొందుతాడు. ఇది ఈ తీర్థానికున్న గొప్ప మహిమ. నాయనా! ఈ కారణంగా, మాకు ఉత్తమ గతులు కల్పించినందుకు ఎంతో ఆనందిస్తూ నిన్ను చూడాలని వచ్చాం. "చాలా సంతోషం నీకు శుభం జరుగుగాక" అని విశాలుణ్ణి ఆశీర్వదించి అతడి పితరులు అదృశ్యమయ్యారు.

"ఓరైభ్యా! నీవుకూడా పరమపవిత్రమైన ఈ గయకి వచ్చి ఇక్కడ ఎంతో శ్రద్ధగా పితృదేవతలకి పిండ ప్రదానం చేసావు. అంతేకాక గయలోనే స్థిరనివాసాన్ని ఏర్పర్చుకుని గొప్ప తపస్సుచేస్తున్నావు. అంతకన్నా నీకు భాగ్యం ఏముంటుంది? అందుకే నిన్ను ధన్యుడవని అన్నాను. రైభ్యా! ఈ గయాక్షేత్రంలో గదాధరుడైన శ్రీమహావిష్ణువు శాశ్వతంగా కొలువున్నాడు. ఆయన్ని స్తుతించి సేవించి స్వామి అనుగ్రహాన్ని పొందు" అని చెప్పి సనత్కుమారుడు అక్కడి నుంచి అదృశ్యమయ్యాడు. రైభ్యుడు సనత్కుమారుడి మాటననుసరించి ఎంతో భక్తితో గదాపాణి అయిన శ్రీహరిని ఇలా దివ్యంగా స్తుతించాడు.

## గదాధర స్తోత్రం

గదాధరం విబుధజనై రభిష్టుతం ధృతక్షమం క్షుదితజనార్తి నాశనమ్ ।
శివం విశాలాసురసైన్య మర్దనం నమామ్యహం హతసకలాశుభం స్మృతౌ॥ 1

పురాణ పూర్వం పురుషం పురుష్టుతం పురాతనం విమలమలం నృణాం గతిమ్ ।
త్రివిక్రమం ధృతధరణిం బలేర్ద్వారం గదాధరం రహసి నమామి కేశవమ్ ॥ 2

సుశుద్ధభావం విభవై రుపావృతం శ్రియావృతం విగతమలం విచక్షణమ్ ।
క్షితీశ్వరై రపగతకిల్బిషైః స్తుతం గదాధరం ప్రణమతి యఃసుఖం వసేత్ ॥ 3

సురాసురై రర్చిత పాదపఙ్కజం కేయూర హారాఙ్గద మౌళిధారిణమ్ ।
అబ్ధౌ శయానం చ రథాఙ్గపాణినం గదాధరం ప్రణమతి యఃసుఖం వసేత్॥4

సితం కృతే త్రేతాయుగే ఉ రుణం విభుం తథా తృతీయే పీతవర్ణ మచ్యుతమ్ ।
కలౌ ఘనాలిప్రతిమం మహేశ్వరమ్ గదాధరం ప్రణమతి యఃసుఖం వసేత్॥5

బీజోద్భవో యః సృజతే చతుర్ముఖ స్తథైవ నారాయణరూపతో జగత్ ।
ప్రపాలయేద్, రుద్రవపు స్తథాన్తకృద్ గదాధరో జయతు షడర్ధమూర్తిమాన్ ॥6

సత్త్వం రజ శ్చైవ తమో గుణాస్త్రయ స్త్వేతేషు నాన్యస్య సముద్భవః కిల ।
స చైక ఏవ త్రివిధో గదాధరో దధాతు ధైర్యం మమ ధర్మమోక్షయోః ॥ 7

సంసారతోయార్ణవ దుఃఖ తన్తుభి ర్వియోగ వక్రక్రమణైః సుభీషణైః ।
మజ్జన్త ముచ్చైః సుతరాం మహాప్లవే గదాధరో మాము దధాతు పోతవత్ ॥ 8

స్వయం త్రిమూర్తిః స్వమినాత్మ నాత్మవి స్వశక్తిత శ్చాణ్డ మిదంసంససర్జ హ,
తస్మిఞ్జలో త్థాసన మార్యతేజసం ససర్జ యస్తం ప్రణతో ఒస్మి భూధరమ్ ॥ 9
మత్స్యాది నామాని జగత్సు కేవలం సురాది సంరక్షణతో వృషాకపిః ।
ముఖ్యస్వరూపేణ నమస్తతో విభు ర్గదాధరో మే విదధాతు సద్గతిమ్ ॥ 10

*(శ్లో॥29-38,అధ్యా-7)*

ఈ విధంగా రైభ్యుడు భక్తితో చేసిన స్తోత్రాన్ని విని పీతాంబరధారి అయిన శ్రీహరి వెంటనే అక్కడ ప్రత్యక్షమయ్యాడు. శంఖ, చక్ర, గదాధారి అయిన ఆ పురుషోత్తముడు మేఘగంభీరధ్వనితో ఇలా అన్నాడు.

ఓ రైభ్యా! నీవు చేసిన స్తోత్రం వల్ల నీవు చేసిన గయాతీర్థ స్నానం వల్ల నేనెంతో సంతోషించాను. నీకేం వరం కావాలో కోరుకో అని అన్నాడు. "రైభ్యుడు స్వామికి నమస్కరించి "ప్రభూ! గదాధరా! నీవు నాకు సనకసనందనాది మహర్షులుండే స్థానాన్ని అనుగ్రహించు. ఇదే నేను కోరే వరం అని అడిగాడు. తథాస్తు అని ఆశీర్వదించి శ్రీహరి అంతర్ధానంకాగా రైభ్యుడు కూడా దివ్యజ్ఞానాన్ని పొంది వర ప్రభావంతో సనకాది సిద్ధులు నివసించే స్థానానికి చేరుకున్నాడు.

రైభ్యుడు ఎంతో భక్తితో చేసిన ఈ గదాధర స్తుతిని శ్రద్ధగా పఠించిన వాడు గయలో పిండ ప్రదానం చేసినంత ఫలితాన్ని పొందుతాడు.

## ధర్మవ్యాధుడి వృత్తాంతం

పూర్వం వసుమహారాజు శరీరం నుంచి 'వ్యాధు'డనే కిరాతుడు పుట్టాడు. ఆ వ్యాధుడు వేటని జీవనవృత్తిగా చేసుకుని నాలుగువేల సంవత్సరాలు కాలం గడిపాడు. తన కుటుంబంకోసం రోజుకొక్క అడవి పందిని చంపి తన సేవకుల్ని, బంధువుల్ని, అతిథుల్ని, అగ్నిని సంతృప్తి పరిచేవాడు. అతడు కిరాతుడైనప్పటికీ మిథిలానగరంలో ప్రతి అమావాస్యనాడు తన పితృదేవతలకి శ్రాద్ధకర్మల్ని శ్రద్ధగా నిర్వహించేవాడు. ప్రతిరోజూ అగ్నిని పూజిస్తూ, నిత్య కర్మల్ని ఆచరిస్తూ సత్యాన్నే పలుకుతూ తన జీవనయాత్ర కొనసాగిస్తున్నాడు. ఏనాడు అతడు సాధుజంతువుల్ని చంపలేదు. ఈవిధంగా ధర్మ బద్ధంగా జీవిస్తున్న వ్యాధుడికి 'అర్జునకుడు' అనే కుమారుడు జన్మించాడు.

అర్జునుడు కూడా ఎంతో ధర్మబుద్ధికలిగినవాడు. ఇంద్రియాలమీద నిగ్రహాన్ని కలిగి తపస్సుమీద ఆసక్తిని పెంచుకున్నాడు. కొంతకాలం గడిచాక ధర్మవ్యాథుడికి 'అర్జునకి' అనే ఒక కుమార్తె కూడా జన్మించింది. ఆ కన్యకి యుక్తవయసు రాగా, ఆమెని ఎవరికిచ్చి వివాహం జరిపించాలి. ఆమెకి తగిన వరుడెవడు? అని ఆలోచించసాగాడు. ధర్మవ్యాథుడికి మతంగుడి కొడుకైన ప్రసన్నుడు తన కూతురుకి తగిన వరుడు అని అనిపించింది. వెంటనే మతగుండితో మాట్లాడి తన కుమార్తె అర్జునకిని మతంగుడి పుత్రుడు ప్రసన్నుడి కిచ్చి వివాహం జరిపించాడు.

ధర్మవ్యాథుడి కూతురు 'అర్జునకి' కూడా తండ్రిలాగానే ధర్మపరాయణురాలు. అత్తగారింటికి వెళ్ళి అక్కడ తన అత్తమామలకి ఏ లోటూ రాకుండా సేవలు చేస్తోంది. అలా కొంతకాలం గడిచింది. ఒకనాడు అర్జునకి అత్తగారు ఆమెతో " ఓ కోడలా! నీవు నిత్యం జంతువుల్ని వధించే బోయగాడి కూతురువి. నీవు కూడా తండ్రికి తగ్గ దానివే. నీకు తపస్సు చేయటం, భర్తని శ్రద్ధగా సేవించటం తెలియదు" అని పరుషంగా మాట్లాడింది. అత్తగారి మందలింపు విని అర్జునకి ఎంతో బాధపడింది. వెంటే తన తండ్రి ఇంటికి వెళ్ళి విలపించసాగింది. ధర్మవ్యాధుడు ఆమెని ఊరడించి "అమ్మా! ఎందుకు విలపిస్తున్నావు" అని అనునయంగా అడిగాడు. తండ్రీ! నా అత్తగారు అకారణంగా నన్ను దూషించింది. అందుకే నేనింతగా బాధపడుతున్నాను అని అత్త తనని అన్న మాటలు యధాతథంగా చెప్పింది.

అర్జునకి చెప్పిన మాటలు విన్నాక ధర్మవ్యాధుడికి ఎంతో కోపం వచ్చింది. వెంటనే మతంగుడి ఇంటికి వెళ్ళాడు. ఇంటికి వచ్చిన ధర్మవ్యాధుణ్ణి చూసి మతంగుడు ఆదరంగా లోపలికి ఆహ్వానించి కూర్చోబెట్టాడు. ఆ తరువాత కుశల ప్రశ్నలు వేసి తన ఇంటికి వచ్చిన కారణాన్ని అడిగాడు. అప్పుడు ధర్మవ్యాధుడు మతంగుడితో మతంగా! నేను నీ ఇంట్లో "ప్రాణం లేని ఆహారాన్ని" భుజించాలనుకుంటున్నాను అని అన్నాడు.

మతంగుడు ధర్మవ్యాధుడితో "అయ్యా! మా ఇంట్లో గోధుమలు, బియ్యం, యవలు లాంటి ధాన్యాలున్నాయి. వాటిలో నీకిష్టం వచ్చిన వాటిని భుజించవచ్చు అని అన్నాడు. అది విని మతంగా నీవు చెప్పిన యవలు, గోధుమలు, బియ్యం అదే రూపంలో వున్నాయా ఏదీ చూపించు అనడిగాడు. అప్పుడు మతంగుడు గోధుమలతో నిండిన చేటని, బియ్యంతో నిండిన మరోచాటని ఆయనకి చూపించాడు. వాటిని చూసిన ధర్మవ్యాధుడు ఇక చాలు నేను వెళ్తాను అని బయలుదేరాడు. ఆశ్చర్యపోయిన మతంగుడు స్వామీ! తమరు భోజనం చేయకుండానే వెళ్ళిపోతున్నారు ఏమిటి కారణం? అనడిగాడు. మతంగా! ప్రతిరోజూ నీవు వేలకొద్దీ జీవుల్ని చంపుతున్నావు నీవు పాపాత్ముడవే కదా! నీ ఇంట్లో ప్రాణశక్తి లేని పదార్థమేదైనా ఉంటే దాన్ని వండి అప్పుడు నాకు భోజనం పెట్టు. ఇప్పుడు నాకు చూపించిన ధాన్యాలన్నీ నీటి ద్వారా జన్మించినవేకదా! ఈ ధాన్యాల్ని నాటితే తిరిగి మొలకలు వస్తాయి కదా! అంటే ఆ గింజల్లో ప్రాణం ఉన్నట్టేగా, మరి ప్రాణం ఉన్న ఆ గింజల్ని వండటం ద్వారా చంపుతున్నావా లేదా! అది జీవహింస కాదా! నేను నా సంసారం కోసం, బంధువులకోసం రోజుకొక మృగాన్ని చంపి, దాన్ని ముందుగా పితృదేవతలకి అర్పించి ఆ తరువాతే నేను నా కుటుంబం భుజిస్తాం. ఇక నీవు నిత్యం రకరకాల ధాన్యాలరూపంలో ఎన్నో జీవుల్ని చంపి నీవారితో కలిసి తింటున్నావు. ఇది తినరాని తిండి అని నా అభిప్రాయం.

బ్రహ్మదేవుడు మొదట చెట్టు, చేమల్ని, తీగల్ని యజ్ఞం కోసం పుట్టించాడు. కాలక్రమంలో అవే ప్రాణులకి ఆహారంగా మారాయి. 1.దేవయజ్ఞం 2.భూతయజ్ఞం 3.పితృయజ్ఞం 4.మనుష్యయజ్ఞం 5.బ్రహ్మయజ్ఞం అని అయిదు మహాయజ్ఞాలున్నాయి. బ్రహ్మ దేవుడు వీటిని ఏర్పరిచాడు. ఈ యజ్ఞాల కోసం వండిన అన్నమే ఉత్తమమైన అన్నం అవుతుంది. అలా కాకపోతే ఒక్కో ధాన్యంగింజా పశుపక్ష్యాదుల లాంటిదే కనుక అది పెట్టేవాడికి, తినేవాడికీ మాంసాహారమే అవుతుంది. దేవతలాంటి నా కుమార్తెని నీకు కోడలిగా చేసాను. నీ భార్య నా కుమార్తెని "జంతువులు చంపేవాడి బిడ్డవి. నీకే ఆచారాలు,

మర్యాదలు తెలియవు" అని నిందించింది. అందుకే నీవు నీ కుటుంబం ఎంతటి ఆచారవంతులో తెలుసుకుందామని నీ ఇంటికి వచ్చాను.

మతంగా! నీ ఇంట్లో నాకు గొప్ప ఆచారం ఏదీ కనిపించలేదు. నేను మా ఇంటికి వెళుతున్నాను. పితృశ్రాద్ధం చేయాలి. శ్రాద్ధ దినం కనుక నేను నీ ఇంట్లో భోజనం చేయను. నేనేమో ప్రాణహింస చేసేవాడినా! నీవు మాత్రం పరమ అహింసాపరుడివా! ఇదేమన్నా న్యాయంగా వుందా! "ఇక నేటినుంచీ అత్తలకు కోడళ్ళపై నమ్మకం లేకుండుగాక! అలాగే కోడళ్ళు అత్త బ్రతికి ఉండటాన్ని ఇష్టపడకపోవుగాక!" అని శపించి ధర్మవ్యాధుడు తన ఇంటికి వెళ్ళిపోయాడు.

కొంతకాలం తరువాత ధర్మవ్యాథుడు తన కుటుంబ బాధ్యతల్ని పెద్ద కుమారుడైన 'అర్జునకుడికి' అప్పగించి, ముల్లోకాల్లో ప్రసిద్ధి చెందిన పురుషోత్తమ క్షేత్రానికి వెళ్ళాడు. అక్కడ నిశ్చలమైన మనసుతో భగవంతుణ్ణి ఇలా స్తుతించి తపస్సు చేయటం ప్రారంభించాడు.

## ధర్మవ్యాధుడు చేసిన విష్ణుస్తోత్రం

నమామి విష్ణుం త్రిదశారినాశనం విశాలవక్షః స్థల సంశ్రితశ్రియమ్ ।
సుశాసనం నీతిమతాం పరాం గతిం త్రివిక్రమం మన్దరధారిణం సదా ॥ 1

దామోదరం రజ్జితభూతలం ధియా యశోఽంశుశుభ్రం భ్రమరాజ్గ సప్రభమ్ ।
ధరాధరం నరకరిపుం పురుష్టుతం నమామి విష్ణుం శరణం జనార్ధనమ్ ॥ 2

నరం నృసింహం హరి మీశ్వరం ప్రభుం త్రిధామనామాన మనన్త వర్చసమ్ ।
సుసంస్కృతాస్యం శరణం నరోత్తమం వ్రజామి దేవం సతతం త మచ్యుతమ్ ॥ 3

త్రిధా స్థితం తిగ్మ రథాజ్గ పాణినం నయస్థితం తృప్త మమత్తమై ర్గుణైః ।
నిః శ్రేయసాఖ్యం క్షపితేతరం గురుం నమామి విష్ణుం పురుషోత్తమం త్వహమ్॥ 4

హతౌ పురాణౌ మధుకైటభా వుభౌ బిభర్తి చ క్ష్మాం శిరసా సదా హి సః ।
యథా స్తుతో మే ప్రసభం సనాతనో దధాతు విష్ణుః సుఖ మూర్జితం మమ ॥ 5

మహావరాహో హవిషామ్బుభోజనో జనార్దనో మే హితకృచ్ఛితీముఖః ।
క్షితీధరో మా ముదధిక్షయో మహాన్ స పాతు విష్ణుః శరణార్థినం తు మామ్ ॥ 6

మాయాతతం యేన జగత్త్రయం కృతం యథాగ్ని నైకేన తతం చరాచరమ్ ।
చరాచరస్య స్వయ మేవ సర్వతః స మే ఽస్తు విష్ణుః శరణం జగత్పతిః ॥ 7
భవే భవే యశ్చ ససర్జ కం తతో జగత్ ప్రసూతం సచరాచరం త్విదమ్ ।
తతశ్చ రుద్రాత్మవతి ప్రలీయతేఽన్వతో హరిర్విష్ణు హర స్తథోచ్యతే ॥ 8
ఖాత్మేన్దు పృథ్వీ పవనాగ్ని భాస్కరా జలం చ యస్య ప్రభవన్తి మూర్తయః ।
స సర్వదా మే భగవాన్ సనాతనో దదాతు శం విష్ణు రచిన్త్యరూపధృక్ ॥ 9

*(శ్లో॥42-48, అధ్యా-8)*

ఈ విధంగా ధర్మవ్యాధుడు స్తుతించగానే సనాతనుడైన శ్రీహరి ఎన్నో పాదాలతో, ఎన్నో చేతులతో ఆశ్చర్యంగొలిపే రూపంతో ప్రత్యక్షమై వరం కోరుకోమన్నాడు. అప్పుడు ధర్మవ్యాధుడు "స్వామీ! నా పుత్రులు, పౌత్రులు అలాగే నా కులంలో పుట్టిన వారందరూ నా లాగానే సత్యధర్మ పరాయణులుగా ఉండేలా వరమివ్వు. అలాగే నాకు నాతరం వారికి ధర్మయుగాల్లోనే జన్మ లభించాలి. కలియుగంలో మేము జన్మించకూడదు. నా కులం వారికి ఎక్కడికి వెళ్ళినా, ఎక్కడున్నా జ్ఞానం ఉదయించాలి. ప్రభూ! శ్రీహరి! నాకిక జీవితం మీద ఏమాత్రం ఆసక్తి లేదు. నీలో లయమవ్వాలని భావిస్తున్నాను" అని వినయంగా పలికాడు.

ధర్మవ్యాధుడి కోరిక విన్న శ్రీహరి "ధర్మవ్యాధా! నీ కోరిక ఫలిస్తుంది. నీ కులానికి గొప్ప కీర్తి లభిస్తుంది. నీకు శాశ్వతంగా నాలో స్థానం లభిస్తుంది అని ఆశీర్వదించాడు. వెంటనే ధర్మవ్యాధుడి శరీరం నుంచి ఒక దివ్యమైన వెలుగు బైటికి వచ్చి సనాతనుడైన ఆ శ్రీహరిలో కలిసిపోయింది. ఏకాదశినాడు ఉపవాసముండి శ్రీహరిని ఆరాధించి ధర్మవ్యాధుడు చేసిన ఈ స్తోత్రాన్ని శ్రద్ధగా పఠించేవాడు, విన్నవాడు డెబ్భై మన్వంతరాల కాలం శ్రీహరి నివాసంలో సుఖంగా నివసిస్తారు.

## గౌరముఖుడి వృత్తాంతం

పూర్వం కృతయుగంలో 'సుప్రతీకుడనే' మహారాజుండేవాడు. అతడికి ఇద్దరు భార్యలు. అయితే వారికి ఎప్పటికీ సంతానం కలుగలేదు. అప్పుడా

సుప్రతీకుడు చిత్రకూట పర్వతంమీద నివసిస్తున్న ఆత్రేయుడనే మునిని దర్శించాడు. ఆయన అనుగ్రహంతో మహావీరుడైన దుర్జయుడనే పుత్రుణ్ణి కన్నాడు.

దుర్జయుడు అపారమైన సైన్యసంపత్తి కలిగిన మహాబలవంతుడు. అతడు దిగ్విజయయాత్రకి వెళ్ళి భూమండలాన్నంతా అవలీలగా జయించాడు. అంతేకాదు అష్టదిక్పాలకుల్ని కూడా జయించి విజయ గర్వంతో తన రాజ్యానికి తిరిగి వస్తున్నాడు. దారిలో అతడికి గౌరవముఖుడనే మహర్షి ఆశ్రమం కనిపించింది. తన అపార సైన్యాన్ని వెలుపలే ఉంచి దుర్జయుడు లోపలికి వెళ్ళి గౌరముఖుడికి నమస్కరించి ఆశీర్వాదాన్ని కోరాడు. గౌరముఖుడు రాజుని గౌరవించి అతడికి అతడి సైన్యానికీ ఆతిథ్య మిస్తానన్నాడు. దుర్జయుడు ఆశ్చర్యపోయాడు అన్ని లక్షలమంది ఎలా ఈ ముని ఆహారం పెడతాడు అని ఆలోచించాడు. అంతలో గౌరముఖుడు స్నాన సంధ్యలు ఆచరించివస్తానని చెప్పి అక్కడే ఉన్న గంగానది దగ్గరకి వెళ్ళాడు. ఆ గంగలోనిలిచి ఎంతో భక్తిగా నారాయణ స్తుతి చేసాడు.

## గౌరముఖుడు చేసిన నారాయణస్తుతి

నమోఽస్తు విష్ణవే నిత్యం నమస్తే పీతవాసినే<br>
నమస్తే చాద్యరూపాయ నమస్తే జలరూపిణే ॥ 1

నమస్తే సర్వసంస్థాయ నమస్తే జలశాయినే,<br>
నమస్తే క్షితిరూపాయ నమస్తే తేజసాత్మనే ॥ 2

నమస్తే వాయురూపాయ నమస్తే వ్యోమరూపిణే<br>
త్వం దేవః సర్వభూతానాం ప్రభు స్త్వమసి హృచ్ఛయః ॥ 3

త్వమోఙ్కారో వషట్కారః సర్వత్రైవచ సంస్థితః<br>
త్వం మాదిః సర్వదేవానాం త వ చా ది ర్న విద్యతే ॥ 4

త్వంభూ స్త్వం చ భువో దేవ త్వంజన స్త్వం మహః స్మృతః<br>
త్వం తప స్త్వం చ సత్యం చ త్వయి దేవ చరాచరమ్ ॥ 5

త్వత్తో భూత మిదం విశ్వం త్వదుద్భూతా ఋగాదయః<br>
త్వత్తః శాస్త్రాణి జాతాని త్వత్తో యజ్ఞాః ప్రతిష్ఠితాః ॥ 6

త్వత్తో వృక్షా వీరుధశ్చ త్వత్తః సర్వా వనౌషధీః
పశవః పక్షిణః సర్పా స్త్వత్త ఏవ జనార్దన ॥ 7

మమాపి దేవదేవేశ రాజా దుర్జయ సంజ్ఞితః
అగతో ఉ భ్యాగత స్తస్య ఆతిథ్యం కర్తు ముత్సహే ॥ 8

తస్య మే నిర్ధన స్యాద్య దేవదేవ జగత్పతే
భక్తినమ్రస్య దేవేశ కురుష్వా న్నాద్య సంచయమ్ ॥ 9

యం యం స్పృశామి హస్తేన యం యం పశ్యామి చక్షుషా
వృక్షం వా తృణకన్దం నా తత్త దన్నం చతుర్విధమ్ ॥ 10

తథా త్వన్యతమం వా ఉ పి యద్ధ్యాతం మనసా మయా
తత్ సర్వం సిద్ధ్యతాం మహ్యం నమస్తే పరమేశ్వర ॥ 11

*(శ్లో॥11-21,అధ్యా-11)*

గౌరముఖుడి స్తుతి పూర్తికాగానే శంఖ చక్ర గదాధరుడైన శ్రీహరి అక్కడ సాక్షాత్కరించాడు. వేయి సూర్యుల కాంతితో ప్రకాశిస్తున్న స్వామిని చూసి ఎంతో పులకించిన గౌరముఖుడు "స్వామీ! దుర్జయుడనే మహారాజు సైన్యసమేతంగా నా ఆశ్రమానికి వచ్చాడు. అతడికి, అతడి సైన్యనికి సంపూర్ణంగా భోజనం పెట్టే వరాన్నివ్వు అని ప్రార్థించాడు. గౌరముఖుడి ప్రార్థన విన్న నారాయణుడు కరుణించి ఆయనకొక దివ్యమణిని ప్రసాదించి ఇది నీవు కోరినవన్నీ ఇస్తుందని చెప్పి అదృశ్యమయ్యాడు.

గౌరముఖుడు నారాయణుడు తనకి ప్రసాదించిన మణి ప్రభావంతో తన ఆశ్రమ ప్రాంగణంలో ఒక పెద్ద మహానగరాన్ని, అందులో దాస దాసీ జనాన్ని కావలసిన భోజన పదార్థాల్ని సంకల్పించాడు. ఒక్క క్షణంలోనే అవన్నీ అక్కడ ప్రత్యక్షమయ్యాయి. దుర్జయుడు అతడి పరివారం ఎంతో ఆనందంగా, ఆశ్చర్యంగా ఆ నగరంలోకి ప్రవేశించారు. అక్కడ వారికి కావలసింది తిని ఆనందంగా విశ్రమించారు. మర్నాడు ఉదయం అందరూ నిద్రలేచి కాలకృత్యాలు తీర్చుకునేసరికి నగరం, దాసదాసీజనం అంతా అదృశ్యమైపోయారు. దుర్జయుడికి అతడి పరివారానికీ గౌరముఖుడి దివ్య శక్తినిచూసి ఆశ్చర్యం కలిగింది.

అందరూ ఆయన వద్ద వీడ్కోలు తీసుకుని బయలుదేరారు. కొద్ది దూరం వచ్చాక దుర్జయుడికి ఒక దుష్ట ఆలోచన వచ్చింది. ఆ మహర్షి ఏవిధంగా తమకి ఆతిథ్యం ఇవ్వగలిగాడో తెలుసుకుని రమ్మని పరివారాన్ని పంపాడు. వారు తిరిగి వచ్చి శ్రీహరి అనుగ్రహంతో ఆయనొకమణిని సంపాదించాడని, దాని ప్రభావంతోనే తమందరికీ ఆతిథ్యం ఇవ్వగలిగాడని చెప్పారు. దుర్జయుడు ఎలాగైనా గౌరముఖుడి దగ్గరున్న మణిని చేజిక్కించుకోవాలనుకున్నాడు. వెంటనే తన మంత్రిని ఆ ముని దగ్గరకి పంపాడు.

దుర్జయుడి మంత్రి వెనక్కి తిరిగివచ్చి గౌరముఖుడు మణిని రాజుగారికి ఇవ్వనన్నాడని చెప్పాడు. దుర్జయుడికి ఆగ్రహం కలిగింది. వెంటనే తన సైన్యాన్ని వెనక్కితిప్పి గౌరముఖుడి ఆశ్రమం మీదకి వచ్చాడు. అదిచూసిన గౌరముఖుడు దివ్యమణిని చేతిలో ధరించి ఒక్కసారి మనసులో స్మరించాడు. అంతే ఒక్కసారిగా ఆ మణినుంచి వేలకొద్దీ అస్త్రధారులైన సైన్యం ఆవిర్భవించారు. దుర్జయుడి సైన్యానికి ఈ సైన్యానికీ మధ్య ఘోరంగా పోరు ప్రారంభమయ్యింది. మణినుంచి ఆవిర్భవించిన సైన్యం చేతిలో దుర్జయుడి సైన్యం వధించబడ్డారు. కొంత సమయం తరువాత గౌరముఖుడు యుద్ధరంగానికి వెళ్ళి అక్కడే కూర్చుని భక్తిగా శ్రీహరిని ధ్యానించాడు. పీతాంబర ధారియై శంఖ, చక్ర, గదాపద్మాల్ని ధరించిన శ్రీహరి ప్రత్యక్షమై ఎందుకు స్మరించావు అని అడగగా, గౌరముఖుడు నమస్కరించి, దుర్జయుడు చేసిన దుర్మార్గాన్నంతా ఆయనకి వివరించాడు. ఎలాగైనా ఆ దుష్టదుర్జయుణ్ణి సంహరించమని శ్రీహరిని కోరాడు. వెంటనే శ్రీహరి సుదర్శన చక్రాన్ని ప్రయోగించి దుర్జయుణ్ణి అతడి సైన్యాన్ని భస్మీపటలం చేసాడు. ఆ విధంగా గౌరముఖుడు శ్రీహరి అనుగ్రహంతో, కోరినవన్నీ చేయగలిగిన దివ్యశక్తిని సాధించాడు.

## సుప్రతీకుడి వృత్తాంతం

సుప్రతీక మహారాజుకి, తన కుమారుడు దుర్జయుడు, అతడి పరివారం మొత్తం శ్రీహరి సుదర్శనచక్రం ద్వారా భస్మంచేయబడ్డారన్న విషయం తెలిసింది.

ఆయనెంతో బాధపడ్డాడు. చిత్రకూటమనే పర్వతం మీద శ్రీమహావిష్ణువు శ్రీరాముడనే పేరుతో పూజించబడుతున్నాడని తెలిసి అక్కడికి వెళ్ళాడు. అక్కడున్న శ్రీరామచంద్రమూర్తిని ఎంతో గొప్పవాడిగా భావిస్తూ ఆయన్నిలా దివ్యంగా స్తుతించాడు.

## శ్రీరామస్తుతి

నమామి రామం నరనాథ మచ్యుతం కవిం పురాణం త్రిదశారినాశనమ్ ।
శివస్వరూపం ప్రభవం మహేశ్వరం సదా ప్రసన్నార్తిహరం ధృతశ్రియమ్ ॥ 1

భవాన్ సదా దేవ నమస్త తేజసాం కరోషి తేజాంసి సమస్తరూపధృక్ ।
క్షితౌ భవాన్ పఞ్చగుణ స్తథా జలే చతుః ప్రకార స్త్రినిధోఽథ తేజసి ।
ద్విధాఽథ వాయౌ వియతి ప్రతిష్ఠితో భవాన్ హరే శబ్ద నపుఃపుమానసి ॥ 2

భవాన్ శశీ సూర్య హుతాశనోఽసి త్వయి ప్రలీనం జగదేత దచ్యుతే ।
భవత్ప్రతిష్ఠితం రమతే జగద్ యతః స్తుతో ఽసి రామేతి జగత్ప్రతిష్ఠితమ్ ॥ 3

భవార్ణవే దుఃఖతరోర్మిసంకులే తథాక్షమాన గ్రహణే ఽతిభీషణే ।
న మజ్జతి త్వత్స్మరణ ప్లవో నరః స్మృతోఽసి రామేతి తథా తపోవనే ॥ 4

వేదేషు నష్టేషు భవాం స్తథా హరే కరోషి మాత్స్యం వపురాత్మనః సదా ।
యుగక్షయే రఞ్జిత సర్వ దిఙ్ముఖో భవాం స్తథాగ్ని ర్బహురూపధృగ్ విభో ॥ 5

కౌర్మం తథా తే వపు రాస్థితః సదా యుగే యుగే మాధవ తోయమన్థనే ।
న చాన్య దస్తీతి భవత్సమం క్వచి జ్జనార్దనాద్ యః స్వయం భూతముత్తమమ్॥ 6

త్వయా తతం విశ్వ మిదం మహాత్మన్ స్వకాఖిలాన్ వేద దిశశ్చ సర్వాః ।
కథం త్వ మాద్యం పరమం తు ధామ విహాయ చాన్యం శరణం వ్రజామి ॥ 7

భవా నేకః పూర్వ మాసీత్ తతశ్చ త్వత్తో మహీ సలిలం వహ్ని రుచ్చైః ।
వాయు స్తథా ఖం చ మనోఽపి బుద్ధి శ్చేతో గుణా స్త్వత్ప్రభవం చ సర్వమ్ ॥ 8

త్వయా తతం విశ్వ మిదం సమస్తం సనాతన స్త్వం పురుషో మతో మే ।
సమస్త విశ్వేశ్వర విశ్వమూర్తే సహస్రబాహో జయ దేవ దేవ ।
నమోఽస్తు రామాయ మహానుభావ ॥ 9

*(శ్లో॥3-12,అధ్యా-12)*

ఆ విధంగా సుప్రతీకుడు స్తుతించగానే దేవాదిదేవుడైన శ్రీహరి దర్శనమిచ్చి వరాన్ని కోరుకోమన్నాడు. సుప్రతీకుడు ఆనంద తన్మయత్వంతో స్వామికి నమస్కరించి "ప్రభూ!నీ దివ్య దేహంలో లయమయ్యేలా వరాన్నివ్వు" అని కోరాడు. తథాస్తు అని శ్రీహరి అనగానే సుప్రతీకుడు రాక్షస సంహారి అయిన ఆయనలో సంపూర్ణంగా లీనమైపోయాడు.

## ప్రతిపత్తిథి - అగ్ని వృత్తాంతం

పూర్వం బ్రహ్మదేవుడి కోపం నుంచి అగ్ని పుట్టింది. అలా పుట్టిన అగ్ని బ్రహ్మతో ప్రభూ! నాకొక తిథిని ప్రసాదించండి. ఆ తిథినాడు నేను అందరిచేతా పూజించబడుతూ ఖ్యాతిని పొందుతాను అని కోరింది. అప్పుడు బ్రహ్మదేవుడు అగ్నితో "ఓయీ! పావకా! దేవ, దానవ, యక్ష, గంధర్వులలో ఉత్తముడవైన నీవు పాడ్యమి అనగా ప్రతిపత్తిథిలో జన్మించావు. కనుక నేటినుంచీ నీకు ప్రత్యేకమైన తిథిగా ప్రతిపత్తిథిని నిర్ణయిస్తున్నాను అన్నాడు.

ప్రజాపతి ద్వారా అగ్నిదేవుడి కోసం నిర్ణయించబడ్డ ప్రతిపత్తి (పాడ్యమి) తిథినాడు హోమం చేస్తే పితృదేవతలు, ఇతర దేవతలు ఎంతో సంతోషిస్తారు. వారే కాదు పశువులు, అసురులు, గంధర్వులు లాంటివారు పంచభూతాల్లో మిగిలిన నాలుగు భూతాలు కూడా తృప్తి చెందుతాయి. అగ్నిదేవుణ్ణి ఉపాసించేవారు. పాడ్యమినాడు ఉపవాసం చేసినా, లేక కేవలం పాలుమాత్రమే త్రాగి గడిపినా ఎంతో గొప్ప ఫలం పొందుతారు. ఈ విధంగా నియమంతో అగ్నిని ఉపాసించేవారు ఇరవై ఆరు మహాయుగాలు స్వర్గంలో నివసిస్తారు.

అగ్నిని పూజించి, అగ్నివ్రతాన్ని ఆచరించిన వారికి గొప్ప తేజస్సు, సౌందర్యం, సంపద, ఆరోగ్యం లభిస్తాయి. ఉన్నతమైన భోగాల్ని ఇహపరాలు రెండిట్లో అనుభవిస్తారు. ప్రతిరోజూ ఉదయం అగ్నిని గురించి చెప్పిన ఈ కథనాన్ని ఎవరైతే పఠిస్తారో వారు అన్ని పాపాలనుంచీ విముక్తి పొందుతారు.

## ద్వితీయాతిథి - అశ్వినీ దేవతలు

బ్రహ్మదేవుడు స్వయంగా తొమ్మిది మంది మహర్షులుగా అవతరించాడు. వారిలో మరీచి మహర్షి ఎంతో గొప్పవాడుగా ప్రసిద్ధిచెందాడు. ఆ మరీచికి కశ్యపుడనే ప్రజాపతి జన్మించాడు. కశ్యపుడు దేవతలకు తండ్రి. ఆయనకి తన భార్య అదితి ద్వారా పన్నెండుమంది ఆదిత్యులు(సూర్యులు) పుత్రులుగా జన్మించారు. ఆదిత్యులు నారాయణ స్వరూపులు. ఒక్కటిగా ఉన్న నారాయణ స్వరూపమే పన్నెండు విధాలుగా రూపొందింది. ఈ ద్వాదశ ఆదిత్యుల్లో మహాతేజోవంతుడుగా మార్తాండుడు ప్రసిద్ధి చెందాడు. శ్రీహరి సంవత్సర స్వరూపుడు కాగా 12 మంది ఆదిత్యులు 12 మాసాలుగా ఉన్నారు.

మార్తాండుడికి త్వష్టప్రజాపతి తన కూతురు 'సంజ్ఞ' అనే కన్యనిచ్చి వివాహం జరిపించాడు. మార్తాండుడికి, సంజ్ఞాదేవికి యముడు, యమున అనే ఇద్దరు పురుష స్త్రీ సంతానం కలిగారు. అయితే సంజ్ఞాదేవి మార్తాండుడి తేజస్సుని భరించలేకపోయేది. ఇక ఆయన దగ్గర ఉండలేక ఒక ఛాయా సంజ్ఞని సృష్టించి ఆమెని తన భర్త దగ్గర ఉంచింది. తాను ఒక ఆడగుర్రంగా మారి ఉత్తర కురుభూమిలో తపస్సు చేసుకోవటానికి వెళ్ళిపోయింది. ఈ విషయం తెలియని మార్తాండుడు ఛాయసంజ్ఞతో సంసారం చేసి శని-తపతి అనే ఇద్దరు పిల్లల్ని కన్నాడు. ఛాయా సంజ్ఞ తన పిల్లల్ని - అసలు సంజ్ఞాదేవి పిల్లల్ని వివక్షతో చూడటం ప్రారంభించింది. ఈ విషయం తెలుసుకున్న మార్తాండుడు ఆమెని హెచ్చరించాడు. అలా పిల్లల మధ్య విచక్షణ చూపకూడదని హితవుచెప్పాడు. అయినా ఆమె తీరేం మారలేదు.

ఒకనాడు యముడు ఎంతో దుఃఖిస్తూ తండ్రి దగ్గరకొచ్చి నాయనా! ఈమె మా తల్లిలా లేదు. మా మీద ఎంతో శత్రుత్వం పెంచుకుంది. సవతి తల్లిలా మమ్మల్ని ప్రతిదానికీ దూషిస్తోందని" చెప్పాడు. ఆ విషయం తెలుసుకున్న ఛాయా సంజ్ఞని యముడిని "ప్రేతాలకు రాజువికా" అని శపించింది. మార్తాండుడికి ఆ విషయం తెలిసి తన పుత్రుడైన యముణ్ణి పిలిచి కుమారా! నీవేం బాధపడకు. నీవు సమవర్తిగా, యమధర్మరాజుగా కీర్తి పొందుతావు అని వరాన్ని ప్రసాదించాడు.

మార్తాండుడికి అసలు విషయం తెలిసింది. తన దగ్గరున్నది తన భార్య కాదని గ్రహించాడు. వెంటనే తాను ఒక మగగుర్రంలా మారి ఉత్తర కురుభూముల వైపు ప్రయాణమయ్యాడు. కురు భూమిలో సంజ్ఞాదేవి ఆడగుర్రం రూపంలో నివసిస్తోంది. మర్తాండుడు అక్కడకి వచ్చి ఆమెతో ఆనందంగా అశ్వరూపంలో సంగమించాడు. వారిద్దరికీ అశ్వరూపులైన ఇద్దరు పుత్రులు జన్మించారు. వారే అశ్వినీ దేవతలు. అశ్వినీ దేవతలిద్దరూ తమ తండ్రి అయిన మార్తాండుడి దగ్గరకొచ్చి తండ్రీ! మేము ఏం చేయాలి? మా కర్తవ్యాన్ని నిర్దేశించండి అని కోరారు. అప్పుడు మార్తాండుడు వారితో "కుమారులారా! మీరిద్దరూ భక్తి శ్రద్ధలతో పరబ్రహ్మ నారాయణుణ్ణి ఉపాసించండి. దానివల్ల మీకు మేలు జరుగుతుంది అని ప్రబోధించాడు. అంతేకాదు వారిద్దరికీ ఆ నారాయణపరబ్రహ్మ స్తోత్రాన్ని కూడా ఉపదేశించాడు.

## నారాయణ పరబ్రహ్మ స్తోత్రం

ఓం నమస్తే నిష్క్రియ నిష్ప్రపంచ నిరాశ్రయ నిరపేక్ష నిరాలంబ,
నిర్గుణ నిరాలోక నిరాధార నిర్మమ నిరాకార ॥ 1

బ్రహ్మ మహాబ్రహ్మ బ్రాహ్మణ ప్రియ, పురుష మహాపురుష పురుషోత్తమ
దేవ మహాదేవ దేవోత్తమ స్థాణో స్థితిస్థాపక ॥ 2

భూత మహాభూత భూతాధిపతే యక్ష మహాయక్ష యక్షాధిపతే
గుహ్య మహాగుహ్య గుహ్యాధిపతే సౌమ్య మహాసౌమ్య సౌమ్యాధిపతే॥ 3

పక్షి మహాపక్షి పతే దైత్య మహాదైత్యాధిపతే రుద్ర
మహారుద్రాధిపతే విష్ణో మహావిష్ణుపతే
పరమేశ్వర నారాయణ ప్రజాపతయే నమః ॥ 4

*(శ్లో॥28-30, అధ్యా-20)*

ఈ విధంగా అశ్వినీదేవతలు సూర్యుడు చెప్పిన ఈ నారాయణ పరబ్రహ్మ స్తోత్రాన్ని ఎంతో శ్రద్ధగా పఠిస్తూ ఎన్నో సంవత్సరాలు దీక్షగా తపస్సు చేశారు. ఒక శుభముహూర్తంలో ప్రజాపతి అయిన ఆ పరబ్రహ్మ వారికి ప్రత్యక్షమై

వరం కోరుకోమన్నాడు. అశ్వినీదేవతలు ప్రజాపతికి భక్తితో నమస్కరించి వినయంగా "ప్రభూ! మా ఇద్దరికీ సోమరసాన్ని త్రాగే అధికారాన్ని ప్రసాదించు. శాశ్వతంగా మాకు దేవతలతో సమానమైన స్థితిని కల్పించు. మాకొక ప్రత్యేక గుర్తింపు కావాలి ప్రభూ! ఇదే మా కోరిక అని అన్నారు. ప్రజాపతి చిరునవ్వుతో "అశ్వినీ దేవతలారా! మీరు నేటి నుంచీ సోమపానం చేసే అర్హత పొందుతారు. అలాగే దేవ వైద్యులుగా మీరు ప్రసిద్ధి చెందుతారు. మీరు దేవతలతో సమానంగా పూజించబడతారు. అందమైన రూపం, తేజస్సు మీకు కలుగుతాయి" అని వరమిచ్చి అంతర్ధానమయ్యాడు.

అశ్వినీ దేవతలు ప్రజాపతి ద్వారా ఉత్తమమైన వరాన్ని పొందిన తిథి విదియ. కనుక ఈ తిథి అశ్వినీ దేవతలకి అత్యంత ప్రీతిపాత్రమైనది. మంచి రూపాన్ని, తేజస్సుని, ఆరోగ్యాన్ని పొందాలనుకునేవారు ప్రతి విదియ (ద్వితీయతిథి) నాడు కేవలం పుష్పాల్నే ఆహారంగా స్వీకరిస్తూ ఒక సంవత్సరకాలం అశ్వినీ దేవతల్ని ఆరాధిస్తే వారికి ఆరోగ్యం, ఆయుర్దాయం, సౌందర్యం తేజస్సు లభిస్తాయి. ఇది ఎంతో శుభప్రదమైన అశ్వినీ దేవతలవ్రతం.

## తృతీయా(తదియ) తిథి-గౌరీ-రుద్రసృష్టి వృత్తాంతం

పూర్వం బ్రహ్మదేవుడు వివిధరకాలుగా సృష్టిచేయాలని సంకల్పించాడు. అయితే ఆయన ఎంత ప్రయత్నించినా సృష్టి జరగటం లేదు. దాంతో ఆయనకి విపరీతమైన కోపం వచ్చింది. ఆ కోపం నుంచి రుద్రుడనేవాడు జన్మించాడు. పుట్టటంతోనే ఆ బాలుడు రోదనం (ఏడవటం) చేయటం వల్ల అతడికి రుద్రుడనే పేరు పెట్టాడు బ్రహ్మ.కొంతకాలం తరువాత ఆ రుద్రుడికి ఒక భార్యని ఏర్పర్చాలని సంకల్పించిన బ్రహ్మ తన శరీరం నుంచి గౌరి అనే అందమైన కన్యని సృష్టించాడు. ఆ అందాల గౌరిని రుద్రుడుకిచ్చి వివాహం జరిపించాడు.

రుద్రుడు గౌరిని స్వీకరించి ఎంతో ఆనందించాడు. కొన్నాళ్ళు గడిచాక బ్రహ్మ రుద్రుణ్ణి పిలిచి సంతానాన్ని వృద్ధి చేయమని ఆజ్ఞాపించాడు. తండ్రి మాట విన్న రుద్రుడు. సంతానం వృద్ధి చేయాలంటే ముందుగా తపస్సు చేసి

శక్తిని సంపాదించాలని భావించి, వెంటనే నీటిలో మునిగి తపస్సు చేయటం ప్రారంభించాడు. ఈ విషయం తెలిసిన బ్రహ్మ వెలుపలే వున్న గౌరిని తిరిగి తన శరీరంలోకి లీనం చేసుకున్నాడు.

బ్రహ్మదేవుడు, రుద్రుడు సంతానాన్ని వృద్ధిచేయకుండా తపస్సు చేసుకోవటానికి వెళ్ళిపోగా, తిరిగి ప్రజల్ని సృష్టించాలనుకున్నాడు. వెంటనే తన మనసునుంచి దక్షుడితో పాటు ఏడుగురు ప్రజాపతుల్ని సృష్టించాడు. వారంతా బ్రహ్మ ఆదేశాన్ని పాటిస్తూ సృష్టిని కొనసాగించారు. దక్షుడికి తదితర ప్రజాపతులకి దేవతలు, అష్టవసువులు ద్వాదశ ఆదిత్యులు సప్తమరుత్తులు అనేవారు జన్మించారు. వారంతా తిరిగి అసంఖ్యాకంగా తమ తమ గణాల్ని వృద్ధి చేశారు. బ్రహ్మ దేవుడు ఇంతకుముందు తనలో లీనం చేసుకున్న గౌరిని దక్షప్రజాపతికి కుమార్తెగా ప్రసాదించాడు.ఆ విధంగా గౌరి దక్షుడి కూతురు దాక్షాయణిగా తిరిగి జన్మించింది.

దక్షప్రజాపతి ఇంకా ఎంతోమంది సంతానాన్ని కని ప్రజాసృష్టిని మరింతగా వృద్ధిచేయాలని భావించాడు.అందుకోసం గొప్పయాగాన్ని తలపెట్టాడు. ఎంతో గొప్పదైన ఆ యాగాన్ని నిర్వహించటానికి మరీచి, అత్రి, అంగిరసుడు, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, ప్రచేతసుడు, వశిష్ఠుడు, సనకుడు లాంటి మహర్షులు బ్రహ్మ మానసపుత్రులు విచ్చేసారు.

మహావైభవంగా సాగుతున్న దక్షుడి యజ్ఞంలో ఎంతోమంది దేవతలు స్వయంగా పాల్గొన్నారు. ఆయన యజ్ఞంలో సమర్పించే ఆహుతుల్ని, హవిస్సుల్ని విశ్వేదేవతలు, పితృదేవతలు, గంధర్వులు, స్వయంగా వచ్చి స్వీకరిస్తున్నారు. అంతలో పూర్వం తపస్సుకోసం నీటిలో మునిగిన రుద్రుడు ఒక్కసారిగా పైకిలేచాడు. వెయ్యి సూర్యుల తేజస్సుతో ఆ మహాదేవుడు దివ్యంగా వెలిగిపోతున్నాడు. పైకిలేచిన ఆ మహారుద్రుడు ఒక్క పెట్టునగట్టిగా రోదించాడు.

ఎన్నో వేల సంవత్సరాలు నీళ్ళల్లో వుండి తపస్సుచేసి మేల్కొన్న రుద్రుడు చక్కనిపైర్లతో, అడవులతో, కొండలతో, నదులు, సముద్రాలతో ఉన్న

భూమండలాన్ని చూసాడు. అలాగే దక్షుడి యజ్ఞవాటికలో ఋత్విక్కులు చేస్తున్న వేదనాదాల్ని కూడా విన్నాడు. అవి వినేసరికి రుద్రుడికి కోపం వచ్చింది. వెంటనే పెద్ద స్వరంతో మీరంతా ఎవరు? బ్రహ్మదేవుడు మొదట నన్ను పుట్టించి సృష్టి చేయమన్నాడు. నేను వచ్చే లోపల ఈ సృష్టినంతా ఎవరుచేసారు? అని మహాభీకరంగా గర్జించాడు. అప్పుడాయన చెవుల నుంచి భయంకరమైన భూతాలు, పిశాచాలు, ప్రేతాలు, కూష్మాండాది అసుర, భేతాళగణాలు కోట్లకొద్దీ ఆవిర్భవించాయి.వారంతా దక్షయజ్ఞ విధ్వంసానికి పూనుకున్నారు.

దేవతలకి రుద్రగణాలకీ మధ్య పోరు ప్రారంభమైంది. ఒకర్నొకరు తీవ్రంగా గాయపరుచుకుంటున్నారు. అంతలో రుద్రుడు, మహావిష్ణువు తలపడ్డారు. ఒకరిపై ఒకరు దివ్యాస్త్రాల్ని ప్రయోగించుకోసాగారు.

లోకాలన్నీ ఈ సంగ్రామం తాకిడికి తల్లడిల్లిపోయాయి. ఈ విషయం తెలిసిన బ్రహ్మ పరుగున అక్కడికి వచ్చి రుద్ర–విష్ణువుల్ని శాంతింపచేసాడు. వారితో "రుద్ర–విష్ణులారా! మీ ఇద్దరూ హరిహరులుగా లోకంలో కీర్తి పొందుతారు. మీ ఇద్దరూ శత్రువులు కారు. నేటి నుంచీ శాశ్వత మిత్రులు ఈ దక్షుడి యజ్ఞం ఇప్పుడు విధ్వంసమైంది. ముందు ఈ యజ్ఞాన్ని ఉద్ధరించి లోకాలకి మేలు చేయండి అని వారికి హితబోధ చేసాడు. ఆ తరువాత దక్షాది ప్రజాపతులవైపు తిరిగి ప్రజాపతులారా! ఈ రుద్రుడు నా పుత్రుడు నేటి నుంచీ మీరు చేసే యజ్ఞాలలో జ్యేష్ఠబాగాన్ని రుద్రుడికివ్వండి. రుద్రుడు మీ అందరికీ ఆరాధ్యనీయుడు. ఈ మహాదేవుణ్ణి స్తుతించి సకల శుభాలూ పొందండి" అని ఆజ్ఞాపించాడు. వెంటనే దేవతలంతా ఎంతో భక్తి శ్రద్ధలతో రుద్రుణ్ణి ఇలా స్తుతించటం ప్రారంభించారు.

## సకల దేవతాకృత రుద్ర స్తుతి

నమో విషమనేత్రాయ నమస్తే త్ర్యమ్బకాయ చ,
నమః సహస్రనేత్రాయ నమస్తే శూలపాణయే ॥ 1

నమః ఖట్వాంగహస్తాయ నమో దణ్డభృతే కరే,
త్వం దేవ హుతభుగ్జ్వాలా కోటి భాను సమప్రభః ॥ 2

ఆదర్శనేన యద్ దేవ మూఢ విజ్ఞానతోఽధునా,
కృత మస్మాభి రేవేశ తదత్ర క్షమ్యతాం ప్రభో ॥ 3

నమస్త్రినేత్రార్తి హరాయ శంభో త్రిశూలపాణే వికృతాస్యరూప
సమస్త దేవేశ్వర శుద్ధభావ ప్రసీద రుద్రాచ్యుత సర్వభావ 4

పూష్ణోఽస్య దన్తాన్తక! భీమరూప! ప్రలంబ భోగీన్ద్రలులన్తకణ్ఠ !
విశాలదేహాచ్యుత! నీలకణ్ఠ! ప్రసీద విశ్వేశ్వర! విశ్వమూర్తే! 5

భగాక్షి సంస్ఫోటన దక్షకర్మా గృహాణ భాగం ముఖతః ప్రధానమ్
ప్రసీద దేవేశ్వర! నీలకణ్ఠ! ప్రపాహి నః సర్వగుణోపపన్న! 6

సితాఙ్గ రాగా ప్రతిపన్నమూర్తే కపాలధారిం స్త్రిపురఘ్న దేవ,
ప్రపాహి నః సర్వభయేషు చైవ ఉమాపతే పుష్కరనాళ జన్మ ॥ 7

పశ్యామ తే దేహగతాన్ సురేశ సర్గాదయో వేదవరా ననన్త
సాఙ్గాన్ సవిద్యాన్ సపదక్రమాంశ్చ సర్వాన్ నిలీనాం స్త్వయి దేవ దేవ ॥ 8

భవ శర్వ మహాదేవ పినాకిన్ రుద్ర తేహర,
నతాః స్మ సర్వే విశ్వేశ త్రాహి నః పరమేశ్వర ॥ 9

ఇత్థం స్తుత స్తదా దేవై ర్దేవదేవో మహేశ్వరః,
తుతోష సర్వదేవానాం వాక్యం చేద మువాచ హ ॥ 10

భగస్య నేత్రం భవతు పూష్ణో దన్తా స్తథా మఖః,
దక్షస్యాచ్ఛిద్రతాం యాతు యజ్ఞశ్చాదితేః సుతాః
పశుభావం తథా చాపి ఆపనేష్యామి వః సురాః॥ 11

మద్దర్శనేన యో జాతః పశుభావో దివౌకసామ్
స మయాపహృతః సద్యః పతిత్వం వో భవిష్యతి॥ 12

*(శ్లో॥64-73,అధ్యా-21)*

ఆ విధంగా దేవతలందరూ తనని భక్తిగా స్తుతించటంతో రుద్రుడు శాంతించాడు. ఎంతో ప్రశాంతంగా వారితో “దేవతలారా! మా భూతగణాలతో జరిగిన యుద్ధంలో మీ దేవతలకి తగిలిన గాయాలన్నీ మానిపోగాక! దక్షుడు చేస్తున్న ఈ యజ్ఞం ఏ లోపం లేకుండా సాగుగాక! మీలో ఉన్న పశుభావం

తొలగిపోవుగాక! మీమీ ఆధిపత్యాలు మీకు తిరిగి లభించుగాక! నేను అన్ని విద్యలకీ ప్రభువుని.సనాతనుణ్ణి. నేనే పశుపతిని, నన్ను పూజించిన వారికి పాశుపతదీక్ష లభిస్తుంది” అని పలికాడు.

రుద్రుడి వచనాలు విన్న బ్రహ్మ సంతోషించి “ఆయనతో రుద్రా! నీవు లోకంలో పశుపతిగా ఎంతో కీర్తి పొందుతావు. ఇది సత్యం” అని చెప్పి దక్షుణ్ణి పిలిచి అతడి కుమార్తెని గౌరిని రుద్రుడికిచ్చి వివాహం చేయమని ఆజ్ఞాపించాడు. దక్షుడు ఆనందంగా అంగీకరించి సకల దేవతల సమక్షంలో సర్వమంగళకారిణి అయిన గౌరిని శంకరుడికిచ్చి వివాహం జరిపించాడు. దాక్షాయణిని చేపట్టిన శివుడికి కైలాసాన్ని నివాసంగా ఏర్పాటుచేసాడు బ్రహ్మ. వెంటనే రుద్రుడు తన భూత గణాలన్నిటినీ వెంటబెట్టుకుని దాక్షాయణితో సహా కైలాసానికి వెళ్ళిపోయాడు.

## పార్వతీదేవి వృత్తాంతం

గౌరీ శంకరులు కైలాసంలో ఆనందంగా కాలం గడుపుతున్నారు. ఒకనాడు గౌరీదేవికి పూర్వం జరిగిన సంఘటనలు గుర్తుకువచ్చాయి. తన తండ్రిచేస్తున్న యాగాన్ని ధ్వంసం చేసినందుకు రుద్రుడి మీద కోపం వచ్చింది. “నా భర్త అయిన ఈ రుద్రుడు అకారణంగా ఆనాడు నా తండ్రిని అవమానించి ఎందరో దేవతల్ని హింసించాడు. కనుక నేను ఈ శరీరాన్ని వదిలి వేరే శరీరంతో తిరిగి ఈయన్ని చేరుకుంటాను. అంతదాకా రుద్రుడు నా వియోగాన్ని అనుభవిస్తాడు” అని భావించింది. వెంటనే కైలాసం వదిలి హిమాలయంలో రహస్య ప్రాంతానికి వెళ్ళి తన శరీరాన్ని కృశింపచేసి యోగాగ్ని ద్వారా దానిని దగ్ధం చేసుకుంది.

దాక్షాయణి తిరిగి హిమవంతుడికి పుత్రికగా ఉమ అనే పేరుతో జన్మించింది. ఆమె చిన్న తనం నుంచే పరమేశ్వరుడే నా భర్త అని భావిస్తూ శివుడి కోసం ఘోరంగా తపస్సు చేయటం ప్రారంభించింది. కఠోరమైన ఆమె తపస్సుని పరీక్షించటానికి స్వయంగా శివుడే మారువేషంలో వచ్చి పరీక్షించాడు.

ఆమె దీక్షకు, భక్తి శ్రద్ధలకు ఎంతో ఆనందించాడు. తాను కూడా ఉమాదేవినే వివాహం చేసుకోవాలని నిశ్చయించుకున్నాడు.

ఈ విషయం తెలిసి హిమవంతుడు ఎంతో ఆనందంగా తన కుమార్తెని శివుడికిచ్చి వివాహం జరపటానికి సమ్మతించాడు. ఒక శుభముహూర్తంలో సకల దేవతలు, రుద్రగణాలు, సిద్ధులు, మహర్షులు, బ్రహ్మర్షుల సమక్షంలో పార్వతీ పరమేశ్వరులకి వివాహం జరిగింది. వచ్చిన వారందరినీ హిమవంతుడు యథోచితంగా సత్కరించి పంపాడు. ఆ విధంగా సాక్షాత్తు పరమేశ్వరుణ్ణి తన అల్లుడుగా చేసుకున్న హిమవంతుడు శోకం, పాపం లేని బ్రహ్మ లోకంలో జరిగిన యజ్ఞంలాగా ప్రకాశించాడు.

పార్వతీదేవికి (గౌరీ) సంబంధించిన ఈ వృత్తాంతమంతా తదియ (తృతీయా) తిథినాడు జరిగింది కనుక, తదియనాడు స్త్రీ, పురుషులిద్దరూ ఉప్పు తినకూడదు. అనగా ఉప్పుతో చేసిన ఏ పదార్థాలూ భుజించకూడదు. స్త్రీలు గనుక తదియనాడు ఉపవాసం ఉంటే సౌభాగ్యాన్ని పొందుతారు. దరిద్రులైన స్త్రీ లేక పురుషుడు ఈ కథని విని తదియనాడు ఉప్పుని వర్జిస్తే వారి దరిద్రాలు తొలగిపోయి సౌభాగ్యం ప్రాప్తిస్తుంది.

## చతుర్థి (చవితి) - గణపతి వృత్తాంతం

పూర్వం దేవతలు, ఋషులు, సిద్ధులు తాము చేసే పనులు చక్కగా కొనసాగించేందుకు వీలుగా మంచి ముహూర్తంలో తమ కార్యాల్ని ప్రారంభించేవారు. అయితే విచిత్రంగా మంచి వారు చేసే పనుల్లో ఆటంకాలు ఏర్పడటం, చెడ్డబుద్ధితో ఆలోచించి చేసే పనుల్లో ఎలాంటి విఘ్నాలు లేకపోవటం జరుగుతోంది. అది చూసి దేవతలు, ఋషులు, సిద్దులందరూ కలిసి చెడ్డపనులు చేసేవారికి విఘ్నాలు కలగాలని ఆశించారు. అందుకోసం ఏం చేయాలా అని ఆలోచించి సరాసరి మహాదేవుడు నివసించే కైలాసానికి వెళ్ళారు. అక్కడ కొలువై వున్న శంకరుణ్ణి స్తుతించి భక్తిగా నమస్కరించి ప్రభూ! శంకరా! శూలపాణీ! త్రిలోచనా! దుష్టులు చేసే కార్యాలకి లోకంలో విఘ్నాలు కలిగేలా నీవు ఒకణ్ణి

పుట్టించాలి స్వామీ! అలా చేయకపోతే అసురశక్తులు విజృంభించి లోకాలన్నిటికీ ఉపద్రవాలు కలిగే ప్రమాదం ఉంది స్వామీ! అని విన్నవించారు. దేవతల ప్రార్థన విన్న పరమేశ్వరుడు ఎంతో ఆనందించి ఒక్కసారి పార్వతీదేవివైపు చూసాడు.

పార్వతీదేవిని చూస్తున్న పరమేశ్వరుడి మదిలో ఒక ఆలోచన బయలుదేరింది. అసలు ఆకాశానికి ఏరూపం లేదు ఎందుకని? భూమికి, నీటికి, నిప్పుకి, గాలికి కూడా ఒక రూపం వుంది కదా! మరి ఆకాశానికి ఎందుకు రూపం ఏర్పడలేదు? అని ఆలోచిస్తూ ఒక్కసారిగా నవ్వాడు. జ్ఞానశక్తి స్వరూపిణి అయిన ఉమాదేవిని, ఆకాశాన్ని వెంటవెంటనే చూసాడు.

భూమి, నీరు, నిప్పు, గాలి అనే నాలుగు భూతాల గణాలతో కూడి ఆకాశం గురించి ఆలోచిస్తున్న పరమేశ్వరుడి శరీరం నుంచి దివ్య తేజస్సుతో వెలిగిపోతున్న ఒక కుమారుడు జన్మించాడు. దిక్కులన్నిటీ్నీ ప్రకాశింపచేస్తున్న ఆ మహాతేజస్వి అపర రుద్రుడిలాగా భాసిస్తున్నాడు. తేజస్సులో, రూపంలో, ఆకారంలో సాటిలేనివాడుగా ఉన్న ఆ కుమారుణ్ణి దేవతలంతా రెప్పలార్పకుండా చూస్తున్నారు.

జగదేక సౌందర్యవంతుడిలా ప్రకాశిస్తున్న ఆ కుమారుణ్ణి చూసి దేవకాంతలంతా ఎంతో వ్యామోహం పొందుతున్నారు. ఈ విషయాన్ని గమనించిన శంకరుడు తన కుమారుణ్ణి పిలిచి నీ రూపం వల్ల అందరికీ విపరీతమైన మోహం కలుగుతుంది. కనుక నీకు ఏనుగుతల, మరగుజ్జు శరీరం పెద్దపొట్ట, పాముల జందెం కలుగుగాక! అని శపించాడు. వెంటనే ఆ కుమారుడు శివుడు శపించిన విధంగా మారిపోయాడు.

శివుడు ఒక్కసారి దేవతల్ని చూసి తన శరీరాన్ని గట్టిగా విదిల్చాడు. వెంటనే ఆయన శరీరం మీదున్న వెంట్రుకల నుంచి చెమటనీరు కారి ధారలుగా ప్రవహించింది. ఆ నీటి నుంచి ఏనుగుముఖంతో కాటుకలాంటి నల్లటి దేహంతో ఎన్నో ఆయుధాలు ధరించి వినాయకులు లక్షలాదిమంది ఆవిర్భవించారు. ఆ అద్భుతదృశ్యాన్ని చూసి దేవతలకి నోట మాటరాలేదు. వారంతా ఒక్క

వినాయకుడే మన కార్యానికి సరిపోతాడు కదా! ఇంతమంది వినాయకులు పుట్టుకొస్తున్నారే! పరమేశ్వరుడు వీళ్ళనెందుకు సృష్టిస్తున్నాడు అని చింతిస్తున్నారు.

దేవతలంతా అలా చింతించేంతలోనే వినాయకులతో భూగోళమంతా నిండి పోయింది. అప్పుడే బ్రహ్మదేవుడు విమానం మీద వచ్చి దేవతలందరితో "సురులారా! మీరెంతో ధన్యులు. మహాదేవుడైన పరమేశ్వరుడు మిమ్మల్ని అనుగ్రహించాడు. ఆయన సృష్టించిన ఈ గణాలన్నీ మీ శత్రువులకి విఘ్నాలు కలిగిస్తాయి అని పలికాడు. ఆ తరువాత పరమేశ్వరుడి వైపు తిరిగి "ఈశ్వరా! నీ శరీరం నుంచి ఆవిర్భవించిన ఈ వినాయకుడు ఈ గణాలన్నిటికీ ప్రభువవుతాడు. నీవు అందరికన్నా గొప్పవాడిగా సృష్టించిన నీ కుమారుడు ఆకాశంలో సంచరిస్తాడు. ఆకాశమంత ఉన్నతుడై అందరికీ అధిపతిగా ఉంటాడు. నీ పుత్రుడు చాలా గొప్పవాడౌతాడు. నీవతనికి అస్త్రాల్ని ఆయుధాల్ని ప్రసాదించు" అని చెప్పి వెళ్ళిపోయాడు.

బ్రహ్మ మాటలు విన్న ఈశ్వరుడు తన కుమారుణ్ణి పిలిచి "నాయనా నీవు నేటినుంచీ....

వినాయకో విఘ్నకరో గజాస్యోగణేశ నామాచభవస్య పుత్రః ।
ఏతేచ సర్వేతవయాన్తు భృత్యా వినాయకాః కౄరదృశః ప్రచండాః ॥
ఉచ్ఛుష్మదానాది వివృద్ధదేహాః కార్యేషు సిద్ధం ప్రతిపాదయంతు ॥

*(శ్లో॥27,అధ్యా-23)*

"వినాయకుడు, విఘ్నకర్త, గజాస్యుడు, గణేశుడు అనే పేర్లతో ప్రసిద్ధి చెందుతావు. కఠోరమైన చూపులతో భయంకరంగా కనిపించే ఈ వినాయక గణాలందరూ నీకు సేవకులౌతారు. తాపాలు లేని ప్రజలు పెట్టే నైవేద్యాలతో వృద్ధిచెందే వీరు తమకి నైవేద్యం పెట్టిన వారి కార్యాల్ని సఫలం చేస్తుంటారు. నీవు కూడా సకలలోక వాసులచేత యజ్ఞయాగాది శుభకార్యక్రమాలలో తొలి పూజలందుకుంటావు. అలా నిన్ను పూజించకుండా ఎవరైనా తమ కార్యాల్ని ప్రారంభిస్తే వాటికి విఘ్నాలు కల్పిస్తావు" అని పలికి దేవతలతో పాటూ

తానుకూడా బంగారు కుండలతో పవిత్రజలాన్ని నింపి దానితో వినాయకుణ్ణి అభిషేకించాడు. ఆ విధంగా అభిషేకించబడుతున్న గణనాధుణ్ణి చూసి దేవతలంతా శ్రద్ధా భక్తులతో ఇలా స్తుతించారు.

నమస్తే గజవక్త్రాయ నమస్తే గణనాయక ।
వినాయక నమస్తేఽస్తు నమస్తే చండ విక్రమ ॥
నమోఽస్తుతే విఘ్నకర్త్రే నమస్తే సర్పమేఖల ।
నమస్తే రుద్రవక్త్రోత్థ ప్రలంబజఠరాశ్రిత ॥
సర్వదేవ నమస్కారాదవిఘ్నం కురు సర్వదా । *(శ్లో॥30-32,అధ్యా-23)*

ఈవిధంగా దేవతలందరి చేతా గణనాయకుడిగా వినాయకుడు అభిషేకించబడ్డాడు. ఈ గణనాథపదవి వినాయకుడికి చతుర్థి (చవితి) తిథినాడు వచ్చింది. అందుకే చతుర్థి వినాయకుడికి అత్యంత ప్రీతిపాత్రమైనది.

చతుర్థి తిథినాడు నువ్వుల్ని ఆహారంగా స్వీకరించి గణపతిని భక్తిగా పూజిస్తే ఆయన అనుగ్రహం సంపూర్ణంగా సాధకుడికి లభిస్తుంది. ఇందులో ఎలాంటి సందేహం లేదు. దేవతలు చేసిన గణపతి స్తుతిని విన్నవారికి పఠించినవారికి ఎలాంటి విఘ్నాలూ కలుగవు.

## పంచమీతిథి - నాగవృత్తాంతం

ప్రజాపతి అయిన బ్రహ్మదేవుడు సృష్టిచేయాలని సంకల్పించగా మొదట ఆయన మనసునుంచి మరీచి మహర్షి పుట్టాడు. ఆ మరీచికొడుకు కశ్యపప్రజాపతి. ఆ కశ్యపుడు దక్షప్రజాపతి కుమార్తె అయిన కద్రువ అనే ఆమెని వివాహం చేసుకున్నాడు. కద్రువకి కశ్యపుడి ద్వారా ఎంతో బలవంతులైన పుత్రులు జన్మించారు. వారెవరంటే!

అనంతం వాసుకిం చైవ కంబళంచ మహాబలం ।
కర్కోటకం చ రాజేంద్ర పద్మంచాన్యం సరీసృపమ్ ॥
మహాపద్మం తదాశంఖం కులికం చాపరాజితమ్ ।
ఏతే కశ్యపదాయాదాః ప్రధానాః పరికీర్తితాః ॥ *(శ్లో॥6-7,అధ్యా-24)*

అనంతుడు, వాసుకి, కంబళుడు, కర్కోటకుడు, పద్మడు, మహాపద్మడు శంఖుడు, అజేయుడైన కులికుడు అనేవారు. ఇక వీరినుంచి పరంపరగా వీరి సంతానంతో జగత్తంతా నిండిపోయింది. వంకర దేహంతో విషపూరితమైన కోరలతో ఈ సర్పజాతివారంతా మానవుల్ని చూడగానే కాటువేసి వారిని భస్మంచేసేవారు. ఆ విధంగా పాముల వల్ల ఎంతో ఘోరం జరగటంతో అది భరించలేని ప్రజలందరూ దయామయుడైన బ్రహ్మదేవుణ్ణి శరణువేడుకున్నారు. "బ్రహ్మదేవా! ప్రతి రోజూ వేలాది మంది ప్రజలు సర్పాల కాటుకి బలైపోతున్నారు. ఇలాగైతే త్వరలోనే మానవజాతి మొత్తం నశించే ప్రమాదం ఉంది. కనుక నీవెలాగైనా మమ్మల్ని రక్షించు అని వేడుకున్నారు.

మానవుల ప్రార్థన విన్న బ్రహ్మదేవుడు మీరెవ్వరూ భయపడకండి. మీకు రక్షణ నేను కల్పిస్తాను. ఎలాంటి సందేహం లేకుండా మీమీ ఇళ్ళకు వెళ్ళండి అని చెప్పి పంపాడు. బ్రహ్మ మాట విని ప్రజలంతా సంతోషంగా తమ ఇళ్ళకి తిరిగివచ్చారు.

బ్రహ్మదేవుడికి సర్పజాతిమీద విపరీతమైన కోపం వచ్చింది. వెంటనే వారందర్నీ పిలిపించి "సర్పరాజులారా! మీరు ప్రతిరోజూ దయాదాక్షిణ్యం లేకుండా మానవ జాతిని కాటువేసి చంపుతున్నారు. త్వరలో స్వాయంభువ మన్వంతరంలో మీ తల్లి చేత శపించబడి మీరంతా నాశనమౌతారు" అని శపించాడు. బ్రహ్మ శాపం విని కళ్ళు తెరుచుకున్న సర్పప్రముఖులు ఆయన పాదాలపై పడి స్వామీ! మమ్మల్ని క్షమించు, క్రూరత్వం అనే గుణం మాకు పుట్టుకతోనే వచ్చింది. దయచేసి శాంతించు. నీవే కదా మమ్మల్ని ఇలా సృష్టించావు. తిరిగి నీవే శపించటం భావ్యమా!" అని అన్నారు.

నాగుల మాటలు విని బ్రహ్మకి మరింత కోపం వచ్చింది. నాగులారా! నేనే మిమ్మల్ని సృష్టించానంటున్నారు సరే! మానవుల్ని అకారణంగా చంపమని మీకు చెప్పానా! ఎందుకు మీరలా చేస్తున్నారు? అని తిరిగి ప్రశ్నించాడు. అప్పుడు సర్పరాజులు "ప్రభూ! మాకు మానవులకి హద్దులు ఏర్పాటుచేయి. మా ఇద్దరికీ విడివిడిగా నివాసస్థానాల్ని చూపించు"అని విన్నవించారు. అది విన్న బ్రహ్మ వారితో–

నాగులారా! నేటినుంచీ మీకు మానవులకు ఒకకట్టడి చేస్తున్నాను. ఇది నా శాసనం. దీనినెవ్వరూ అతిక్రమించకూడదు. మీరంతా భూమిక్రింద ఉన్న పాతాళం, వితలం, హర్మ్యం అనే లోకాల్ని నివాసంగా చేసుకోండి. అందరూ తక్షణమే ఆ మూడులోకాలకీ వెళ్ళి హాయిగా జీవించండి. ఆ తరువాత వైవస్వత మన్వంతరంలో మీరంతా కశ్యపప్రజాపతికి పుత్రులుగా జన్మిస్తారు. గరుత్మంతుడికి మీరు జ్ఞాతులవుతారు. అప్పుడు జరిగే ఒక యాగంలో మీ సంతానమంతా అగ్నిదేవుడికి ఆహారమవుతుంది. మీలో మంచివారికి ఈ శాపం తగలదు. క్రూరబుద్ధి కలిగినవారు శాపం అనుభవించక తప్పదు.

మీకు ఆకలివేసినప్పుడు, మీకు ఎవరైనా అపకారం తలపెట్టినప్పుడు మనుషుల్ని చంపండి. మంత్రాలతో, ఔషధాలతో, గరుడ సంబంధమైన మండలాల్లో తిరిగే మానవులచేతిలో మీలో దుష్టగుణం కలిగిన నాగులు చిక్కుకుంటారు. అలాంటి వారికి మీరు చిక్కకుండా సంహరించండి. ఇలా కాకుండా మీరు ప్రవర్తిస్తే మీకు వినాశనం తప్పదు" అని హెచ్చరించాడు.

బ్రహ్మదేవుడు ఈ విధంగా హెచ్చరించగానే నాగులందరూ ఆయన చెప్పినలోకాలకి తరలివెళ్ళారు. ఆ లోకాల్లో ఆనందంగా ఎన్నో భోగాలనుభవిస్తూ జీవించారు. పాతాళాన్ని తమ శాశ్వత నివాసంగా చేసుకున్నారు. నాగులకి సంబంధించిన ఈ వృత్తాంతమంతా పంచమీ తిథినాడు జరిగింది. అందువల్ల ఈ తిథి నాగులకి ఎంతో ప్రీతిపాత్రమైనది. పంచమీ తిథినాడు పులుపు పదార్థాల్ని వర్జించి నాగుల్ని పాలతో అభిషేకించాలి. అలాచేసిన వారికి నాగుల అనుగ్రహం లభిస్తుంది. అంతేకాదు నాగులవల్ల భయం కూడా తొలగిపోతుంది. ఈ వృత్తాంతాన్ని విన్న వారికి, చదివిన వారికి సకల పాపాలూ హరిస్తాయి.

## షష్ఠీతిథి - కార్తికేయుడి వృత్తాంతం

సకల దేవతలకీ మూలం నారాయణుడు. ఆయన నాభికమలం నుంచి బ్రహ్మదేవుడు పుట్టాడు. ఆ బ్రహ్మనుంచి స్వయం భువమనువు మరీచ్యాది మహర్షులు ఆవిర్భవించారు. వారందరి నుంచి ద్వాదశ ఆదిత్యులు సకల దేవతలు,

రాక్షసులు, గంధర్వులు, మనుష్యులు, పశుపక్ష్యాది సకల జీవులూ ఆవిర్భవించారు. దీనినే సృష్టి అంటారు. ఈ సృష్టి క్రమక్రమంగా ఎంతో విస్తృతంగా పెరిగిపోయింది. దేవతలు, దానవులు ఒకరిమీద ఒకరు విరోధం పెంచుకుని పరస్పరం యుద్ధాలు చేసుకోవటం ప్రారంభించారు. అయితే దేవతల కన్నా దానవులు ఎంతో దృఢంగా బలవంతులుగా వున్నారు.

దానవ ప్రముఖుల్లో హిరణ్యకశిపుడు, హిరణ్యాక్షుడు, విప్రచిత్తి, విచిత్తి, భీమాక్షుడు, క్రీంచుడు వంటి మహావీరులు ఎన్నో యుద్ధాల్లో దేవతల్ని పరిమారుస్తున్నారు. ఇలా దేవతలందరూ నిరంతరం ఓటమి పాలవటం చూసి వారిగురువైన బృహస్పతి వారితో ఇలా అన్నాడు.

"దేవతలారా! నాయకుడు లేనందువల్ల మీ సైన్యమంతా పరాజయం పాలవుతోంది. కేవలం ఇంద్రుడితో ఈ సైన్యమంతా నడపబడలేదు. కనుక మీరంతా మీసైన్యాన్ని నడిపించే సమర్థుడైన సేనాధిపతిని సమకూర్చుకోండి" అని హితోపదేశం చేసాడు.

బృహస్పతి మాటలు విన్న దేవతలంతా వెంటనే బ్రహ్మ దగ్గరకి వెళ్ళి తమకొక గొప్ప సైన్యాధిపతిని ఇవ్వమని ప్రార్థించారు. ఆయన తనకాశక్తి లేదని రుద్రుడొక్కడే అందుకు తగినవాడని చెప్పి, వారందర్నీ వెంట బెట్టుకుని కైలాసానికి వెళ్ళాడు. అందరూ కలిసి మహాదేవుడైన పరమేశ్వరుణ్ణి చూసి ఎంతో భక్తి ప్రపత్తులతో ఇలా స్తుతించారు.

## దేవతాకృత శంకరస్తుతి

నమో విషమనేత్రాయ నమస్తే త్ర్యమ్బకాయ చ,
నమః సహస్రనేత్రాయ నమస్తే శూలపాణయే ॥ 1

నమః ఖట్వాంగహస్తాయ నమో దణ్డభృతే కరే,
త్వం దేవ హుతభుగ్జ్వాలా కోటి భాను సమప్రభః ॥ 2

ఆదర్శనేన యద్ దేవ మూఢ విజ్ఞానతోఽధునా,
కృత మస్మాభి రేవేశ తదత్ర క్షమ్యతాం ప్రభో ॥ 3

నమస్తినేత్రార్తి హరాయ శంభో త్రిశూలపాణే వికృతాస్యరూప
సమస్త దేవేశ్వర శుద్ధభావ ప్రసీద రుద్రాచ్యుత సర్వభావ 4
పూష్ణోఽస్య దన్తాన్తక! భీమరూప! ప్రలంబ భోగీన్ద్రలులన్తకణ్ఠ !
విశాలదేహాచ్యుత! నీలకణ్ఠ! ప్రసీద విశ్వేశ్వర! విశ్వమూర్తే! 5
భగాక్షి సంస్ఫోటన దక్షకర్మా గృహాణ భాగం ముఖతః ప్రధానమ్
ప్రసీద దేవేశ్వర! నీలకణ్ఠ! ప్రపాహి నః సర్వగుణోపపన్న! 6
సితాఙ్గ రాగా ప్రతిపన్నమూర్తే కపాలధారిం స్త్రిపురఘ్న దేవ,
ప్రపాహి నః సర్వభయేషు చైవ ఉమాపతే పుష్కరనాళ జన్మ ॥ 7
పశ్యామ తే దేహగతాన్ సురేశ సర్గాదయో వేదవరా ననన్త
సాఙ్గాన్ సవిద్యాన్ సపదక్రమాంశ్చ సర్వాన్ నిలీనాం స్త్వయి దేవ దేవ॥ 8
భవ శర్వ మహాదేవ పినాకిన్ రుద్ర తేహర,
నతాః స్మ సర్వే విశ్వేశ త్రాహి నః పరమేశ్వర ॥ 9
ఇత్థం స్తుత స్తదా దేవై ర్దేవదేవో మహేశ్వరః,
తుతోష సర్వదేవానాం వాక్యం చేద మువాచ హ ॥ 10
భగస్య నేత్రం భవతు పూష్ణో దన్తా స్తథా మఖః,
దక్షస్యాచ్ఛిద్రతాం యాతు యజ్ఞశ్చాదితేః సుతాః
పశుభావం తథా చాపి ఆపనేష్యామి వః సురాః ॥ 11
మద్దర్శనేన యో జాతః పశుభావో దివౌకసామ్
స మయాపహృతః సద్యః పతిత్వం వో భవిష్యతి ॥ 12

*(శ్లో॥17-28,అధ్యా-25)*

ఈవిధంగా దేవతలందరూ చేసిన స్తుతి విని పశుపతి ఎంతో ఆనందించి వారితో దేవతలారా! ఎందుకు మీరంతా ఇలా వచ్చారు అని ప్రశ్నించాడు. "ప్రభూ! శంకరా! మేము నిత్యం దానవుల ధాటికి తట్టుకోలేకపోతున్నాం. వారిని నిలువరించి మా సైన్యాన్ని ముందుండి నడిపించే ఒక సేనానాయకుడు మాకు కావాలి. దయచేసి ప్రసాదించు" అని కోరారు. దేవతల ప్రార్థన విన్న శంకరుడు సురులారా! మీరేమీ చింతించకండి. మీకు తగిన సేనాధిపతిని అందిస్తాను అని వారికి ధైర్యం చెప్పాడు.

శివుడు ఒక్కసారి ధ్యానంలోకి వెళ్ళి తనలో వున్న శక్తిని గట్టిగా మథించాడు. ఆ విధంగా ఆయనలోవున్న శక్తిని మథనానికి గురై లోపలనుంచి అగ్నిసూర్యుల కాంతితో సమానమైన ఒక కుమారుడు ఆవిర్భవించాడు. ఆకుమారుడు సహజసిద్ధమైన జ్ఞానంతో, సహజశక్తితో జన్మించాడు. (ఈ దేవసేనాధిపతి ఆవిర్భావం ఒక్కో మన్వంతరంలో ఒక్కోవిధంగా జరుగుతుంది) పరమేశ్వరుడి శరీరంలో ఉన్న అహంకారమే దేవసేనాపతి రూపంలో బైటికి వచ్చింది.

శివుడి శరీరంలోంచి దేవసేనాపతి, ఆవిర్భవించగానే దేవతల సంతోషానికి అవధిలేకపోయింది. తమకు సేనాధిపతిని ప్రసాదించి పరమేశ్వరుణ్ణి బ్రహ్మాది దేవతలంతా ఎంతో శ్రద్ధగా పూజించారు. శివుడికి జన్మించిన ఆ కుమారుడికి దేవతలు, ఋషులు, ఎన్నో సిద్ధుల్ని వరాల్ని ప్రసాదించి ఆశీర్వదించారు. అప్పుడా కుమారుడు దేవతలతో 'మీరంతా' నాకు తోడుగా ఒకణ్ణి చూపించండి" అని కోరాడు. అది విన్న మహాదేవుడు "నాయనా! నీకు ఆడుకోవటానికి 'కోడి' నిస్తాను. అలాగే శాఖుడు–విశాఖుడు అనే ఇద్దరు సేవకుల్ని కూడా నీకు సమకూరుస్తున్నాను. కుమారా! నేటినుంచీ నీవు భూతగ్రహాలకీ, దేవతాసైన్యానికి సేనాధిపతిగా వుండు' అని అన్నాడు. అది విన్న దేవతలు సంతోషించి తమకు సేనాధిపతి అయిన కుమారస్వామిని భక్తి పూర్వకంగా ఇలా స్తుతించారు.

## కుమారస్వామి స్తుతి

భవస్వదేవ సేనానీర్మ హేశ్వర సుతప్రభో ।
షణ్ముఖస్కంధ విశ్వేశ కుక్కుట ధ్వజపావకే ॥
కంపితారే కుమారేశ స్కంధ బాలగ్రహానుగ ।
జితారే క్రౌంచ విధ్వంస కృత్తిగా సుతమాతృజ ॥
భూతగ్రహపతి శ్రేష్ఠ పావకి ప్రియదర్శన ।
మహాభూతపతేః పుత్రత్రిలోచననమో౽స్తుతే ॥ *(శ్లో॥40–43,అధ్యా–25)*

ఈ విధంగా దేవతలు స్తుతిస్తుండగా కుమారస్వామి క్రమంగా పెరగటం ప్రారంభించాడు. పన్నెండు మంది సూర్యులకన్నా అధికమైన కాంతితో అందరికీ ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నాడు. ఆ కుమారుడి తేజస్సు ముల్లోకాలకీ వ్యాపించింది.

తరువాత జన్మలో కృత్తిక అగ్ని, సప్తమాతృకలు, పార్వతీదేవి అనేవారు కుమారస్వామి జన్మకి కారకులుగావున్నారు. స్కందుడు సకల పాపాల్నీ రూపుమాపే దైవం సాక్షాత్తు పరమేశ్వరుడే అతన్ని షష్ఠీతిథినాడు దేవసేనాధిపతిగా అభిషేకించారు. కనుక స్కందుడికి ప్రీతిపాత్రమైన తిథి షష్ఠి అని గ్రహించాలి.

షష్ఠీతిథినాడు కేవలం పళ్ళనే ఆహారంగా స్వీకరిస్తూ, మనసుని అదుపులో ఉంచుకుని కార్తికేయుణ్ణి పూజించేవాడు ధనాన్ని, పుత్రుల్ని పొందుతాడు. అలాగే మనసులో ఏ కోరికలున్నా అవి తప్పక తీరతాయి.

యశ్చైతత్ పఠతిస్తోత్రం కార్తికేయస్య మానవః ।
తస్యగేహే కుమారాణాం క్షేమారోగ్యం భవిష్యతి ॥ *(శ్లో॥50,అధ్యా-25)*

కార్తికేయుడి గురించి దేవతలు చేసిన స్తోత్రాన్ని ఎవరైతే శ్రద్ధా భక్తులతో నిత్యం పఠిస్తారో వారి ఇంట్లో ఉన్న పసిపిల్లలకి బాలురకి ఎంతో క్షేమం కలుగుతుంది.

## సప్తమీతిథి-సూర్యోపాఖ్యానం

పూర్వం జ్ఞానం, శక్తి ఉన్న సనాతనమైన ఆత్మ ఒక్కటే ఉండేది. ఆ ఆత్మ రెండోదాన్ని కోరుకోవటంతో దానిలో ఉన్న వెలుగు బైటికి వచ్చింది. ఆ వెలుగు రూపమే సూర్యుడు. ఆ సూర్యుడి వెలుగులన్నీ ఒక దానిలో ఒకటి బాగా కలిసిపోయి అన్ని లాకాల్నీ ప్రకాశింపచేస్తున్నాయి. ఆ సూర్యుడి నుంచి ఒక్కసారిగా దేవతలు, సిద్ధులు, సకల దేవతాగణాలు, మహర్షులు జన్మించారు. అందుకే ఆయన సూర్యుడయ్యాడు. సూర్యుడు అంటే పుట్టుకకి కారణమైనవాడు అని అర్థం.

## దేవతలు చేసిన సూర్యస్తవం

తస్మిన్ సర్వే సురాః సిద్ధాగణాః సర్వే మహర్షిభిః ।
సమం సూతా ఇతి విభో తస్మాత్ సూర్యోఽభవత్ స్తుతః ॥ 1

లోలీభూతస్య తస్యాశు తేజసోఽభూ చ్ఛరీరకమ్ ।
పృథక్త్వేన రవిః సోఽథ కీర్త్యతే వేదవాదిభిః ॥ 2
భాసయన్ సర్వలోకాంస్తు యతో ఽసా వుత్థితో దివి ।
అతో ఽసౌ భాస్కరః ప్రోక్తః ప్రకర్షాచ్చ ప్రభాకరః ॥ 3
దివాదివస ఇత్యుక్త స్తత్కారిత్వా ద్దివాకరః ।
సర్వస్య జగత స్త్వాది రాదిత్య స్తేన ఉచ్యతే ॥ 4
ఏతస్య ద్వాదశాదిత్యాః సంభూతా స్తేజసా పృథక్ ।
ప్రధాన ఏవ సర్వేషాం సర్వదా స విబుధ్యతే ॥ 5
తం దృష్ట్వా జగతో వ్యాప్తిం కుర్వాణం పరమేశ్వరమ్
తస్యైవాన్తః స్థితా దేవా వినిష్క్రమ్య స్తుతిం జగుః ॥ 6
భవాన్ ప్రసూతి ర్జగతః పురాణః ప్రయాసి విశ్వం ప్రలయే చ హంసి,
సముత్థితో నాథ శమం ప్రయాహి మా దేవ లోకాన్ ప్లుష కర్మసాక్షిన్ ॥ 7
త్వయా తతం సర్వత ఏవ తేజః ప్రతాపినా సూర్య యజుః ప్రవృత్తే
తిగ్మం రథాఙ్గం తవ దేవకల్పం కాలాన్త మధ్వాన్తకరం వదన్తి ॥ 8
ప్రభాకర స్త్వం రవి రాదిదేవ ఆత్మా నమస్తస్య చరాచరస్య
పితామహ స్త్వం వరుణో యమశ్చ భూతం భవిష్యచ్చ వదన్తి సిద్ధాః ॥ 9
ధ్వాన్తం ప్రణుత్వం సురలోక పూజ్య ప్రయాహి శాన్తం పితరో వదన్తి
వేదాన్త వేద్యోసి మఖేషు దేవ త్వం హూయసే విష్ణు రసి ప్రసహ్య ॥ 10

*(శ్లో॥4-13,అధ్యా-26)*

ప్రచండమైన వెలుగులతో ప్రకాశిస్తున్న సూర్యుణ్ణి దేవతలంతా ఈ విధంగా స్తుతించగా, సూర్యుడు ప్రసన్నుడై తన తాపాన్ని తగ్గించుకుని దేవతలకు ప్రత్యక్షమయ్యాడు. ఇలా సూర్యుడు ఆవిర్భవించటం, తన తాపాన్ని తగ్గించుకుని దేవతలకి దర్శనమివ్వటం అనేవి సప్తమీ తిథినాడే జరిగాయి. కనుక సూర్యుడికి ప్రీతి పాత్రమైన తిథి సప్తమి. సూర్యభగవానుడు సప్తమితిథినాడే భూమండలం మీద ఆకారాన్ని పొందాడు. ఎవరైతే సప్తమితిథినాడు దేవతలు చేసిన సూర్యస్తవాన్ని శ్రద్ధగా పఠిస్తారో వారు సూర్యానుగ్రహంతో ఆయురారోగ్య ఐశ్వర్యాలను పొందుతాడు.

# అష్టమీతిథి - మాతృకలు

పూర్వం అంధకుడనే మహారాక్షసుడుండేవాడు బ్రహ్మగురించి కఠోరమైన తపస్సుచేసి ఎన్నో వరాలు పొందాడు. ఆ వరగర్వంతో దేవతలందర్నీ ఓడించి వారిని తన వశం చేసుకున్నాడు. దేవతలందరూ దిక్కుతోచక సరాసరి బ్రహ్మ దగ్గరకి వెళ్ళి తమ కష్టాల్ని ఇలా మొరపెట్టుకున్నారు.

“పితామహా! అంధకుడు మమ్మల్ని దారుణంగా హింసిస్తున్నాడు. దయచేసి మమ్మల్ని వాడి బారినుంచి కాపాడు అని ప్రార్థించగా బ్రహ్మ వారితో సురులారా! నేనే అతడికి ఎన్నో వరాలిచ్చాను. కనుక నేను మిమ్మల్ని కాపాడలేను. పదండి మనందరం కలిసి శివుడి దగ్గరకి వెళదాం అన్నాడు. అందరూ కలిసి శివుడిసన్నిధికి చేరారు.

మూకుమ్మడిగా తన దగ్గరకొచ్చిన దేవతల్ని చూసి పరమేశ్వరుడు “సురులారా! ఏమిటి ఇంత ఆందోళనగా ఉన్నారు. మీకేం కావాలో చెప్పండి” అని అడిగాడు. అప్పుడు దేవతలంతా ముక్తకంఠంతో అంధకుడి వల్ల తాము పడ్డ బాధల్ని శివుడికి విన్నవించారు. అదే సమయంలో గొప్ప సైన్యాన్ని వెంటబెట్టుకుని అంధకుడు అక్కడికొచ్చాడు. శివుణ్ణి ఓడించి పార్వతిని హరించాలని అతడి ఉద్దేశం. వెంటనే తన సైన్యంతో అక్కడున్న వారందరి మీదా దాడి చేసాడు. దేవతలంతా భయంతో శివుడి వెనుక చేరారు.

అంధకుడి చర్య శివుడికెంతో ఆగ్రహాన్ని తెప్పించింది. ఒక్కసారి మనసులో స్మరించగానే వాసుకి, తక్షకుడు, ధనుంజయుడు అనే మహాసర్పాలు వచ్చాయి. వాటిని ఆయన తన నడుముకి చుట్టుకున్నాడు. ఆ వెంటనే నీలుడనే మహారాక్షసుడు ఐరావతంలాంటి భయంకర రూపంతో శివుడి మీదకొచ్చాడు. తన తొండంతో శివుణ్ణి మోదబోయాడు. అక్కడే వున్న నంది వీరభద్రుణ్ణి పిలిచి నీలుడి మీదకి పంపాడు. వీరభద్రుడు మహాట్టహాసం చేస్తూ సింహం రూపాన్ని ధరించి ఒక్కసారి పైకెగిరి ఏకరూపంలో ఉన్న ఆ నీలుణ్ణి చీల్చి చెండాడాడు. వాడి చర్మాన్ని పీకి దాన్ని శివుడికి సమర్పించగా, ఆయన దాన్ని తన మొలకి వస్త్రంగా చుట్టుకున్నాడు. ఆనాటినుంచీ శివుడు గజచర్మాంబరధారిగా కీర్తిపొందాడు.

గజచర్మాన్ని ధరించిన శివుడు భయంకరమైన త్రిశూలాన్ని ధరించి ప్రమథగణాలతో కలిసి అంధకాసురుణ్ణి ఎదుర్కొన్నాడు. దేవగణాలు ప్రమథగణాలు కలిసి అంధకుడి సైన్యంతో హోరాహోరీగా తలపడుతున్నాయి. నారదమహర్షికి ఈ విషయం తెలిసింది. వెంటనే వైకుంఠానికి వెళ్ళి శ్రీహరికి కైలాసంలో జరుగుతున్న యుద్ధం గురించి చెప్పాడు. అది విని దేవతలకి సాయం చేద్దామని చక్రాయుధాన్ని ధరించి బయలుదేరాడు శ్రీహరి. యుద్ధరంగానికొచ్చి అక్కడ దేవతా సైన్యానికి అండగా నిలబడ్డాడు. అయినా ఏమీ ఉపయోగం లేకపోయింది. అసురులు విజృంభిస్తూనే ఉన్నారు.

మహాదేవుడు సరాసరి అంధకుడితో తలపడ్డాడు. శివుడు తన త్రిశూలంలో అంధకుడి శరీరాన్ని పొడిచాడు. వాడి శరీరం నుంచి రక్తం కారింది. ఆశ్చర్యకరంగా ఆ రక్తం బొట్లు నుంచి వేలాది అంధకాసురులు పుట్టుకురాసాగారు. అయినా చలించక శివుడు తన శూలానికి అంధకాసురుణ్ణి గుచ్చి నాట్యంచేయటం ప్రారంభించాడు. వేలాదిగా పుట్టుకొచ్చి అంధకుల్లో కొందర్ని శ్రీహరి తన చక్రాయుధంతో సంహరించాడు. ఎంతమందిని చంపినా వాడి రక్తం నుంచి ఇంకా పుట్టుకొస్తూనే ఉన్నారు.

శివుడికి అంతమంది అంధకుల్ని చూసేసరికి కోపం ముంచుకు వచ్చింది. ఆ కోపం వల్ల ఆయన ముఖం నుంచి భయంకరమైన అగ్నిజ్వాలలు బైటికొచ్చాయి. ఆ జ్వాలలన్నీ ఒక ఆకారాన్ని ధరించి మహాశక్తిగా మరాయి. ఆమెనే యోగీశ్వరి అంటారు. ఆ వెంటనే విష్ణువు కూడా స్మరించాడు. వెంటనే అతడి శరీరం నుంచి కూడా ఒక మహాశక్తి ఆవిర్భవించింది. అదే విధంగా బ్రహ్మ-కుమారస్వామి-ఇంద్రుడు-యముడు వరాహదేవుడు ఇలా అందరూ తమ అంశాలతో శక్తిరూపాల్ని సృష్టించారు. అలా వారందరి శరీరాల నుంచి అష్టమాతృకలు ఆవిర్భవించారు.

అష్టమాతృకలు ఎనిమిది మందీ ఎనిమిది రకాల గణాలు కలిగినవారు. వారిలో 1.కామగుణంతో-యోగీశ్వరీదేవి 2.క్రోధగుణంతో - మహేశ్వరీ 3.లోభగుణంతో - వైష్ణవీదేవి 4.మదగుణంతో-బ్రహ్మాణీదేవి 5.మోహగుణంతో

– కౌమారీదేవి 6.మాత్సర్యగుణంతో – ఐంద్రీదేవి 7.కౄరత్వంతో – యమదండధరాదేవి 8.అసూయతో – వారాహీదేవి ఆవిర్భవించారు.

ఈ అష్టమాతృకలు ఎనిమిది మందీ అంధకాసురుడి రక్తం నేలమీద పడకుండా పూర్తిగా పీల్చేశారు. దానితో కొత్తగా అంధకాసురులు పుట్టటం ఆగిపోయింది. చివరిగా మిగిలిన అంధకుణ్ణి పరమేశ్వరుడు సంహరించాడు.

మాతృకలకి సంబంధించిన ఈ దివ్య వృత్తాంతాన్ని విన్న వారికి ఎప్పుడూ ఆపదల నుంచి రక్షణ లభిస్తుంది. దీన్ని విన్నవాడు ధన్యుడై శివలోకాన్ని చేరుకుంటాడు. అష్టమాతృకలు ఆవిర్భవించిన తిథి అష్టమి. అందుకే ఆ దేవతలకి ఆతిథి ప్రీతికరమైనది. అష్టమినాడు కేవలం మారేడు ఫలాల్ని తింటూ అష్టమాతృకల్ని పూజిస్తే ఆ దేవతలు ఉపాసకుడికి ఆయురారోగ్య ఐశ్వర్యాలు అందిస్తారు.

## నవమీతిథి - దుర్గాదేవి వృత్తాంతం

పూర్వం సింధుద్వీపుడనే మహారాజుండేవాడు. అతడు వరుణుడి అంశతో జన్మించాడు. ఈ సింధుద్వీపుడు పూర్వజన్మలో ఇంద్రుడి చేత చంపబడ్డ త్వష్టుడి కుమారుడు. అతడికి తిరిగి సింధుద్వీపుడుగా జన్మించాక ఇంద్రుడి మీద పగతీర్చుకోవాలనిపించింది. అందుకోసం ఇంద్రుణ్ణి చంపగల పుత్రుణ్ణి కోరి కఠోరమైన తపస్సు చేయటం ప్రారంభించాడు. ఒకనాడు వేత్రవతి అనే సుందరమైన కన్య సింధుద్వీపుడు తపస్సుచేస్తున్న ప్రాంతానికి వచ్చింది. దివ్య సౌందర్యంతో వెలిగిపోతున్న ఆమెని చూసి సింధుద్వీపుడు ఆకర్షితుడై "భామినీ! ఎవరు నీవు ఎందుకిక్కడికి వచ్చావు? అని ప్రశ్నించాడు.

ఆ సుందరి సింధు ద్వీపుడితో "ప్రభూ!నేను వరుణిడి భార్యని. నాపేరు వేత్రవతి. నీ సౌందర్యం చూసి నీతో నే గడపాలని ఇక్కడికి వచ్చాను. దయచేసి నన్ను తిరస్కరించవద్దు. కోరి వచ్చిన పడతిని తిరస్కరించిన వాడికి పాపం చుట్టుకుంటుంది. అది బ్రహ్మహత్యతో సమానమైనది. కనుక నన్ను కాదనక స్వీకరించు అని ప్రార్థించింది.

సింధుద్వీపుడు కూడా ఆమె అందచందాలు చూసి ఆమెని కామించాడు. వెంటనే మారుమాట్లాడకుండా ఆమెను స్వీకరించి సుఖభోగాలనుభవించాడు. అలా కొంతకాలం సాగింది. వారిద్దరికీ పన్నెండుమంది సూర్యులతో సమానుడైన పుత్రుడు జన్మించాడు. వేత్రవతి కడుపునపుట్టిన కారణంగా అతడు వైత్రాసురుడనే పేరుతో ప్రసిద్ధిచెందాడు. ఎంతో గొప్పబలసంపన్నుడైన ఆ వైత్రాసురుడు ప్రాగ్జోతిషపురానికి రాజయ్యాడు. కొంతకాలంలోనే అతడు సమస్త భూమండలాన్నీ జయించి స్వాధీనం చేసుకున్నాడు.

వైత్రాసురుడు సప్తద్వీపాలలో ఉన్న భూమిని గెలిచి ఆ తరువాత దేవతలందరూ నివసించే మేరు పర్వతం మీదకి దండెత్తాడు. అక్కడ ముందుగా ఇంద్రుణ్ణి ఆ తరువాత వరుసగా అగ్ని, యమ, నిర్ఱుతి, వరుణ, వాయు, కుబేర, ఈశానుల్ని గెలిచాడు. అలా వైత్రాసురుడి చేతిలో ఓడిపోయిన అష్టదిక్పాలకులంతా కలిసి తమ తమ బాధల్ని ఒకరికొకరు చెప్పుకున్నారు. వైత్రాసురుడు అక్కణ్ణుంచి బయలుదేరి కైలాసానికి వెళ్ళాడు. కైలాసంలో శివుడు కూడా అతన్ని జయించలేక సిద్ధుల్ని, మునుల్ని వెంటబెట్టుకుని బ్రహ్మలోకానికి వెళ్ళాడు.

జగత్తుని సృష్టించే బ్రహ్మ తన లోకంలో విష్ణువు పాదాలనుంచిపుట్టిన పవిత్రజలం లోపల భాగంలో ఒక స్థానాన్ని ఏర్పాటు చేసుకుని మాయాస్వరూపిణి అయిన గాయత్రీదేవిని జపిస్తూ కూర్చున్నాడు. దేవతలంతా లోపలికి ప్రవేశించి ఓ పితామహా! రక్షించు, కాపాడు! అని నినాదాలు చేసారు. బ్రహ్మ ధ్యానంలోంచి కళ్ళు తెరిచిచూసేసరికి ఎదురుగా దేవతలంతా కనిపించారు. అయితే ఆయన వాళ్ళందర్నీ చూసి ఇదంతా మాయలా ఉందే. వీళ్ళంతా నన్ను భ్రమింప చేస్తున్నారు. అసలు దేవతలు లేరు, రాక్షసులు లేరు అని భావించి తిరిగి కళ్ళు మూసుకున్నాడు.

అంతలో వైత్రాసురుడు దేవతల్ని వెంట తరుముతూ వారితో పాటు తానుకూడా బ్రహ్మలోకానికి వచ్చాడు. అక్కడున్న దేవతల్ని పట్టుకుని హింసించటం ప్రారంభించాడు. వారి హాహాకారాలు విన్న బ్రహ్మ మరోసారి కళ్ళుతెరిచాడు. ఒక్కసారిగా ఆయనముందు ఒక కన్య ప్రత్యక్షమయ్యింది.

తెల్లని వస్త్రాలు, పూలమాల, కిరీటం ధరించిన ఆమె ఎనిమిది చేతులతో దివ్యమైన ఆయుధాలు ధరించి ఎంతో వైభవంగా ప్రకాశిస్తోంది.

శంఖం, చక్రం, గద, పాశం, ఖడ్గం, అంకుశం, ఘంట,విల్లు, ఇంకా ఎన్నో ఆయుధాలు ధరించిన ఆ మహాశక్తి స్వరూపిణి నీటి నుంచి ఆవిర్భవించింది. సింహవాహనం మీద వచ్చిన ఆ దేవి ఒక్కతే ఎన్నో రూపాల్ని ధరించి వైత్రాసురుడి సైన్యంతో యుద్ధం చేసింది. అలా ఒక వేయి సంవత్సరాలు వైత్రుడితో పోరు కొనసాగించిన దేవి చివరికి తన బలపరాక్రమాలు సంపూర్ణంగా వినియోగించి, మహాబలుడైన వైత్రాసురుణ్ణి ఘోరంగా వధించింది.

వైత్రాసురుడి వధతో దేవతలందరిలో ఆనందం వెల్లివిరిసింది. అందరూ కిలకిలరావాలు చేసారు. సకల దేవతలు, బ్రహ్మ, విష్ణు పరమేశ్వరులతో సహా సామూహికంగా దేవిని భక్తి పూర్వకంగా పూజించారు. శివుడు ప్రత్యేకంగా ఆ దేవినిలా స్తుతించాడు.

## శివుడు చేసిన దేవీ స్తుతి

జయస్వదేవి గాయత్రి మహామాయే మహాప్రభే
మహాదేవి మహాభాగే మహాసత్త్వే మహోత్సవే ॥ 1

దివ్యగన్ధాను లిప్తాఙ్గి దివ్యస్రగ్ధానుభూషితే
వేదమాత ర్నమ స్తుభ్యం త్ర్యక్షరస్థే మహేశ్వరి ॥ 2

త్రిలోకస్థే త్రితత్త్వస్థే త్రివహ్నిస్థే త్రిశూలిని,
త్రినేత్రే భీమవక్త్రే చ భీమనేత్రే భయానకే
కమలాసనజే దేవి సరస్వతి నమోஉస్తుతే ॥ 3

నమః పఙ్కజ పత్రాక్షి మహామాయేஉమృత స్రవే
సర్వగే సర్వభూతేశి స్వాహాకారే స్వధేஉమ్బికే ॥ 4

సంపూర్ణే పూర్ణచంద్రాభే భాస్వరాఙ్గే భవోద్భవే
మహావిద్యే మహావేద్యే మహాద్వైత్య వినాశిని,
మహాబుద్ధ్యుద్భవే దేవి వీతశోకే కిరాతిని ॥ 5

త్వం నీతి స్త్వం మహాభాగే త్వం గీ స్త్వం గౌ స్త్వమక్షరమ్,
త్వంధీ స్త్వం శ్రీ స్త్వమోఙ్కార స్తత్వేచాపి పరిస్థితా,
సర్వసత్త్వహితే దేవి నమస్తే పరమేశ్వరి ॥ 6

*(శ్లో॥27-32,అధ్యా-28)*

పరమేశ్వరుడు ఈ విధంగా దేవిని స్తుతించగా, ఆ వెంటనే దేవతలందరూ పరమేశ్వరికి జయజయధ్వానాలు పలికారు. బ్రహ్మదేవుడు కూడా దేవికి భక్తి పూర్వకంగా నమస్కరించి అక్కడున్న వారందరితో– ఈ దేవి హిమవత్పర్వతం మీదకు వెళ్ళి అక్కడే నివసించుగాక! దేవతలారా! మీరు కూడా దేవితో పాటు హిమాలయాలకి వెళ్ళి ఆమెని సేవించండి. ఆలస్యం చేయకండి. ఈ దేవిని నవమినాడు పూజించాలి.

నవమ్యాంచ సదా పూజ్యా ఇయం దేవీ సమాధినా ।
వరదా సర్వలోకానాం భవిష్యతి న సంశయః ॥
నవమ్యాంయశ్చ పిష్టాశీ భవిష్యతి హిమానవః ।
నారీ నా తస్య సంపన్నం భవిష్యతి మనోగతం ॥ *(శ్లో॥37,38,అధ్యా-28)*

నవమినాడు చేసే పూజవల్ల ఆమె ఎంతో సంతోషిస్తుంది. తనని పూజించిన వారందరికీ వరాల్ని ప్రసాదిస్తుంది. ఇందులో సందహమేలేదు.

నవమితిథినాడు స్త్రీకాని, పురుషుడుకానీ పిండిని భుజించి ఈ దేవిని అర్చిస్తే వారి కోరికలన్నీ తీరుతాయి. పరమేశ్వరుడు చేసిన ఈ దివ్యస్తోత్రాన్ని ఉదయం సాయంత్రం, రాత్రి పఠించిన వారికి దేవితోపాటు, పరమేశ్వరుడు కూడా అనుగ్రహిస్తాడు. పరమేశ్వరా! నీవు చేసిన దివ్యస్తోత్రాన్ని పఠించినవారి కష్టాలన్నీ నీవే తీర్చాలి అని శివుడికి కూడా చెప్పాడు.

బ్రహ్మ తిరిగి దేవితో"అమ్మా! జగన్మాతా! పరమేశ్వరీ! నీవు మాకు చేయాల్సిన ఘనకార్యం మరొకటుందమ్మా! భవిష్యత్తులో మహిషాసురుడనే రాక్షసుడు లోకాల్ని, మమ్మల్ని పీడిస్తాడు. అప్పుడు నీవా అసురుణ్ణి వధించి మాకు మేలు చేయాలి తల్లీ! అని కోరాడు. దేవి అందుకు అంగీకరించింది.

వెంటనే దేవతలంతా ఆ దేవిని తీసుకువెళ్ళి ఎంతో ఆనందంగా హిమాలయాల్లో ప్రతిష్ఠించారు. అలా వారంతా ఆనందంగా ప్రతిష్టించిన కారణంగా ఆ దేవికి నందాదేవి అనే పేరు వచ్చింది. నందాదేవి చరిత్రని విన్నవాడు, పఠించినవాడు సకల పాపాలనుంచీ విముక్తుడై చివరికి మోక్షాన్ని పొందుతాడు.

## దశమీతిథి - దిక్కుల వృత్తాంతం

ఆరంభంలో సృష్టిని మొదలుపెట్టిన బ్రహ్మదేవుడికి నేను సృష్టించిన ప్రజల్ని ఎవరు ధరిస్తారు? అన్న సంశయం కలిగింది. ప్రజల గురించి ఇలా ఆలోచిస్తుండగా ఆయన చెవుల్లోంచి గొప్ప కాంతితో వెలిగిపోతున్న పదిమంది కన్యలు పుట్టుకొచ్చారు. వారిలో 1.తూర్పు 2.దక్షిణం 3.పడమర 4.ఉత్తరం 5.పైదిక్కు 6.క్రిందిదిక్కు అనే ఆరుగురు కన్యలు ముఖ్యమైనవారు. ఇక మిగిలిన నలుగురు కన్యలు ఎంతో అందగత్తెలు. వారు నలుగురూ ప్రజాపతి దగ్గరకి వెళ్ళి ఆయనతో "స్వామీ! మాకు కూడా తగిన చోటుని చూపించండి. మేము సుఖంగా ఉండేలా మాకు తగిన స్థానాన్ని, తగిన భర్తల్ని కూడా ప్రసాదించండి అని కోరారు.

బ్రహ్మదేవుడు నలుగురు కన్యల మాటవిని, "సుందరీమణులారా! ఈ బ్రహ్మాండం మొత్తం వందకోట్ల యోజనాల మేర వ్యాపించింది. ఈ బ్రహ్మాండం చివర మీ ఇష్టం వచ్చిన చోట మీరు నివసించండి. వెంటనే వెళ్ళండి. మీకు తగిన భర్తల్ని నేను సృష్టించి ఇస్తాను. ముందు మీకు నచ్చిన ప్రదేశాలకి చేరుకోండి" అని అన్నాడు. బ్రహ్మ ఆదేశం విని ఆ నలుగురు కన్యలు అక్కణ్ణుంచి బయలుదేరి తమకు నచ్చిన ప్రదేశాలకి వెళ్ళారు.

బ్రహ్మదేవుడు వెంటనే మహాబలవంతులైన లోక పాలకుల్ని సృష్టించాడు. వారు మొత్తం ఎనిమిది మంది 1.ఇంద్రుడు 2.అగ్ని 3.యముడు 4.నిర్బతి 5.వరుణుడు 6.వాయువు 7.కుబేరుడు 8.ఈశానుడు. బ్రహ్మ తను సృష్టించిన కన్యల్ని పిలిచి వారిలో ఎనిమిది మందికి ఈ ఎనిమిది మంది కన్యల్ని ఇచ్చి వివాహం జరిపించాడు. పదిదిక్కుల్లో మిగిలిన ఊర్ధ్వ దిక్కుని తన ఆధీనంలో ఉంచుకుని, అధో దిక్కుకి అధిపతిగా ఆదిశేషుణ్ణి నియమించాడు.

ఈ విధంగా బ్రహ్మదేవుడు వారందరికీ దిక్కుల్ని ప్రసాదించి, ఆ దిక్కులన్నిటికీ పుణ్యమైన తిథిగా దశమీతిథిని ఏర్పరిచాడు. తరువాత దిక్కులన్నీ బ్రహ్మ సృష్టించిన దిక్పాలకుల పేరుతో ప్రసిద్ధమయ్యాయి. అలాగే దిక్పాలకుల భార్యలు కూడా ఐంద్రీ తదితర పేర్లతో విఖ్యాతి చెందారు. వీరందిరికీ పెరుగు కలిపిన అన్నం నైవేద్యంగా చెప్పబడింది.

దశమీ తిథినాడు పెరుగన్నం తిని నియమపూర్వకంగా దశ దిక్పాలకుల్ని ఎవరైతే ఆరాధిస్తారో వారికి సకల శుభాలు కలుగుతాయి. దిక్పాలకుల గురించిన ఈ కథనాన్ని విన్నవారు చదివిన వారు సకల పాపాలనుంచీ విముక్తులై బ్రహ్మ లోకంలో శాశ్వత నివాసాన్ని పొందుతారు. ఇందుకు సందేహమే లేదు.

## ఏకాదశీతిథి - కుబేరుడి వృత్తాంతం

సృష్టిని కొనసాగిస్తున్న బ్రహ్మదేవుడి ముఖం నుంచి తీవ్రమైన గులకరాళ్ళని వర్షిస్తూ వాయువు వెలువడింది. బ్రహ్మ ఆ వాయువుని నిలువరించి “శాంతించు, ఆకారాన్ని ధరించు” అని వాయువుని కోరాడు. వెంటనే వాయువు ఆకారాన్ని ధరించి దేవా! నేనేం చేయాలో చెప్పండి అని అడిగాడు. బ్రహ్మ అతడితో వాయూ! నీవు దేవతలు ఆర్జించిన ధనాన్ని వాటి ఫలాన్ని సంరక్షిస్తూ ఉండు అని ఆదేశించాడు. ఆనాటి నుంచి వాయువు వసుపతి–ధనానికి అధిపతి అయ్యాడు.

ఆ వాయువే రూపాన్ని ధరించి కుబేరుడుగా ప్రసిద్ధిచెందాడు. కుబేరుడు ధనాధిపతి పదవిని సక్రమంగా నిర్వహిస్తుండటంతో బ్రహ్మ సంతోషించి అతడికి ఏకాదశి తిథిని ప్రసాదించాడు. కుబేరుడికి ప్రీతికరమైన ఏకాదశినాడు నిప్పుతో వండని పదార్థాన్ని ఆహారంగా స్వీకరిస్తూ ఆయన్ని శ్రద్ధగా పూజిస్తే కుబేరుడు ధనసంపదల్ని వారికి అనుగ్రహిస్తాడు. కుబేరుడి వృత్తాంతం విన్నవారు పఠించిన వారు కూడా ఆయురారోగ్య ఐశ్వర్యాల్ని పొందుతారు.

## ద్వాదశి తిథి - వైష్ణవ వృత్తాంతం

పూర్వం పరబ్రహ్మ అయిన నారాయణుడికి ఈ సృష్టి గురించి ఒక ఆలోచన వచ్చింది. “ఈ సృష్టినంతా నేనే చేసాను కదా! కనుక నేనే దీన్ని పాలించాలి.

అసలు ఆకారంలేని సృష్టితో ఏ పనీ చేయటం వీలుకాదు. కనుక నేనొక మూర్తిని సృష్టించటం మంచిది. అదే ఈ జగత్తునంతా పాలిస్తుంది" అని తలచాడు. ఇలా ఆయన భావిస్తూ ఉండగానే పూర్వం తాను చేసిన సృష్టి మొత్తం ఆయనకి కనిపించింది. అంతటి సృష్టి మొత్తం తన ముందు నిల్చుండగా, తన శరీరంలోనుంచి మూడులోకాలు బైటికి వచ్చి ఎదురుగా ఉన్న సృష్టిలోకి ప్రవేశించాయి. ఆ విషయాన్ని నారాయణుడు గమనించాడు.

నారాయణుడు పూర్వం తను వాక్కుకి ఇచ్చిన వరాన్ని స్మరించాడు. ఆ వాక్కుతో నీవు సర్వాన్నీ ఎరిగినవాడివి, సర్వానికీ కర్తవి. సకలలోకాలూ నీకు మ్రొక్కుతాయి. మూడులోకాల్లో నీవు ప్రవేశించటం వల్ల నీవు సనాతనుడైన విష్ణువుగా ప్రసిద్ధిచెందుతావు. బ్రహ్మదేవుడు ఎల్లప్పుడూ సకల దేవతలకీ కార్య సిద్ధిచేకూరుస్తుంటాడు. ఓదేవా! నీకు సర్వజ్ఞత్వం కలుగుగాక! అని పలికి నారాయణ పరబ్రహ్మ తిరిగి యథాస్థితికి వచ్చాడు.

విష్ణువు తిరిగి పూర్వపుబుద్ధిని స్మరించి ఇంద్రియాల ద్వారా పుట్టిన ప్రజలందర్నీ తనలో స్థాపించి యోగనిద్రని ఆశ్రయించాడు. అలా గాఢనిద్రపోయిన ఆ పరమాత్మ నాభి నుంచి పెద్ద కమలం ఆవిర్భవించింది. ఆ పద్మంలో ఏడు ద్వీపాలతో సముద్రాలతో, అడవులతో నిండిన భూమికూడా ఏర్పడింది. ఆ రకంగా పద్మం ఎంతో విశాలంగా విస్తరించింది. ఆ పద్మంకాడ పాతాళలోకంలో నెలకొంది. దాని బొడిపమీద మేరు పర్వతం ఉంది. దాని మధ్యలో బ్రహ్మదేవుడు ఆవిర్భవించాడు.

ఆ విధంగా నారాయణుడి శరీరం నుంచి పుట్టిన పద్మాన్ని అందులో వున్న భూమండలాన్ని చూసి ఆయన శరీరంలోనే ఉన్న వాయువు మరో వాయువుని సృష్టించి బైటికి వదిలింది. లోపలున్న వాయువు బైటి వాయువుతో స్వామీ! అజ్ఞానాన్ని జయించటానికి శంఖాన్ని ధరించు. ఇదిగో ఈ ఘోరమైన కాల చక్రాన్ని అధర్మమనే ఏనుగుని మోదటానికి గదని, భూతలానికి తల్లి అయిన ఈ వనమాలని, సూర్య చంద్రులకి బదులుగా శ్రీవత్సాన్ని కౌస్తుభాన్ని ధరించు. ఈ వాయువే నీ గమనం. దీన్నే గరుత్మంతుడంటారు.

ఈ వాయురూపుడైన గరుత్మంతుణ్ణి అధిరోహించి ముల్లోకాలూ సంచరించు. లక్ష్మీదేవి నిన్నెప్పుడూ ఆశ్రయించి ఉంటుంది. నీకు ద్వాదశితిథి ఎంతో ప్రీతికరమైనది.

## విష్ణుస్తుతి

నమామి విష్ణుం త్రిదశారినాశనం విశాలవక్షః స్థల సంశ్రితశ్రియమ్ ।
సుశాసనం నీతిమతాం పరాం గతిం త్రివిక్రమం మన్దరధారిణం సదా ॥ 1

దామోదరం రఞ్జితభూతలం ధియా యశోఽంశుశుభ్రం భ్రమరాఙ్గ సప్రభమ్ ।
ధరాధరం నరకరిపుం పురుష్టుతం నమామి విష్ణుం శరణం జనార్ధనమ్ ॥ 2

నరం నృసింహం హరి మీశ్వరం ప్రభుం త్రిధామనామాన మనన్త వర్చసమ్ ।
సుసంస్కృతాస్యం శరణం నరోత్తమం వ్రజామి దేవం సతతం త మచ్యుతమ్ ॥ 3

త్రిధా స్థితం తిగ్మ రథాఙ్గ పాణినం నయస్థితం తృప్త మమత్తమై ర్గుణైః ।
నిః శ్రేయసాఖ్యం క్షపితేతరం గురుం నమామి విష్ణుం పురుషోత్తమం త్వహమ్ ॥ 4

హతౌ పురాణౌ మధుకైటభా వుభౌ బిభర్తి చ క్ష్మాం శిరసా సదా హి సః ।
యథా స్తుతో మే ప్రసభం సనాతనో దధాతు విష్ణుః సుఖ మూర్జితం మమ ॥ 5

మహావరాహో హవిషామ్బుభోజనో జనార్దనో మే హితకృచ్ఛితీముఖః ।
క్షితీధరో మా ముదధిక్షయో మహాన్ స పాతు విష్ణుః శరణార్థినం తు మామ్ ॥ 6

మాయాతతం యేన జగత్త్రయం కృతం యథాగ్ని నైకేన తతం చరాచరమ్ ।
చరాచరస్య స్వయ మేవ సర్వతః స మే ఽస్తు విష్ణుః శరణం జగత్పతిః ॥ 7

భవే భవే యశ్చ ససర్జ కం తతో జగత్ ప్రసూతం సచరాచరం త్విదమ్ ।
తతశ్చ రుద్రాత్మవతి ప్రలీయతేఽన్వతో హరిర్విష్ణు హర స్తథోచ్యతే ॥ 8

ఖాత్మేన్దు పృథ్వీ పవనాగ్ని భాస్కరా జలం చ యస్య ప్రభవన్తి మూర్తయః ।
స సర్వదా మే భగవాన్ సనాతనో దదాతు శం విష్ణు రచిన్త్యరూపధృక్ ॥ 9

*(శ్లో॥18-21,అధ్యా-31)*

పవిత్రమైన ద్వాదశినాడు నీమీదే స్థిరంగా మనసు నిలిపి, నేయితో అన్నాన్ని భుజిస్తూ నీ పూజ చేసేవ్యక్తి స్త్రీగానీ పురుషుడుగానీ స్వర్గానికి చేరుకుంటారు. దేవదానవుల స్వరూపాలన్నీ విష్ణు రూపాలే. విష్ణువే ఈ లోకాలన్నిటినీ

సృష్టించి, రక్షించి లయం చేస్తుంటాడు. ప్రతియుగంలో విష్ణువే సర్వత్రా వ్యాపించి వుండే పరమదైవం. ఈయన్నే వేదాంతపురుషుడంటారు. హీన బుద్ధితో విష్ణువుని మానవుడుగా భావించకూడదు. సకల పాపాల్నీ పటాపంచలు చేసే ఈ విష్ణుసృష్టి వృత్తాంతాన్ని వినేవారు. కీర్తి ప్రతిష్ఠల్ని పొంది స్వర్గలోకానికి చేరుకుంటారు.

## త్రయోదశి - ధర్మోత్పత్తి వృత్తాంతం

పూర్వం అవ్యయుడు, సనాతనుడు అయిన బ్రహ్మ ప్రజల్ని సృష్టించాలని సంకల్పించాడు. అయితే తాను సృష్టించిన ప్రజల్ని పాలించేవాడెవరు? అన్న సందేహం ఆయనకి వచ్చింది. అలా ఆయన చింతిస్తుండగా బ్రహ్మ కుడిభాగం నుంచి తెల్లటి కుండలాలు, తెల్లటి పూలమాలలు ధరించిన పురుషుడు ఆవిర్భవించాడు. ఆ దివ్య పురుషుణ్ణి చూసిన బ్రహ్మ అతడితో " ఉత్తముడా! నీవు నేను సృష్టించిన ప్రజలందర్నీ పాలించు. ఈ జగత్తంతా నీవే ఆదిపురుషుడివి" అని అన్నాడు.

బ్రహ్మదేవుడి ఆదేశాన్ననుసరించిన ఆ పురుషుడు కృతయుగంలో నాలుగుపాదాలతో, త్రేతాయుగంలో మూడు పాదాలతో, ద్వాపరంలో రెండు పాదాలతో, కలియుగంలో ఒక పాదంలో నిలిచి ప్రజల్ని పాలించాడు. అతడే ధర్మపురుషుడు. ఆ ధర్మపురుషుడు బ్రాహ్మణుల్లో ఆరు భావాలతో, క్షత్రియుల్లో మూడు భావాలతో, వైశ్యుల్లో రెండు భావాలతో, శూద్రుల్లో ఒకే భావాలతో నెలకొని తన పాలన కొనసాగించాడు.

బ్రాహ్మణుల్లో ఆరు భావాలుగా అంటే 1.యజనం (యజ్ఞంచేయటం) 2.యాజనం (యజ్ఞాలు చేయించటం) 3. అధ్యయనం (వేదాల్ని పఠించటం) 4.అధ్యాపనం (వేదాల్ని శిష్యులతో చదివించటం) 5.దానం (దానంచేయటం) 6.ప్రతిగ్రహణం (దానాన్ని పుచ్చుకోవటం) అనేవి.

ఇక క్షత్రియుల్లో మూడు భావాలతో అనగా 1.యజ్ఞం చేయటం 2.వేదాల్ని చదవటం 3.దానంచేయటం, అలాగే వైశ్యుల్లో 1.వ్యవసాయం 2.వాణిజ్యం, శూద్రుల్లో వివిధవృత్తులు చేపట్టటం ద్వారా అన్నివర్ణాల వారికీ తోడ్పడటం. ఈ విధంగా ధర్మపురుషుడు సమస్తలోకాల్నీ ద్వీపాల్నీ పాలించాడు.

ధర్మపురుషుడికి ద్రవ్యం–గుణం–క్రియాజాతి అనేవి నాలుగు పాదాలు. సంహితం, పదం, క్రమం అనేవి ఆధర్మవృషభరూఢపురుషుడికి మూడు కొమ్ములు ఓంకారం మొదలు, తుది అనేవి అతడి రెండు తలలు. ఏడు విభక్తులు అతడి ఏడుచేతులు. ఉదాత్త అనుదాత్త స్వరితాలు అనే మూడు విధాలుగా రూపొందిన నాదమయరూపుడు ఆ ధర్మపురుషుడు. గొప్పజ్ఞాన సంపన్నుడైన ఆ మహానుభావుడు బ్రహ్మ ఆదేశాన్ననుసరించి జగత్తునంతా పాలిస్తున్నాడు.

ఒకనాడు చంద్రుడు అధర్మంగా బృహస్పతి భార్య తారని చెరపట్టటంతో ధర్మపురుషుడికి ఎంతో కష్టం కలిగింది. ఆయనెంతో బాధపడ్డాడు. తన అధర్మ ప్రవర్తనతో భయపెట్టగా ధర్మపురుషుడు ఎవరూ చేరరాని అరణ్యాల్లోకి వెళ్ళిపోయాడు. ఆ విధంగా ధర్మపురుషుడు లోకాల్ని వదిలి అడవిలోకి వెళ్ళిపోవటంతో అన్ని లోకాల్లో అధర్మచింతన పెరిగిపోయింది. దేవతలు అసురుల భార్యల్ని అలాగే అసురులు దేవతల భార్యల్ని చెరబట్టాలని ప్రయత్నిస్తున్నారు.

చంద్రుడు చేసిన పనివల్ల ధర్మం నశించిపోగా స్త్రీల కారణంగా దేవతలు రాక్షసులు పరస్పరం దాడులు చేసుకోవటం ప్రారంభించారు. ఈ విషయం తెలిసిన నారదుడు సరాసరి బ్రహ్మలోకానికి వెళ్ళి ఆయనకీ విషయాన్ని తెలియచేసాడు. వెంటనే బ్రహ్మ హంసవాహనం మీద యుద్ధరంగానికి వచ్చి దేవతల్ని దానవుల్ని సముదాయించి వారుయుద్ధం విరమించేలా చేసాడు. అసలు ఎందుకు మీరీయుద్ధం చేస్తున్నారు అని ప్రశ్నించగా వారంతా సోముడి (చంద్రుడి) వల్లే మేము యుద్ధం చేస్తున్నాం అన్నారు. బ్రహ్మదేవుడు జరిగిందంతా దివ్యదృష్టితో చూసాడు. ఆయనకి సత్యం బోధపడింది. ధర్మపురుషుడు అడవిలోకి వెళ్ళిపోయాడని తెలుసుకున్నాడు.

బ్రహ్మదేవుడు వెంటనే దేవతలందర్నీ అసురుల్ని వెంటబెట్టుకుని ధర్మపురుషుడున్న చోటుకి వెళ్ళాడు. అక్కడ ధర్ముడు నాలుగుపాదాలతో సంచరిస్తున్నాడు. అతన్ని దేవతలకీ, అసురులకీ చూపించి "సురాసురులారా! ఇతడే ధర్మపురుషుడు నా మొదటి కుమారుడు. చంద్రుడు చేసిన అధర్మం వల్ల

భయపడి ఈ అడవిలోకి వచ్చాడు. మీరంతా ఇతన్ని సంతోషపెట్టండి. దానివల్ల మీ ఇద్దరికీ మేలు జరుగుతుంది" అని పలికాడు. బ్రహ్మ మాటలు విన్న దేవ దానవులంతా చంద్రుడిలా ప్రకాశించే ఆ ధర్మపురుషుణ్ణి భక్తితో ఇలా స్తుతించారు.

## దేవతలు చేసిన ధర్మపురుషస్తుతి

నమోఽస్తు శశిసంకాశ నమస్తే జగతః పతే,
నమోఽస్తు దేవరూపాయ స్వర్గమార్గ ప్రదర్శక
కర్మమార్గ స్వరూపాయ సర్వగాయ నమో నమః ॥ 1

త్వయేమం పాల్యతే పృథ్వీ త్రైలోక్యంచ త్వయైవ హి
జన స్తపస్తథా సత్యం త్వయా సర్వంతు పాల్యతే ॥ 2

న త్వయా రహితం కిఞ్చి జ్జగత్ స్థావరజంగమమ్
విద్యతే తద్విహీనం తు సద్యో నశ్యతి వై జగత్ ॥ 3

త్వమాత్మా సర్వభూతానాం సతాం సత్త్వస్వరూపవాన్
రాజసానాం రజస్త్వంచ తామసానాం తమోమయః ॥ 4

చతుష్పాదో భవాన్ దేవ చతుశ్శృఙ్గ స్త్రిలోచనః
సప్తహస్తి స్త్రి బన్ధశ్చ వృషరూప నమోఽస్తుతే ॥ 5

త్వయా హీనా వయం దేవ సర్వ ఉన్మార్గ వర్తినః
తన్మార్గం యచ్ఛ మూఢానాం త్వం హి నః పరమాగతిః ॥ 6

*(శ్లో॥20-25,అధ్యా-32)*

ఈ విధంగా దేవతలు చేసిన స్తుతి విని ధర్మపురుషుడు సంతోషించాడు. వృషభరూపంలో వున్న ఆ ధర్ముడు ఎంతో ప్రశాంతంగా వారిని చూసాడు. అంతే పరమపవిత్రమైన అతడి చూపుసోకగానే వారంతా మోహాన్ని వదిలేశారు. కేవలం దేవతలే కాదు రాక్షసులు కూడా ధర్ముడి ప్రభావంతో తమలోని తామసగుణాన్ని వదిలేశారు. అలా దేవదానవులిద్దరూ ధర్మపరాయణులై పోయారు. అప్పుడు బ్రహ్మదేవుడు వారందర్నీ చూసి ఎంతో ఆనందించి ధర్ముడితో ఇలా అన్నాడు.

ఓధర్మా! ఈ రోజునుంచి నీకు త్రయోదశి ప్రీతికరంగా ఉండుగాక! పవిత్రమైన ఈ తిథినాడు ఉపవాసముండి నిన్ను స్మరించినవాడు ఎన్ని పాపాలు చేసినా వాటినుంచి విముక్తి పొందుతాడు. నీవు చాలాకాలం ఈ అరణ్యంలో నివసించినందువల్ల దీనికి ధర్మారణ్యం అనే పేరు వస్తుంది.

కృతయుగంలో నాలుగుపాదాలతో, త్రేతాయుగంలో మూడుపాదాలతో, ద్వాపరంలో రెండు పాదాలతో, కలియుగంలో ఒక్క పాదంతో సంచరిస్తూ నీవు భూలోక వాసులకి కనిపిస్తూ! ఇక పైలోకాల్లో నీవు సొంతఇంట్లో ఉన్నట్టే సంచరిస్తూ అన్ని లోకాల్నీ రక్షించు. ఇలా పలికి బ్రహ్మదేవుడు అక్కణ్ణుంచి అదృశ్యుడయ్యాడు. ధర్ముడి ప్రభావంతో దేవతలు కూడా దుఃఖాన్ని వదిలి ధర్మబుద్ధిని పెంచుకుని తమ తమ నివాసాలకి వెళ్ళిపోయారు.

పరమపవిత్రమైన ఈ ధర్ముడి కథని విన్నవారు, వినిపించిన వారు శ్రాద్ధకర్మల్లో పితృదేవతలకి తర్పణం చేసే, త్రయోదశి తిథినాడు శక్తికొద్దీ పాయసంతో భోజనం పెట్టేవాడు స్వర్గాన్ని చేరి సుఖభోగాలనుభవిస్తారు.

## చతుర్థశీతిథి - రుద్రసంభూతి వృత్తాంతం

పూర్వం సృష్టిని చేయాలని ప్రయత్నించిన బ్రహ్మదేవుడు ఎంత ప్రయత్నించినా సృష్టిని ఎలా ప్రారంబించాలో స్ఫురించలేదు. ఆ కారణంగా ఎంత కాలానికీ సృష్టి వృద్ధిచెందక పోవటంతో ఆయనకి ఎంతో బాధకలిగింది. తపస్సు చేయటం మొదలుపెట్టాడు. కొద్ది సేపటికి వెంటనే ఆయన శరీరం నుంచి...

తపస్సతోఽ తః స్థిరకీర్తిఃపురాణో రజస్తమోధ్వస్తగతిర్బభూవ ।
వరోవరేణ్యో వరదః ప్రతాపీకృష్ణారుణః పురుషః పింగనేత్రః ॥

*(శ్లో॥3,అధ్యా-33)*

స్థిరమైన కీర్తి కలిగినవాడు, పురాణుడు, రజస్తమో గుణప్రవృత్తి కలిగినవాడు, శ్రేష్ఠుడు, గొప్ప వారాల్ని ప్రసాదించేవాడు, నలుపు ఎరుపు కలిసిన శరీర వర్ణం కలిగినవాడు, పసుపురంగు కళ్ళతో ప్రకాశించేవాడు అయిన ఒక పురుషుడు ఉదయించాడు.

పుట్టగానే ఆ శిశువు పెద్దగా రోదించటం ప్రారంభించగా బ్రహ్మ అతన్ని రోదించవద్దని కోరాడు. అతడు ఎంతకీ ఏడుపు మానక పోవటంతో అతడి కోరిక మేరకు అతడికి 'రుద్రుడు' అని నామకరణం చేసాడు. ఆ తరువాత సృష్టిని కొనసాగించమని రుద్రుణ్ణి ఆదేశించాడు.

అయితే రుద్రుడు బ్రహ్మ మాటని తక్షణమే పాటించకుండా తపస్సు చేసుకోవాలని నీళ్ళలో మునిగాడు. అలా రుద్రుడు నీళ్ళలో తపస్సు చేసుకోవటానికి వెళ్ళిపోగా బ్రహ్మ తన సృష్టిని ఎలాగైనా కొనసాగించాలని భావించి మానస పుత్రుల్ని సృష్టించాడు. మరీచ్యాది మానసపుత్రులంతా ప్రజాపతులై సృష్టిని క్రమంగా వృద్ధి పరిచారు. ఆ విధంగా సృష్టి బాగా వ్యాప్తి చెందింది.

ఒకనాడు దేవేంద్రుడు బ్రహ్మ గురించి గొప్పయాగం చేయటం ప్రారంభించాడు. అదే సమయంలో రుద్రుడు తపస్సు చాలించి, సృష్టిచేయాలని నీళ్ళలోంచి బైటికి వచ్చాడు. రాగానే ఎదురుగా దేవతలు సిద్ధులు అందరూ కలిసి యజ్ఞసన్నాహాలు చేస్తూ కనిపించారు. రుద్రుడికి కోపం వచ్చింది. తనను కాదని ఈ సృష్టినంతా ఎవరు సృష్టించారు అని గట్టిగా అరిచాడు. అలా అరుస్తున్న రుద్రుడి నోటిలోంచి భయంకరమైన జ్వాలలు ఆవిర్భవించాయి. ఆ జ్వాలల్లోంచి అంతరిక్షపిశాచాలు, భేతాళగణాలు, భూతాలు, యోగులు, వేలాదిగా వెలువడ్డారు. వారందరి రాకతో భూమి అకాశం అన్నీ నిండిపోయాయి.

రుద్రుడు సర్వాన్నీ తెలిసినవాడు ఇరవై నాలుగుమూరల కొలతతో ఒకపెద్ద విల్లుని నిర్మించాడు. మూడుపేటల అల్లెత్రాడుని దానికి అమర్చాడు. ఆ ధనువుని తీసుకుని దాంతో పూషుడి పళ్ళను ఊడగొట్టాడు. భగుడి నేత్రాల్ని పీకేశాడు, క్రతువు వృషణాల్ని రాలగొట్టాడు. ఇలా అక్కడ జరుగుతున్న యాగాన్నంతా తను తన అనుచర గణాలు కలిసి ధ్వంసం చేసారు. అప్పుడు దేవతలంతా రుద్రుణ్ణి చేరి శాంతించమని ప్రార్థించారు.

విషయం తెలిసిన బ్రహ్మ వెంటనే అక్కడికి వచ్చాడు. రుద్రుణ్ణి శాంతించమని కోరాడు. అప్పుడు రుద్రుడు "పితామహా! వీరందరికన్నా నీవు

నన్నే కదా ముందు సృష్టించావు. వీరంతా నా తరువాత పుట్టి నాకు యజ్ఞభాగాన్నివ్వటం లేదు. అందుకే వీరందరికీ గుణపాఠం నేర్పాలని దండించాను" అని అన్నాడు. రుద్రుడి వాదన సత్యమేనని గ్రహించిన బ్రహ్మ దేవతలందర్నీ పిలిచి రుద్రుణ్ణి భక్తిగా స్తుతించి శాంతపరచమని ఆదేశించాడు. దేవతలంతా శ్రద్ధాభక్తులతో బ్రహ్మ చెప్పిన విధంగా రుద్రుణ్ణి ఇలా ఘనంగా స్తుతించారు.

## దేవతలు చేసిన రుద్రస్తుతి

నమో దేవాదిదేవాయ త్రినేత్రాయ మహాత్మనే
రక్తపిఙ్గలనేత్రాయ జటామకుట ధారిణే 1

భూతబేతాళ జుష్టాయ మహాభోగోపవీతినే,
భీమాట్టహాస వక్త్రాయ కపర్దిన్ స్థాణవే నమః 2

పూష్ణో దన్తవినాశాయ భగనేత్రహనే నమః
భవిష్య వృషచిహ్నాయ మహాభూతపతే నమః 3

భవిష్యతి పురాన్తాయ తథాన్ధకవినాశినే
కైలాస వరవాసాయ కరికృత్తినివాసినే 4

వికారాళోర్ధ్వకేశాయ భైరవాయ నమోనమః
అగ్నిజ్వాలా కరాళాయ శశిమౌళి కృతే నమః 5

భవిష్యకృత కాపాలి వ్రతాయ పరమేష్ఠినే
తథా దారువనధ్వంస కారిణే తిగ్మశూలినే 6

కృతకఙ్కణ భోగీన్ద్ర నీలకణ్ఠ త్రిశూలినే
ప్రచణ్డ దణ్డ హస్తాయ వడవాగ్నిముఖాయ చ 7

వేదాన్తవేద్యాయ నమో యజ్ఞ మూర్తే నమో నమః
దక్షయజ్ఞ వినాశాయ జగద్భయ కరాయ చ 8

విశ్వేశ్వరాయ దేవాయ శివశంభు భవాయ చ
కపర్దినే కరాళాయ మహాదేవాయ తే నమః 9

*(శ్లో॥15-24,అధ్యా-33)*

ఈవిధంగా దేవతలందరూ స్తుతించగా భయంకరమైన ధనస్సు ధరించిన రుద్రుడు దేవతలందరితో "నేను దేవుళ్ళకే దేవుణ్ణి. మీకేం కావాలో కోరుకోండి" అని అన్నాడు. అప్పుడు దేవతలందరూ మూకుమ్మడిగా దేవా! మా తప్పుల్ని మన్నించి మానుంచి నీవు లాక్కున్న వేదశాస్త్ర విజ్ఞానాన్ని, రహస్యమైన మంత్రాలతో కూడిన శాస్త్ర విజ్ఞానాన్ని, రహస్యమైన మంత్రాలతో కూడిన యజ్ఞవిధానాన్ని తిరిగి మాకు ప్రసాదించు" అని కోరారు. రుద్రుడు వారికి అడిగినవన్నీ ప్రసాదించి దేవతలారా! మీరందరూ పశువులు నేను పశుపతిని, నా మీద శ్రద్ధా భక్తులు కలిగివున్న వారందర్నీ నేను రక్షిస్తాను అని వారందరికీ అభయాన్నిచ్చాడు.

బ్రహ్మదేవుడు పశుపతి అయిన రుద్రుడి మాటలు విని సంతోషించి ఆయనతో "దేవా! నీకు చతుర్దశి తిథి ప్రీతికరమైనదగుగాక! ఈ పవిత్ర తిథినాడు ఉపవాసముండి, శ్రద్ధగా నిన్ను పూజించి బ్రాహ్మణులకి అన్నసంతర్పణ చేసే వారికి నీవు సకల శుభాల్నీ ప్రసాదించు. వారు కోరిన కోర్కెలు తీర్చు" అని కోరాడు. శివుడు సరేనని అభయమిచ్చి తన చేతిలో చావుదెబ్బలు తిన్నవారందరికీ పూర్వరూపం కలిగేలా చేసాడు.

ఎవరైతే చతుర్దశినాడు తెల్లవారుఝామునే నిద్రలేచి ఈ రుద్రవృత్తాంతాన్ని శ్రద్ధగా వింటారో లేక పఠిస్తారో వారు సకల పాపాలనుంచీ విముక్తి పొంది రుద్రలోకానికి చేరుకుంటారు.

## అమావాస్య తిథి - పితృదేవతలు

పూర్వం బ్రహ్మదేవుడు వివిధ రకాల ప్రజల్ని సృష్టించాలనుకున్నాడు. అందుకోసం స్థిరమైన మనసుతో ఆ ప్రజలందరి మూల ద్రవ్యాన్ని మనసులో నిలుపుకుని, వారిని బైటికి తీసుకురావటం కోసం పరబ్రహ్మని ప్రార్థించాడు. ఆ సమయంలో ధ్యానంలో ఉన్న బ్రహ్మదేవుడి శరీరం నుంచి లోపల వున్న తన్మాత్రలు పొగరూపంలో బైటికి వచ్చాయి. పొగరంగులో వున్న ఆ దివ్య పురుషులు మేము సోమరసం త్రాగుతాం అని దేవతలతో అంటూ ఊర్ధ్వలోకంవైపు

వెళ్ళుతూ ఆకాశంలో కొద్దిసేపు అలా నిలబడ్డారు. అంతలో బ్రహ్మదేవుడు ధ్యానం నుంచి లేచి కళ్ళుతెరిచాడు. ఎదురుగా ఆకాశంలో నిలిచిన పురుషులు కనిపించారు వారిని చూసి "ఓ దివ్యపురుషులారా! మీరు నేటి నుంచీ భూలోకంలో ఉన్న గృహస్థులందరికీ పితృదేవతలుగా ఉండండి"అని ఆజ్ఞాపించాడు. పైన నిలిచిన పురుషుల్లో తలపైకెత్తి నిలిచిన వారు నాందీముఖులు అన్న పేరుతో ప్రసిద్ధి చెందారు.

శ్రాద్ధ కర్మల్లో వృద్ధికోసం పితృదేవతల్ని వేదమార్గంలో పూజించాలి. అగ్నిని ముందుంచుకుని నిత్యాగ్ని హోత్రం చేసే విప్రులు నిత్య, నైమిత్తిక, కామ్య కర్మలు ఆచరించేటప్పుడు, పర్వదినాల్లో పితృదేవతల్ని సంతృప్తి పరచాలి. బహిః ప్రావరణులు అనగా వెలుపల దర్భలమీద కూర్చుండేవారిని క్షత్రియులు తృప్తి పరచాలి. అలాగే నేయి త్రాగే వారిని వైశ్యులు తర్పణాల ద్వారా సంతృప్తి పరచాలి. ఇక శూద్రులు బ్రాహ్మణుల్ని అడిగి తమ తల్లితండ్రుల పేర్లు చెప్పుకుని ఎలాంటి మంత్ర విధానం లేకుండానే పితృదేవతల్ని అర్చించవచ్చు.

ఆహితాగ్నులు కానీ, బ్రాహ్మణక్షత్రియ వైశ్యులు గానీ లౌకికాగ్నిముందు, ఆయా పితృదేవతల తిథులు ఉన్న రోజుల్లో వారిని అర్చించాలి. బ్రహ్మ దేవుడు పితృదేవతల్ని పిలిచి వారితో "ఓ పితృదేవతలారా! మానవుల ద్వారా తర్పణాలు, పూజలు అందుకున్న మీరు వారి కోరికలు తీర్చండి. ఆయువు, కీర్తి, ధనం, సంతానం, విద్య, వంటివి వారికి ప్రసాదించండి" అని చెప్పి వారికి దక్షిణాయనం అనే మార్గాన్ని ఏర్పాటుచేసాడు.

ఆ విధంగా పితృదేవతలకి మార్గాన్ని ఏర్పాటుచేసి బ్రహ్మ భూతసృష్టిని కొనసాగించాడు. అప్పుడు పితృదేవతలు బ్రహ్మతో "ప్రభూ! మాకు కూడా ఏదో ఒక తిథిని, వృత్తిని అనుగ్రహించు అని కోరారు. బ్రహ్మ వారితో – మీకు అమావాస్య తిథిని కల్పిస్తున్నాను. ఆనాడు ప్రజలు దర్భలతో, నువ్వులతో, నీళ్ళతో మీకు తర్పణాలు ఇస్తారు. తద్వారా మీరు సంతృప్తి చెంది వృద్ధి పొందుతారు అని వరాన్ని అనుగ్రహించాడు. అలా ఆనాటి నుంచి అమావాస్య పితృదేవతలకి అత్యంత పవిత్రమైన తిథిగా నిర్ణయించబడింది.

## పౌర్ణమాసీ తిథి - చంద్రుడి వృత్తాంతం

బ్రహ్మమానసపుత్రుడు అత్రిమహర్షి. ఆయన గొప్ప తపస్సంపన్నుడు. ఆయన పుత్రుడే చంద్రుడు. ఆ చంద్రుడు దక్షుడి కుమార్తెలైన 27 మంది కన్యల్ని వివాహం చేసుకున్నాడు. వారందరిలోకీ చిన్నది రోహిణి. చంద్రుడు నిత్యం రోహిణితోనే విహరిస్తూ మిగిలిన భార్యల్ని నిర్లక్ష్యం చేసేవాడు. వారంతా తండ్రి దగ్గరకి వెళ్ళి తమ భర్త తమని నిర్లక్ష్యం చేస్తున్న సంగతిని చెప్పారు. అప్పుడు దక్షుడు చంద్రుడి దగ్గరకి వచ్చి అందరు భార్యల్నీ సమానంగా చూడటం ధర్మం అని చాలాసార్లు నచ్చచెప్పాడు. అయితే ఎంత చెప్పినా చంద్రుడు తన బుద్ధి మార్చుకోలేదు.

దక్షుడికి చంద్రుడిమీద ఆగ్రహం కలిగింది. అల్లుడని కూడా చూడకుండా చంద్రుణ్ణి క్షీణించి పొమ్మని శపించాడు. చంద్రుడు కూడా దక్షుణ్ణి "నీవు కూడా సనాతనమైన బ్రహ్మ దేహాన్ని వదిలి ఎంతో మందికి జన్మించుగాక! అని తిరిగి శపించాడు.

దక్షుడి శాపం వల్ల చంద్రుడు రోజురోజుకీ క్షీణించిపోసాగాడు. క్రమంగా సోముడు అలా రూపం లేనివాడు కావటంతో దేవతలు, మనుషులు, ఓషధులు, చెట్లు అన్నీ క్షీణించిపోయాయి. అలా సృష్టి మొత్తం క్షీణించటంతో దేవతలంతా వెళ్ళి విష్ణువుతో మొరపెట్టుకున్నారు. అప్పుడు విష్ణువు దక్షుడి శాపాన్ని మనం తప్పించలేము మీరు వెంటనే మిగిలిన ఓషధుల్ని ఈ సముద్రంలో వేసి చిలకటం ప్రారంభించండి అని చెప్పాడు. తాను కూడా రుద్రుణ్ణి స్మరించి, వారుచేసే మథనానికి మందర పర్వతాన్ని కవ్వంగా, వాసుకి సర్పాన్ని కవ్వం త్రాడుగా ఏర్పాటుచేసాడు. ఆ విధంగా విష్ణువు మాటననుసరించి సముద్రాన్ని చిలకగా దానినుంచి చంద్రుడు తిరిగి జన్మించాడు.

మానవుల శరీరంలో క్షేత్రజ్ఞుడుగా వుండే పురుషుడే చంద్రుడని భావించాలి. ఎందుకంటే ప్రతి ఒక్కరి మనస్సుకి కారకుడు చంద్రుడు కనుక. శరీరం ధరించిన వారిలో చంద్రుడు జీవుడుగా గుర్తించబడతాడు. దేవతలు,

మనుషులు, పదహారు విధాలుగావున్న ఇతర దేవతా గణాలు ఆయనపైనే ఆధారపడి జీవిస్తుంటారు. అలాగే వృక్షాలకి ఓషధులకీ కూడా చంద్రుడే ప్రభువు. రుద్రుడు అతడిలోని ఒక కళని తన సిగలో ధరించాడు. సృష్టిలో వున్న నీరు మొత్తం చంద్రుడి స్వరూపమే. అతడు విశ్వమూర్తి. అలాంటి చంద్రుడికి ప్రీతికరంగా పౌర్ణమి తిథిని బ్రహ్మదేవుడు ఏర్పాటుచేసాడు.

పౌర్ణమితిథినాడు చంద్రుడి ప్రీత్యర్థం ఉపవాసం చేసి, ఆయన్ని పూజించాలి. ఆ రోజు కేవలం యవధాన్యంతో వండిన అన్నాన్నే తినాలి. అలా చేసిన వారికి చంద్రుడు జ్ఞానాన్ని, శాంతిని, కాంతిని, తుష్టిని పుష్టిని ప్రసాదిస్తాడు.

## ప్రజాపాలుడు - గోవింద స్తవం

పూర్వం ప్రజాపాలుడనే మహారాజుండేవాడు. అతడెంతో ధర్మ పరాయణుడు అతడి పూర్వీకులందరూ మొదటి త్రేతాయుగంలో మణివంశంలో జన్మించిన వారు. వారంతా తిరిగి రెండో త్రేతాయుగంలో కూడా జన్మించారు.

వారిలో మణివల్ల జన్మించిన దీప్త తేజుడనే వాడు రెండో త్రేతాయుగంలో శంతుడనేవాడిగా, అలాగే సురరశ్మి–శతకర్ణుడుగా, శుభదర్శనుడు పాంచాలుడిగా, సుశాంతి అనేవాడు సుందరుడుగా, సుందుడనే వాడు - ముచికుందుడుగా, సుద్యుమ్నుడనేవాడు - తురుడిగా, సుమనుడు అనేవాడు సోమదత్తుడుగా, శుభుడనేవాడు - సంవరణుడుగా, సుశీలుడు - వసుదాసుడుగా, సుఖుడు - అసుపతిగా పుట్టారు.

అదేవిధంగా శంభుడనేవాడు సేనాపతిగా జన్మించగా కాంతుడనేవాడు దశరథుడుగా పుట్టాడు. సోముడనేవాడు జనకమహారాజయ్యాడు. ఈవిధంగా రెండో త్రేతాయుగంలో జన్మించిన వారంతా ఎన్నో యజ్ఞయాగాది క్రతువుల్ని ఆచరించి స్వర్గాన్ని చేరుకున్నారు. ప్రజాపాలుడు తన పూర్వీకుల వృత్తాంతాన్ని తెలుసుకుని తాను కూడా మోక్షం పొందాలనే కాంక్షతో తపస్సుచేయటం కోసం అడవికి వెళ్ళాడు. ప్రజాపాలుడు కొన్నాళ్ళు అడవిలో తపస్సు చేసి ఆ తరువాత గోవిందుడి నివాసమైన బృందావన ధామానికి వచ్చాడు. అక్కడ గోవిందుడు ప్రసిద్ధి చెందిన శ్రీహరిని ఎంతో భక్తి ప్రపత్తులతో ఇలా స్తుతించాడు.

## గోవింద స్తుతి

నమామి దేవం జగతాం చ మూర్తిం గోపేన్ద్ర మిన్ద్రానుజ మప్రమేయమ్
సంసార చక్ర క్రమణైకరక్షం క్షితీ దేవవరం నమామి ॥ 1
భవోదధౌ దుఃఖశతోర్మిభీమే జరావర్తే కృష్ణ పాతాళమూలే
తదన్త మేకో దధతే సుఖం మే నమోఽస్తుతే గోపతి రప్రమేయ ॥ 2
వ్యాధ్యాది యుక్తైః పురుషై ర్గ్రహైశ్చ సంఘట్టమానం పునరేవ దేవ
నమోఽస్తుతే యుద్ధరతే మహాత్మనే జనార్దనో పేన్ద్ర సమస్తబన్ధో ॥ 3
త్వముత్తమః సర్వవిదాం సురేశ త్వయా తతం విశ్వమిదం సమస్తమ్
గోపేన్ద్ర మాం పాహి మహానుభావ భవాద్భీతం తిగ్మరథా జ్గపాణే ॥ 4
పరోఽసి దేవ ప్రవరః సురాణాం పుంసః స్వరూపోఽసి శశిప్రకాశః
హుతాశ వక్త్రాచ్యుత తీవ్రభావ గోపేంద్ర మాం పాహి భవే పతన్తమ్ ॥ 5
సంసార చక్ర క్రమణా న్యనేకా న్యావిర్భవన్త్యచ్యుత దేహినాం యత్
త్వన్మాయయా మోహితానాం సురేశ కస్తే మాయాం తరతే ద్వన్ద్వధామా ॥ 6
అగోత్ర మస్పర్శ మరూపగన్ధ మనామ నిర్దేశ మజం వరేణ్యమ్
గోపేన్ద్ర త్వాం యద్యుపాసన్తి ధీరా స్తే ముక్తిభాజో భవబన్ధముక్తాః॥ 7
శబ్దాతిగం వ్యోమరూపం విమూర్తిం వికర్మిణం శుభభావం వరేణ్యమ్
చక్రాబ్జపాణింతు తథోపచారా దుక్తం పురాణే సతతం నమామి॥ 8
త్రివిక్రమం క్రాన్తజగత్త్రయంచ చతుర్మూర్తిం విశ్వగతం క్షితీశమ్
శంభుం విభుం భూతపతిం సురేశం నమా మ్యహం విష్ణు మనన్త మూర్తిమ్ ॥ 9
త్వం దేవ సర్వాణి చరాచరాణి సృజస్యథో సంహరసే త్వమేవ,
మాం ముక్తికామం నయ దేవ శీఘ్రం యస్మిన్ గతా యోగినో నాపయాన్తి॥ 10
జయస్వ గోవిన్ద మహానుభావ జయస్వ విష్ణో జయ పద్మనాభ,
జయస్వ సర్వజ్ఞ జయాప్రమేయ జయస్వ విశ్వేశ్వర విశ్వమూర్తే ॥ 11

*(శ్లో॥ 12-22, అధ్యా-36)*

ఈ విధంగా ప్రజాపాలుడు స్తుతించగానే భక్తవరదుడైన గోవిందుడు ప్రత్యక్షమయ్యాడు. వెంటనే ఎంతో తన్మయత్వంతో తన శరీరాన్ని విడిచి గోవిందుడిలో ఐక్యమైపోయాడు ప్రజాపాలుడు.

## రుద్రుడు - విష్ణువు అభేదం

పూర్వం బ్రహ్మదేవుడు తననుంచి ఆవిర్భవించిన రుద్రుణ్ణి పిలిచి సృష్టిచేయమని ఆజ్ఞాపించాడు. అప్పుడు సృష్టిచేసే సామర్థ్యం లేనికారణంగా రుద్రుడు నీళ్ళలోకి మునిగాడు. అలా నీటిలోకి చేరిన రుద్రుడు బొటనవేలంత పరిమాణంలో ఉన్న పరబ్రహ్మని ధ్యానిస్తూ అక్కడే ఉన్నాడు. అంతలో ఆయన ముందు దివ్యతేజస్సుతో వెలిగిపోతున్న పదకొండుమంది మహాపురుషులు, నీళ్ళలోంచి పైకి లేచి వెళుతున్నారు. వారిప్రభావంతో ఆ జలమంతా వేడెక్కిపోయింది. అప్పుడు రుద్రుడు వారితో అయ్యా మీరెవరు? ఎక్కడికి వెళుతున్నారు? అని అడిగాడు. అయితే వారెవరూ ఈయనకి సమాధానం చెప్పలేదు.

పదకొండు మంది పురుషులు పైకి వెళ్ళిపోగానే రుద్రుడి కళ్ళకి మహాసుందరుడు, మేఘంలాంటి శరీరఛాయతో ప్రకాశిస్తున్నవాడు, పద్మాల్లాంటి నేత్రాలతో వెలుగొందేవాడు అయిన మరోపురుషుడు కనిపించాడు. రుద్రుడు ఆయన్ని పిలిచి మహానుభావా! నీవెవరు? ఇంతకుముందు వెళ్ళిన పదకొండు మంది 'పురుషులు ఎవరు? దయచేసి చెప్పండి అని కోరాడు. అప్పుడా మహాపురుషుడు రుద్రుడితో....

భవా! దివ్యతేజస్సుతో వెలిగిపోతూ పైకి వెళ్ళిన వారు ఆదిత్యులు. బ్రహ్మ వారి గురించి సంకల్పించాడు.అందుకే వారలా వెళ్ళారు. బ్రహ్మ చేసిన సృష్టిని వారంతా పరిరక్షిస్తారు అని చెప్పాడు. మహాపురుషుడి మాటలు విన్న రుద్రుడికి ఎంతో ఆశ్చర్యం కలిగి ఆయనతో "మహానుభావా! తమరు నన్ను భవా! అని సంబోధించారు. నాపేరు మీకెలా తెలిసింది? అని ప్రశ్నించాడు. అందుకా మహాపురుషుడు నవ్వుతూ శివుడికిలా సమాధానం చెప్పాడు.

భవా! నాపేరు నారాయణుడు. నేను నీటిలోనే నిద్రిస్తాను. నీరే నా నివాసస్థానం. నే సనాతనుణ్ణి. నీకు దివ్యదృష్టి ప్రసాదిస్తున్నాను. నా నిజస్వరూపాన్ని తెలుసుకో అన్నాడు నారాయణుడు. ఆయనలా పలకగానే సూర్యుడిలా

ప్రకాశిస్తూ బొటనవేలంత పరిమాణంతో ఒకస్వామి దర్శనమిచ్చాడు. రుద్రుడు అతన్ని బాగా పరీక్షించి చూసాడు. ఆ దివ్యపురుషుడి బొడ్డులో ఒక పద్మం ఆ పద్మం మధ్యలో బ్రహ్మని ఆయన దేహంలో తన రూపాన్ని దర్శించాడు. ఆ మహాపురుషుడైన నారాయణుణ్ణి చూసి పరమానందభరితుడైన రుద్రుడు ఎంతో ఘనంగా ఇలా కీర్తించాడు.

## రుద్రుడు చేసిన నారాయణ స్తుతి

నమోస్త్వనంతాయ విశుద్ధ చేతసే సరూప రూపాయి సహస్రబాహవే
సహస్రరశ్మి ప్రవరాయ వేధసే విశాల దేహాయ విశుద్ధ కర్మిణే ॥ 1
సమస్తవిశ్వార్తి హరాయ శంభవే సహస్ర సూర్యానిల తిగ్మతేజసే
సమస్త విద్యా విధృతాయ చక్రిణే సమస్త గీర్వాణ మతే సదాఽనఘ ॥ 2
అనాది దేవాచ్యుత శేషశేఖర ప్రభో విభో భూతపతే మహేశ్వర
మరుత్పతే సర్వపతే జగత్పతే భువః పతే భువనపతే సదా నమః ॥ 3
జలేశ నారాయణ విశ్వశంకర క్షితీశ విశ్వేశ్వర విశ్వలోచన
శశాంక సూర్యాచ్యుత వీర విశ్వగా ప్రతర్క్య మూర్తేఽమృతమూర్తి రవ్యయః ॥ 4
జ్వలద్ధుతాశార్చి విరుద్ధమండల ప్రపాహి నారాయణ విశ్వతోముఖ
నమోఽస్తు దేవార్తి హరామృతావ్యయ ప్రపాహి మాం శరణగతం సదాచ్యుత ॥ 5
వక్త్రాణ్య నేకాని విభో తవాహం పశ్యామి మధ్యస్థగతం పురాణమ్
బ్రహ్మాణ మీశం జగతాం ప్రసూతిం నమోఽస్తు తుభ్యం తు పితామహాయ॥ 6
సంసార చక్రభ్రమణై రనేకైః క్వచిద్ భవాన్ దేవవరాది దేవ
సన్మార్గిభి ర్జ్ఞాన విశుద్ధ సత్త్వై రుపాస్యసే కిం ప్రలపామ్యహం త్వామ్ ॥ 7
ఏకం భవన్తం ప్రకృతేః పరస్తాద్ యో వేత్త్వసౌ సర్వవిదాదిబోద్ధా,
గుణా నతేషు ప్రసభం విభేద్యా విశాలమూర్తి ర్హి సుసూక్ష్మరూపః ॥ 8
నిర్వాక్యో నిర్మన విగతేన్ద్రియోఽసి కర్మాభవాన్నో విగతైక కర్మా,
సంసారవాం స్త్వం హి న తాదృశోఽసి పునః కథం దేవవరా ఽసి వేద్యః ॥ 9
మూర్తామూర్తం త్వతులం లభ్యతే తే పరం వపు ర్దేవ విశుద్ధభావైః
సంసార విచ్ఛిత్తికరై ర్యజద్భి రతోఽవసీయేత చతుర్భుజ స్త్వమ్ ॥ 10

పరంన జానన్తి యతో వపుస్తే దేవాదయోఽప్యద్భుత కారణం తత్
అతోఽవతారోక్తతనం పురాణ మారాధయేయుః కమలాసనాద్యాః ॥ 11
న తే వపు ర్విశ్వసృగబ్జయోని రేకాంతతో వేద మహానుభావః
వరం త్వహం వేద్మి కవిం పురాణం భవన్త మాద్యం తపసా విశుద్ధః ॥ 12
పద్మాసనో మే జనకః ప్రసిద్ధ శ్చైతత్ ప్రసూతా వసకృత్పురాణైః
సంబోధ్యతే నాథ న మద్విధోఽపి విదుర్భవన్తం తపసా విహీనాః ॥ 13
బ్రహ్మాదిభి స్త్వత్ప్రవరై రబోధ్యం త్వాం దేవ మూర్ఖాః స్వమనన్త నత్యా
ప్రబోధ మిచ్ఛన్తి నతేషు బుద్ధి రుదారకీర్తి ష్వపి వేదహీనాః ॥ 14
జన్మాంతరై ర్వేదవిదాం వివేక బుద్ధి ర్భవే న్నాథ తవ ప్రసాదాత్
త్వల్లబ్ధ లాభస్య న మానుషత్వం న దేవగంధర్వ గతిః శివం స్యాత్ ॥ 15
త్వం విష్ణురూపోసి భవాన్ సుసూక్ష్మః స్థూలోసి చేదం కృతకృత్యతాయాః
స్థూలః సుసూక్ష్మః సులభోఽసి దేవ త్వద్బాహ్యావృత్త్యా నరకే పతన్తి ॥ 16
కి ముచ్యతే వా భవతి స్థితే ఽస్మిన్ ఖాత్మేన్దు వహ్న్యర్క మహీమరుద్భిః
తత్త్వైః సతోయైః సమరూపధారి, ణ్యాత్మస్వరూపే వితతస్వభావే ॥ 17
ఇతి స్తుతిం మే భగవన్ననంత జుషస్వ భక్తస్య విశేషతస్య
సృష్టిం సృజస్వేతి తవోదితస్య సర్వజ్ఞతాం దేహి నమోఽస్తు విష్ణో ॥ 18
చతుర్ముఖో యో యది కోటివక్త్రో భవేన్నరః క్వాపి విశుద్ధచేతాః
స తే గుణానా మయుతై రనేకై ర్వదేత్ తదా దేవవర ప్రసీద ॥ 19
సమాధి యుక్తస్య విశుద్ధబుద్ధే స్త్వద్భావ భావైక మనోఽనుగస్య
సదా హృదిస్థోఽసి భవాన్నమస్తే న సర్వగస్యాస్తి పృథగ్వ్యవస్థా ॥ 20
ఇతి ప్రకాశం కృత మేత దీశస్తవం మయా సర్వగతం విబుద్ధ్వా
సంసార చక్రక్రమమాణ యుక్త్యా భీతం పునీహ్యామచ్యుత కేవలత్వమ్ ॥ 21

*(శ్లో॥17-37,అధ్యా-73)*

మహాతేజో వంతుడైన రుద్రుడు స్తుతించగా సంతోషించిన నారాయణుడు గంభీరమైన స్వరంతో ఓ రుద్రా! నీకు మేలు కలుగుతుంది. నీకేం వరం కావాలో కోరుకో. మనిద్దరికీ ఎలాంటి భేదం లేదు. ఇద్దరం ఒక్కటే అని అన్నాడు.

అప్పుడు రుద్రుడు విష్ణువుకి నమస్కరించి, ప్రభూ! పూర్వం నన్ను బ్రహ్మదేవుడు సృష్టి చేయమని ఆజ్ఞాపించాడు. నాకు సృష్టి చేసే జ్ఞానాన్ని ప్రసాదించు అని కోరాడు. విష్ణువు తథాస్తు అని పలికి రుద్రుడికి కావలసిన జ్ఞానాన్ని ప్రసాదించాడు. ఆ తరువాత రుద్రుడు బైటికి వచ్చి తామసగణాల్ని సృష్టించాడు. శివుడు ఎంతో సంతోషంతో తనకి వరాన్ని ప్రసాదించిన విష్ణువు గొప్పతనాన్ని ఇలా వర్ణించాడు.

నారాయణాత్ పరోదేవో నభూతో నభవిష్యతి ।
ఏతత్ రహస్యం వేదానాం పురాణానాంచ సత్తమ ॥ *(శ్లో॥51,అధ్యా-74)*

నారాయణుడి కన్నా గొప్పదైవం ఇంతకుముందు లేడు. భవిష్యత్తులో ఉండబోడు. ఇది వేదాల్లో, పురాణాల్లో చెప్పబడ్డ రహస్యం.

## శక్తి స్వరూపం

పూర్వం భూదేవి వరాహమూర్తిని ప్రభూ! పరబ్రహ్మ పరమాత్మ ఎవరంటే! శివుడని కొందరు, బ్రహ్మదేవుడని మరికొందరు చెబుతున్నారు. నిజానికి పరదైవం ఎవరు అని అడిగింది. వరాహమూర్తి భూదేవితో పరదైవం గురించి ఇలా చెప్పటం ప్రారంభించాడు.

జగన్నాథుడైన నారాయణుడే పరదైవం పరబ్రహ్మ. ఆయన నుంచే చతుర్ముఖబ్రహ్మ పుట్టాడు. ఆ బ్రహ్మనుంచి రుద్రుడు ఆవిర్భవించాడు. బ్రహ్మ కుమారుడైన రుద్రుడు అందమైన ధాతువులతో ప్రకాశించే కైలాస శిఖరం మీద నివసిస్తుంటాడు. ముక్కంటి మహాదేవుడైన రుద్రుణ్ణి సకల దేవతలూ నిత్యం పూజిస్తూ ఉంటారు. సకల భూత గణాలతో పరివేష్టించబడ్డ శివుడు పార్వతీదేవితో కలిసి అక్కడ కొలువైవుంటాడు. కైలాసంలో శివుడి ప్రమథగణాలు అసంఖ్యాకంగా ఉన్నారు. వారిలో కొందరు సింహం ముఖంతో వుండి సింహాల్లా గర్జిస్తుంటే, మరికొంతమంది గుర్రం ముఖంతో, ఏనుగు ముఖంతో, వరాహ ముఖంతో సంచరిస్తున్నారు. వారిలో కొందరు ఆడుతుంటే, మరికొందరు పాడుతున్నారు. ఇలా వేలాది ప్రమథగణాలచేత సేవించబడుతున్నాడు శివుడు.

పరమేశ్వరుడు ఆ విధంగా ఆనందంగా కాలం గడుపుతుండగా ఒకనాడు దేవతలందర్నీ వెంటబెట్టుకుని బ్రహ్మదేవుడు అక్కడికి వచ్చాడు. వారందరినీ చూసి శంకరుడు ఆనందంగా స్వాగతించి వారువచ్చిన పనేమిటో చెప్పమని అడిగాడు. అప్పుడు బ్రహ్మదేవుడు వినయంగా నమస్కరించి "శంకరా! అంధకుడనే మహారాక్షసుడు అన్నిలోకాల్నీ పీడిస్తున్నాడు. వాడి బాధలు పడలేక దేవతలంతా నా దగ్గరకొచ్చారు. నేనేమీ చేయలేక వారందర్నీ తీసుకుని ఇదిగో ఇలా నీ దగ్గరకొచ్చాను. దయచేసి మా అందర్నీ కాపాడు "అని ప్రార్థించాడు. అలా అన్న తరువాత బ్రహ్మ శివుడి చేతిలో ఉన్న పినాకం అనే విల్లుని చూస్తూ మనసులో నారాయణుణ్ణి స్మరించాడు.

బ్రహ్మచేసిన స్మరణతో నారాయణుడు వెంటనే అక్కడ ప్రత్యక్షమయ్యాడు. ఒకేచోట త్రిమూర్తులు ముగ్గురూ కలిసారు. ఒకర్నొకరు సాభిమానంగా చూసుకున్నారు. ఒక్కసారి ఆ ముగ్గురూ తమ దృష్టిని ఒకేచోట కేంద్రీకరించారు. అంతే ఆశ్చర్యకరంగా ఆ మూడు దృష్టుల నుంచి ఒక దివ్యమైన కన్య ఆవిర్భవించింది. ఆ దేవి ఎలా వుందంటే?

నీలోత్పలదళ శ్యామా నీలకుంచిత మూర్ధజా!
సునాసా సులలాటాంతా సువక్త్రా సుప్రతిష్ఠితా॥

త్వష్ట్రాయదగ్ని జిహ్వాంతు లక్షణం పరిభాషితం ।
తత్సర్వమేకతః సంస్థం కన్యాయాం సంప్రదృశ్యతే ॥

*(శ్లో॥19-20,అధ్యా-89)*

నల్లకలువ రేకులాంటి శరీరకాంతి, నల్లగా నొక్కులతో వున్న అందమైన కేశాలు, అందమైన ముక్కు, చక్కటి నుదురు సుందరమైన ముఖంతో ఆ దేవి ప్రకాశిస్తోంది. త్వష్టప్రజాపతి అగ్నిదేవుడి జిహ్వాకి ఏ లక్షణాలైతే నిర్దేశించాడో ఈ దేవి కూడా అదే లక్షణాలతో వెలిగిపోతోంది.

దివ్యమైన ఆ సుందరిని చూసి త్రిమూర్తులు ముగ్గురూ ఆశ్చర్యపోయి దేవీ! నీవెవరు? ఎందుకొచ్చావు? అని ప్రశ్నించారు. నలుపు, తెలుపు, ఎరుపు

వర్ణాలతో భాసిస్తున్న ఆ దేవి "ఉత్తములైన త్రిమూర్తులారా! నేను శక్తిని. మీ ముగ్గురి దృష్టినుంచి ఆవిర్భవించాను. నన్ను గుర్తించలేదా! మీ అందరి శక్తినుంచి పుట్టిన పరమేశ్వరిని నేనే" అని మృదువుగా పలికింది. ఆమె మాటలు విని దేవతలంతా ఎంతో సంతోషించి దేవికి ఎన్నో వరాల్ని అనుగ్రహించారు.

## త్రిశక్తి ఆవిర్భావం

సకల కళాస్వరూపిణిగా భాసిస్తున్న ఆ దివ్యశక్తిరూపిణి తెల్లగా ప్రకాశిస్తోంది. సర్వాక్షరాలూ ఆ దేవి స్వరూపాలే. అందుకే ఆమెని వాగీశ్వరి అంటారు. కొంతమంది సరస్వతి అంటారు. సకల విద్యలకీ ఆమే అధి దేవత. అందుకే పండితులు ఆ దేవిని విభావరి!విశాలాక్షీ! వరాననా! అని పిలుస్తారు.

బ్రహ్మాది దేవతలంతా ఆ దేవి దగ్గరకొచ్చి "దేవీ! నీవు ముగ్గురు మూర్తుల శక్తితో ఆవిర్భవించావు. కాబట్టి నీపేరు త్రికళ అని పెడుతున్నాం. నీవు ముల్లోకాల్నీ కాపాడుతూవుండు అని కోరారు. దేవీ! నీకు ఇంకా ఎన్నో పేర్లు రాబోయేకాలంలో వస్తాయి. ఎంతో మంది నిన్ను ఎన్నో రకాలుగా కొలుస్తారు. పిలుస్తారు. నీవు మూడు రంగులతో భాసిస్తున్నావు. కనుక నీ శరీరాన్ని మూడు మూర్తులుగా మార్చుకో అన్నారు. వెంటనే దేవి నలుపు,ఎరుపు తెలుపు వర్ణాలతో కూడిన మూడు శరీరాల్ని ధరించింది.

యాసాబ్రాహ్మీ శుభమూర్తిస్తయా సృజతి వైప్రజాః ।
సౌమ్యరూపేణ సుశ్రోణీ బ్రహ్మసృష్ట్యావిధానతః ॥

యాసారక్తవర్ణేన సురూపాతనుమధ్యమా ।
శంఖచక్రధరాదేవీ వైష్ణవీ సా కళాస్మృతా ॥

సాపాతి సకలం విశ్వం విష్ణుమాయేతి కీర్త్యతే ।
యాసాకృష్ణేన వర్ణేన రౌద్రమూర్తి శూలినీ ।
దంష్ట్రా కరాళినీ దేవీ సాసంహరతి వైజగత్ ॥

*(శ్లో॥27-29, అధ్యా-89)*

ఆ దేవి సౌమ్యరూపిణిగా బ్రహ్మ సంబంధమైన శుభమూర్తిని ధరించి బ్రహ్మచేసిన విధంగా ప్రజల్ని సృష్టిస్తుంది. ఎర్రటి వర్ణంతో ప్రకాశించే శరీరంతో భాసిస్తూ, శంఖచక్రాలు ధరించి, విష్ణుకళగా రూపొందిన దేవి, విష్ణువులాగే సకల విశ్వాన్నీ రక్షిస్తుంది. నల్లని వర్ణంతో ప్రకాశిస్తూ త్రిశూలాన్ని ధరించి భయంకరమైన కోరలతో రుద్రుడిలాగా జగత్తునంతా ఆ దేవి సంహరిస్తుంది.

ఆ విధంగా త్రిశక్తి రూపిణిగా ఆవిర్భవించిన దేవిలోని బ్రాహ్మీశక్తి బ్రహ్మ దగ్గర వీడ్కోలు తీసుకుని విశ్వరూపాన్ని పొందటం కోసం శ్వేత పర్వతం మీదకి వెళ్ళింది. అలాగే వైష్ణవశక్తిగా మారిన దేవి విష్ణువు దగ్గర వీడ్కోలు తీసుకుని సుందరాద్రికి వెళ్ళగా, రౌద్రీశక్తిగా ఆకారాన్ని ధరించిన దేవి శంకరుడికి వీడ్కోలు పలికి తపస్సు చేసుకోవటానికి కృష్ణనీలపర్వతానికి వెళ్ళిపోయింది.

## బ్రహ్మచేసిన పరాశక్తి స్తుతి

బ్రహ్మవల్ల ఆవిర్భవించింది బ్రాహ్మీ శక్తి. విష్ణు వల్ల ఆవిర్భవించింది వైష్ణవీ శక్తి. అలాగే రుద్రుడి నుంచి ఆవిర్భవించింది రౌద్రీ శక్తి. ఈ ముగ్గురు శక్తులూ కలిసిన స్వరూపమే పరాశక్తి. ముగ్గురుగా కనిపిస్తున్న వీరంతా ఒక్కటే. సకల జగత్తునీ ఈ మూడు శక్తులూ సృష్టిస్తూ, పాలిస్తూ లయం చేస్తున్నాయి. ముల్లోకాల్లో ఈ దివ్య శక్తులు మూడూ వ్యాపించాయి. పరమకారుణ్య మూర్తులైన ఆ త్రిశక్తి స్వరూపాల్ని పరాశక్తిగా భావించి బ్రహ్మదేవుడు ఇలా వారిని స్తుతించాడు.

## త్రిశక్తి స్తుతి

జయస్వ సత్యసంభూతే ధ్రువే దేవి వరాక్షరే
సర్వగే సర్వజనని సర్వభూతమహేశ్వరి ॥ 1

సర్వజ్ఞే త్వం వరారోహే సర్వసిద్ధి ప్రదాయిని
సిద్ధి బుద్ధి కరీ దేవి ప్రసూతిః పరమేశ్వరి ॥ 2

త్వం స్వాహా త్వం స్వధా దేవి త్వముత్పత్తిర్వరాననే
త్వమోంకారస్థితా దేవి వేదోత్పత్తి స్త్వమేవ చ ॥ 3

దేవానాం దానవానాం చ యక్షగంధర్వ రక్షసామ్,
పశూనాం వీరుధాం చాపి త్వముత్పత్తి ర్వరాననే ॥ 4

విద్యా విద్యేశ్వరీ సిద్ధా ప్రసిద్ధా త్వం సురేశ్వరి,
సర్వజ్ఞా త్వం వరారోహే సర్వసిద్ధి ప్రదాయినీ ॥ 5

సర్వగా గత సందేహా సర్వ శత్రునిబర్హిణీ
సర్వ విద్యేశ్వరీ దేవీ నమస్తే స్వస్తి కారిణి
ఋతుస్నాతాం స్త్రియం గచ్ఛేద్ యస్త్వాం స్తుత్వా వరాననే ॥ 6

తస్యావశ్యం భవేత్ సృష్టి స్త్వత్ప్రసాదాత్ ప్రజేశ్వరి
స్వరూపా విజయా భద్రా సర్వశత్రు ప్రమోహిని 7

*(శ్లో॥9-15,అధ్యా-90)*

దేవీ! నీ దివ్యమంగళ రూపాన్ని గుణగణాల్ని స్తుతించి ఋతుస్నాత అయిన భార్యని పొందిన వాడికి సత్సంతానం లభిస్తుంది. నీవు వజ్రేశ్వరివి. సాక్షాత్తు పరమాత్మ స్వరూపానివి. విజయ, భద్రస్వరూపిణివి. అంతః బహిః శత్రువులందర్నీ రూపుమాపే దానివి. నీకు శతకోటి నమస్కారాలు తల్లీ.

## మహిషాసురవధ - దేవీస్తుతి

పూర్వం మహిషాసురుడనే రాక్షసుడు లోకకంటకుడిగా మారి దేవతల్ని. ఋషుల్ని, సిద్ధుల్ని, మానవుల్ని చిత్ర హింసలకు గురిచేస్తున్నాడు. దేవతలందర్నీ తరిమేసి స్వర్గాన్ని ఆక్రమించుకున్నాడు. అతడికి సహాయకులుగా భీముడు ధ్వంక్షుడు, ధ్వస్తకర్ణుడు, శంకుకర్ణుడు, వజ్రకాయుడు, విద్యున్మాలి, రక్తాక్షుడు, భీమదంష్ట్రుడు, విద్యుజ్జిహ్వుడు, అతికాయుడు, మహాకాయుడు, దీర్ఘబాహువు, కృతాంతుడు అనే పన్నెండు మంది మహావీరులున్నారు. అదే కాలంలో వైష్ణవీ శక్తిగా రూపొందిన దేవి హిమాలయాల్లో సుందరమైన నగరాన్ని నిర్మించుకుని దాసదాసీ జనంతో సేవలందుకుంటూ దివ్యమందిరంలో నివసిస్తోంది.

ఒకనాడు నారదుడు వైష్ణవీదేవి దివ్యమందిరానికి విచ్చేసాడు. అక్కడి వైభవాన్ని, దేవి సౌందర్యాన్ని చూసి ఎంతో ఆశ్చర్యపోయాడు. వెంటనే అక్కణ్ణుంచి

సరాసరి మహిషాసురుడి కొలువుకి వెళ్ళి వైష్ణవీదేవి అందచందాల గురించి ఆమె ఐశ్వర్యాన్ని గురించి వర్ణించాడు. నారదుడి మాటలు విన్న దగ్గర్నుంచీ మహిషాసురుడికి నిద్రపట్టటంలేదు. ఎలాగైనా ఆ జగదేక సుందరిని చేపట్టాలని భావించాడు. విద్యుత్ప్రభుడనే దూతని పిలిచి దేవి దగ్గరకి రాయబారం పంపించాడు. విద్యుత్ప్రభుడు దేవి దగ్గరకొచ్చి మహిషాసురుడి గురించి ఎంతో గొప్పగా వర్ణించాడు. ఆయన దేవిని వివాహం చేసుకోవాలనుకుంటున్నాడని ఆయన్ని చేపడితే ముల్లోకాలకీ రాణివి కావచ్చనీ తెలిపాడు.

మహిషుడి దూతమాటలు విన్న దేవి అతడి అభ్యర్ధనని తిరస్కరించింది. ఓరీ దూతా! నీ ప్రభువుకి నేను కాదు కదా ఇక్కడున్న ఏ కన్యా లభించదు. ఇక నీ వెళ్ళు అని గద్దించింది. దేవి మాటలు విని భయపడ్డ దూత వెంటనే అక్కణ్ణుంచి వెళ్ళి పోయాడు.

అదే సమయంలో దేవర్షి నారదుడు అక్కడికి వచ్చాడు. దేవికి నమస్కరించి అమ్మా! లోకపావనీ ఆ మహిషాసురుడు అందర్నీ పీడిస్తున్నాడమ్మా. వాడికి స్త్రీ చేతిలో తప్ప మరెవ్వరి చేతిలో చావులేదు. నీవు తప్ప వాణ్ణి ఎవరూ సంహరించలేరు. దేవతలంతా నీకు మొరపెట్టుకుంటున్నారు తల్లీ! ఎలాగైనా ఆ దుష్టుణ్ణి సంహరించి అందరికీ మేలు చేయి అని దేవతలు చేసిన విన్నపాన్ని ఆమెకి వినిపించి వెళ్ళిపోయాడు.

మహిషుడి దూత తిరిగి వచ్చి దేవి అన్న మాటల్ని మహిషుడికి చెప్పాడు. అది విన్న వెంటనే అతడికి ఆగ్రహం కట్టలు తెంచుకుంది. ఒక్క ఆడది అబల నామాటని తిరస్కరిస్తుందా! ఎలా నాదారికి రాదో చూస్తాను అని అనుకుని వెంటనే దేవిమీదకి యుద్ధానికి బయలుదేరాడు. అక్కడ దేవి కూడా మహిషాసుర సంహారం చేయటానికి నిశ్చయించుకుని తన సైన్యాన్నంతా సన్నద్ధం చేసింది.

మహిషుడి సైన్యం దేవీసైన్యం ఎదురుపడ్డారు. ఇద్దరిమధ్యా ఘోరమైన యుద్ధం ప్రారంభమైంది. యుద్ధంలో దేవశక్తులన్నీ కలిసి మహిషుడి పరివారాన్నంతా దారుణంగా వధించారు. అది చూసి మహిషుడు రెట్టించిన

క్రోధంతో స్వయంగా యుద్ధరంగంలోకి ప్రవేశించాడు. దేవీ సైన్యాన్ని చెల్లాచెదురు చేసాడు. ఆ విషయం తెలిసిన దేవి మహోగ్రరూపంతో ఇరవై చేతుల్లో విల్లు, కత్తి, బాణం, తోమరం, గధ, శంఖం, ఖడ్గం, డాలు, బాణం, భశుండి లాంటి ఆయుధాల్ని ధరించి మహిషుణ్ణి ఎదుర్కొంది.

దేవీ మహిషుల మధ్య యుద్ధం ప్రారంభమైంది. ఇద్దరూ రెచ్చిపోయి ఒకర్ని ఓడించాలని మరొకరు తీవ్రంగా యుద్ధంచేస్తున్నారు. మహిషుడు ఎన్నో మాయోపాయాలు ప్రయోగిస్తున్నాడు. అయితే దేవి వాటన్నిటినీ త్రిప్పి కొడుతోంది. ఇలా వారిద్దరూ పదివేల దివ్యసంవత్సరాలు యుద్ధం కొనసాగించారు. చివరికి దేవి తన దివ్యశూలాయుధంతో మహిషుణ్ణి దారుణంగా వధించింది. అతడి వధ శతశృంగ పర్వతం మీద జరిగింది. శూలంతో పొడిచిన దేవి తన ఖడ్గంతో మహిషుడి తలని నరికేసింది. ఆ విధంగా దేవి చేతిలో మరణించిన మహిషుడి శరీరం నుంచి ఒక జ్యోతి బైటికి వచ్చి స్వర్గానికి వెళ్ళిపోయింది. ఆ మనోహరదృశ్యాన్ని చూసి దేవతలంతా పట్టరాని సంతోషంతో జయజయ ధ్వానాలు చేసారు. అప్సరసలు ఆనంద నృత్యాలు చేయగా దేవతలంతా నింగి నుంచి పూలవాన కురిపించారు. ఆ తరువాత అందరూ కలిసి సంతోషంతో దేవిని ఇలా కీర్తించారు.

## దేవతాకృత దేవీస్తుతి

నమో దేవి మహాభాగే గంభీరే భీమదర్శనే,
జయస్థే స్థిత సిద్ధాన్తే త్రినేత్రే విశ్వతోముఖి 1

విద్యావిద్యే జయే యాజ్యే మహిషాసురమర్ధిని
సర్వగే సర్వదేవేశి విశ్వరూపిణి వైష్ణవి 2

వీతశోకే ధ్రువే దేవి పద్మపత్ర శుభేక్షణే
శుద్ధ సత్వ వ్రతస్థే చ చణ్డరూపే విభావరి 3

బుద్ధి సిద్ధి ప్రదే దేవి విద్యేఽవిద్యేఽమృతే శివే
శాంకరీ వైష్ణవీ బ్రాహ్మీ సర్వలోక నమస్కృతే 4

ఘంటాహస్తే త్రిశూలాస్త్రే మహామహిషమర్దిని,
ఉగ్రరూపే విరూపాక్షి మహామాయే ఽమృతస్రవే 5
సర్వసత్వహితే దేవి సర్వసత్వమయే ధ్రువే,
విద్యాపురాణ శిల్పానాం జననీ భూతధారిణీ
సర్వదేవ రహస్యానాం సర్వ శత్రువతాం శుభే 6
త్వమేవ శరణం దేవి విద్యేఽ విద్యే శ్రియేఽంబికే
విరూపాక్షి తథా క్షాన్తి క్షోభితాంతర్జలే ఽ విలే 7
నమోఽస్తుతే మహాదేవి నమోఽస్తు పరమేశ్వరి
నమస్తే సర్వదేవానాం భావనిత్యే ఽక్షయే ఽవ్యయే 8
శరణం త్వాం ప్రపద్యన్తే యే దేవి పరమేశ్వరి
న తేషాం జాయతే కిఞ్చి దశుభం రణసఙ్కటే 9
యశ్చ వ్యాఘ్రభయే ఘోరే చౌరరాజభయే తథా,
స్తవ మేనం సదా దేవి పఠిష్యతి యతాత్మవాన్
నిగడస్థోఽపి యో దేవి త్వాం స్మరిష్యతి మానవః
సోఽపి బంధై ర్విముక్త స్తే సుసుఖం వసతే సుఖీ 10

*(శ్లో॥53-63,అధ్యా-94)*

అమ్మా! పరమేశ్వరీ ఘోరమైన కష్టాలలో ఉన్నవాడు, ఆపదల్లో చిక్కుకున్నవాడు, చోరభయం, రాజభయం కలిగినవాడు నిశ్చలంగా, పవిత్రమైన మనసుతో ఈ నీ స్తోత్రాన్ని పఠిస్తే వాడు భవబంధాలనుంచి కష్టాలు ఆపదలనుంచీ విముక్తి పొందుతాడు తల్లీ! అని దేవతలందరూ ప్రార్థించగా దేవి ఎంతో సంతోషించి ఏం వరం కావాలో కోరుకోండి అని పలికింది. దేవతలు ఆమెతో తల్లీ! మాకు ప్రత్యేకంగా ఏ వరాలు వద్దమ్మా. మేము చేసిన ఈ దివ్యస్తోత్రాన్ని ఎవరు పఠిస్తారో వారికి నీ దివ్యానుగ్రహం కలిగేలా వారుకోరిన కోరికలు తీరేలా అనుగ్రహించు. ఇదే మాకు కావలసింది అని అన్నారు. దేవి తథాస్తు! అని పలికి అంతర్థానమైంది. ఇక దేవతలు కూడా ఆనందంగా తమ తమ స్థానాలకి తిరిగి వెళ్ళారు.

# శ్రీమన్నారాయణ రహస్య పూజావిధానం

భూదేవితో వరాహ అవతారాన్ని ధరించిన శ్రీమన్నారాయణుడు ఈ విధంగా అంటున్నాడు.

దేవీ! నీవు ఇంతకుముందు సంసారతారణం గురించి ఏంచేయాలి? అని ప్రశ్నించావు చెబుతున్నా విను. "నా పనుల మీద శ్రద్ధతో, నన్ను పూజించాలన్న ఆసక్తితో, ఎలాంటి చెడ్డ ఆహారాన్నీ స్వీకరించకుండా ఇంద్రియ నిగ్రహంతో ఉన్నవారే సంసారం నుంచి విడివడి నా దగ్గరకి చేరుకుంటారు.

సనాతనుడు అని ఎవరిని గురించి చెబుతారో ఆ సనాతునుణ్ణి సర్వమూ తెలిసిన వాణ్ణి నేనే. అలాగే క్రిందా, పైనా అన్ని దిక్కుల్లో వుండేదీ నేనే. కనుక నా భక్తుడైన వాడు నా పరమపదాన్ని చేరుకోవాలనుకుంటే అన్ని విధాలా అందర్నీ గౌరవించాలి. పూజాది కార్యక్రమాలతో నాకు నమస్కరించాలి. దేవీ! నా మార్గాన్ని అనుసరించే భక్తులు నన్ను ఎలా నమస్కరించి పూజించాలో అది కూడా చెబుతున్నా విను.

మొదట నన్ను శ్రద్ధగా షోడశోపచారాలతో అర్చించి లేదా అర్చించినట్టు భావించి పరిశుద్ధమైన మనసుతో, దోసిలితో నీటిని తీసుకుని–

శ్లో॥ యజామహే ధర్మపరాయణోద్భవం నారాయణం ప్రసీదేశాన ।
సర్వలోక ప్రధానం పురాణం కృపా సంసారమోక్షణం ॥ 1

**భావం :** ధర్మం అనే పరమగతికి కారణమైనవాడు, సకల లోకాలకీ ప్రధానుడు, పురాతన మైనవాడు, ఎంతో దయతో భక్తుల సంసారాన్ని పటాపంచలు చేసేవాడు అయిన నారాయణుణ్ణి పూజిస్తున్నాను. స్వామీ! నన్ను అనుగ్రహించు.

ఈ విధంగా పలికి ఆ దోసిలిలో నీటిని ఒక పళ్ళెంలో విడిచిపెట్టాలి. తిరిగి పడమరవైపు ముఖం ఉంచి ఓం నమోనారాయణాయ అని పలికి దోసిలితో నీటిని గ్రహించి ఈ శ్లోకాన్ని పఠించాలి.

శ్లో॥ యదాసు దేవః పథమాదికర్తా పురాణ కల్పంచ యథా విభూతిః ।
దివిస్థితా చాదిమనంతరూప మమోఘ మోఘం సంసారమోక్షణమ్॥ 2

**భావం :** ఆది దేవుడు, ప్రథమసృష్టికర్త, సనాతనుడు, సకలైశ్వర్య స్వరూపుడు, స్వర్గంలో నివసించేవాడు, అన్నిటికన్నా మొదటివాడు, అనంతమైన రూపాలు కలిగినవాడు, ఎక్కడా ఎదురన్నదే లేనివాడు. సంసార బంధాలనుంచి విముక్తి ప్రసాదించేవాడు అయిన నారాయణుడికి నమస్కారం.

ఈ విధంగా చెప్పి దోసిటిలో నీటిని పళ్ళెంలో వదిలిపెట్టాలి. తిరిగి ఓం నమోనారాయణాయ అని పఠించి దోసిలితో నీళ్ళు తీసుకుని ఉత్తరంవైపు ముఖాన్ని ఉంచి ఈ శ్లోకాన్ని పఠించాలి.

శ్లో॥ యజామహే దివ్యపరం పురాణ మనాది మధ్యాంత ।
మనంత రూపం భవోద్భవం సంసారమోక్షణమ్ ॥ 3

**భావం :** దివ్యమైనవాడు, పరుడు, పురాణుడు, ఆదిమధ్యాంతరహితుడు, అనంతమైన రూపాలు కలిగినవాడు, సంసారబంధాలనుంచి రక్షించేవాడు అయిన శ్రీమన్నారాయణుణ్ణి అర్చిస్తున్నాను.

ఈ విధంగా పలికి దోసిట్లోని నీటిని పళ్ళెంలో వదలాలి. తరువాత మళ్ళీ దోసిలితో నీళ్ళని తీసుకుని ఓం నమోనారాయణాయ అని పఠించి, దక్షిణ దిశగా ముఖాన్నుంచి ఈ శ్లోకాన్ని చదవాలి.

శ్లో॥ యజామహే యజ్ఞమహో రూపజ్ఞం కాలం చ కాలాదిక ।
మప్రమేయమ్ అనన్యరూపం సంసారమోక్షణమ్ ॥ 4

**భావం :** యజ్ఞ స్వరూపుడు అన్నిరూపాలు తెలిసినవాడు, కాలస్వరూపుడు, కాలానికి ఆదిగా ఉన్నవాడు, సంసార భయాన్ని రూపుమాపేవాడు అయిన నారాయణుణ్ణి పూజిస్తున్నాను.

ఈ విధంగా చెప్పి దోసిలిలో ఉన్న నీళ్ళని పళ్ళెంలో విడవాలి. ఆ తరువాత సమిధల్ని చేతిలో పట్టుకుని ఇంద్రియనిగ్రహంతో నారాయణుడి మీద స్థిరంగా మనసు నిలిపి –

శ్లో॥ యజామహే సోమపథేన భానే త్రిసప్తలోక నాథమ్ ।
జగత్ప్రదానం మృత్యురూపం సంసార మోక్షణమ్ ॥ 5

పద్నాలుగు లోకాలకీ నాయకుడు, సోమ(యజ్ఞ) మార్గంలో నిలిచి ఉండేవాడు, జగత్తుకి ప్రధానమైనవాడు, మృత్యుస్వరూపుడు, సంసార బంధాల నుంచి మోక్షణం కల్పించేవాడు అయిన శ్రీమన్నారాయణుడిని యజిస్తున్నాను (యాగం చేస్తున్నాను).

ఈ విధంగా పలికి దేవదేవుడైన శ్రీమన్నారాయణుణ్ణి మూడు సంధ్యల్లో అర్చించాలి. ఇది యోగాలలో పరమయోగం. ఎంతో రహస్యమైన విష్ణుపూజా విధానం. అందరూ ఆచరించతగ్గది. సరళమైనది. జ్ఞాన మార్గాల్లో సాఖ్యంలాంటిది. కర్మల్లో ఉత్తమ కర్మగా ప్రసిద్ధిచెందింది.

పరమ పవిత్రమైన ఈ విష్ణుపూజాయోగాన్ని భక్తుడు కానివాడికి, పిసినారికి, మొండివాడికి చెప్పకూడదు. ఉత్తమ శిష్యుడైన వాడికి మాత్రమే దీన్ని భోదించాలి. శ్రీమహావిష్ణువు స్వయంగా ఉపదేశించిన ఈ రహస్య పూజావిధానాన్ని బుద్ధిశాలి అయినవాడు అంత్యకాలంలో కూడా మరువకూడదు.

యఏతత్ పఠతేనిత్యం కల్యోత్థాయ దృఢవ్రతః ।
మమాపి హృదయే నిత్యం స్థితః సత్త్వగుణాన్వితః ॥
యఏతేన విధానేన త్రిసంధ్యం కర్మకారయేత్ ।
తిర్యగ్యోన్యాఽ పి సంప్రాప్యమమలోకాయ గచ్ఛతి ॥

*(శ్లో॥21-22,అధ్యా-125)*

ప్రతిరోజూ ప్రాతఃకాలంలో నిద్రలేచి నిశ్చలమైన దీక్షతో ఈ స్తోత్రాన్ని (పూజారూప స్తోత్రాన్ని) పఠించినవాడు సత్త్వగుణంతో కూడుకుని నా హృదయంలో శాశ్వత స్థానాన్ని పొందుతాడు. ఈ విధానంతో ప్రతిరోజూ మూడు సంధ్యల్లో విష్ణుపూజచేసిన వాడు పశుపక్ష్యాదులకి జన్మించినప్పటికీ అతడు నా లోకాన్నే చేరుకుంటాడు. ఈ విధంగా వరాహమూర్తి భూదేవికి తన రహస్యపూజావిధానాన్ని సవివరంగా తెలియచేసాడు.

## బదరికాశ్రమ మాహాత్మ్యం

పవిత్రమైన హిమాలయపర్వతాల మీద దేవతలకి కూడా దుర్లభమైన ఒక దివ్య ప్రదేశం ఉంది. అదే బదరికాశ్రమం. ఆ క్షేత్రం సంసారబాధల నుంచి

ఉపశమనం కలిగించే శక్తి కలిగింది. శ్రీమన్నారాయణుడి మీద అచంచలమైన భక్తి శ్రద్ధలున్నవారు మాత్రమే ఆ బదరికాశ్రమానికి చేరుకోగలరు. అక్కడికి వెళితేనే చాలు మానవుల మనోరథాలన్నీ తీరిపోతాయి. అక్కడున్న ఎత్తైన శిఖరాల మధ్యలో బ్రహ్మకుండం అనే ప్రసిద్ధ సరోవరం ఉన్నది. ఆ ప్రాంతంలోనే శ్రీమన్నారాయణుడు స్థిరంగా కొలువైవున్నాడు. ఆ బ్రహ్మకుండం సమీపంలో ఎవరైతే మూడు రాత్రులు ఉపవాసం ఉండి ఆ కుండంలో స్నానం చేస్తాడో అతడికి అగ్నిష్టోమ యాగం చేసినఫలితం లభిస్తుంది.

బదరికాశ్రమంలో అగ్ని సత్యపదం అనే మరో దివ్యస్థలం ఉంది. అక్కడ హిమాలయాలనుంచి మూడు ధారలు క్రిందకి పడుతుంటాయి. (జలపాతాలు) నన్నే స్మరిస్తూ ఆ దివ్యజలధారల క్రింద మూడురోజులు వరుసగా స్నానంచేసిన వాడు సత్యవాది, సకలకార్య కుశలుడు అవుతాడు. అక్కడి జలాన్ని తాకినా చాలు, ఆ జీవుడు మరణానంతరం విష్ణులోకాన్ని చేరుకుంటాడు.

ఇంద్రలోకం అనే పేరుతో నారాయణుడికి సంబంధించిన మరో ప్రసిద్ధ ఆశ్రమం అక్కడ నెలకొంది. ఆ ఇంద్రలోకాశ్రమంలో దేవాధిపతి ఇంద్రుడు నారాయణుణ్ణి శ్రద్ధగా సేవిస్తూ ఉంటాడు. ఆ ఆశ్రమం సమీపంలో ఎత్తైన హిమశిఖరాలనుంచి నిరంతరం ధారలుగా జలపాతాలు ప్రవహిస్తూ ఉంటాయి. ఆ పర్వతం మీద ప్రతిశిలపైనా విష్ణు ధర్మం స్థాపితమై ఉంటుంది. మానవుడు ఒక్కరాత్రి అక్కడ నివసించి స్నానం చేస్తే పరమపవిత్రుడవుతాడు. బదరికాశ్రమంలోనే 'పంచశిఖ'అని మరో దివ్యతీర్థం ఉంది. అక్కడ ఐదు ధారలుగా శిఖరాల నుంచి జలపాతాలు పడుతుంటాయి. ఆ అయిదు ధారలూ అయిదు నదులుగా మారి ప్రవహిస్తాయి. ఆ నదుల్లో లేక ధారల్లో స్నానంచేసిన వాడు అశ్వమేధయాగం చేసిన ఫలం పొందుతాడు.

బదరికాశ్రమంలో 'చతశ్రోత' అనే దివ్యస్థలం ఉంది అక్కడ నాలుగు వైపులనుంచీ నాలుగు ధారలు పడుతుంటాయి. అక్కడ స్నానంచేసి ఒక రాత్రి నివసించినవాడు స్వర్గాన్ని చేరుకుంటాడు.

అలాగే 'వేదధారా' అనే మరో తీర్థం ఉంది. ఆ తీర్థం సమీపంలోనే బ్రహ్మదేవుడి నాలుగుముఖాలనుంచీ నాలుగు వేదాలు వెలువడ్డాయి. ఆ క్షేత్రంలో నాలుగు ఎత్తైన ధారలు పడుతుంటాయి. ఇక్కడ నాలుగు రాత్రులు నివసించి ఆ నాలుగు ధారల్లో స్నానం చేస్తే నాలుగు వేదాలు అధ్యయనం చేసిన ఫలం పొందుతారు. దానికి సమీపంలోనే 'ద్వాదశ దివ్యకుండం' అనే పేరుతో మరో స్థలం ఉంది. ఆ కుండం దగ్గరే శ్రీమన్నారాయణుడు ద్వాదశ (12) ఆదిత్యుల్ని స్థాపించాడు. ఎవడైతే ద్వాదశి తిథినాడు ఆ కుండంలో స్నానం చేస్తాడో వాడికి ద్వాదశ సూర్యుల అనుగ్రహం లభిస్తుంది.

'సోమాభిషేకం' అనే పేరుతో ఒకదివ్య తీర్థం ఆ బదరికాశ్రమంలో వుంది. పూర్వం అత్రి కుమారుడైన సోముడు శ్రీమన్నారాయణుణ్ణి ఈ ప్రాంతంలోనే అభిషేకించాడు. అందుకే ఈ తీర్థానికి సోమాభిషేక తీర్థం అనే పేరు వచ్చింది. చంద్రుడు ఇక్కడే 14 కోట్ల సంవత్సరాలు తపస్సు చేయగా ఆయనకి నారాయణుడి దివ్యానుగ్రహం లభించింది. సోమాభిషేకానికి సమీపంలో 'సోమగరి' అనే మరో ప్రాంతంలో నీటికుండం ఉంది అక్కడ పైనుంచి నీరు ధారాపాతంగా పడుతుంది. ఆ ధారలక్రిందగానీ, కుండంలోకానీ స్నానం చేసినవాడు సోమలోకాన్ని చేరే అర్హత పొందుతాడు,

బదరీ క్షేత్రంలో సుప్రసిద్ధమైనది 'ఊర్వశీకుండం'. అది ఎంతో రహస్యమైనది. అక్కడే నారాయణుడి ఊరువు నుంచి ఊర్వశి ఆవిర్భవించింది. ఆ కుండం సమీపంలో నారాయణుడు ఎంతోకాలం ఎవరికీ తెలియకుండా తపస్సుచేసాడు. నూట పదికోట్ల పద్మ వర్షాల పాటు నారాయణుడు గుప్తంగా అక్కడ తపస్సు కొనసాగించాడు. ఇంద్రాది దేవతలు కూడా ఆయన జాడని కనిపెట్టలేకపోయారు. విష్ణువు కనపడక లోకాలన్నీ అల్లకల్లోలమయ్యాయి. ఆయన మాయని ప్రయోగించటం వల్ల ఎవ్వరూ విష్ణువుని తెలుసుకోలేకయున్నారు. అందరూ కలిసి ఏం చేయాలో దిక్కుతోచక సామూహింగా నారాయుణుణ్ణి దీనంగా స్తుతించటం ప్రారంభించారు.

దేవాదిదేవా! పరంధామా! పురుషోత్తమా నీవు కనుపించక మేమంతా ఉత్సాహాన్ని కోల్పోయాం ఏపనీ మేము చేయలేకపోతున్నాం. దయచేసి మా మీద అనుగ్రహం చూపించు. నీవెక్కడున్నావో తెలియచేయి అని పరిపరివిధాలుగా ప్రార్థించగా తపస్సులో ఉన్న నారాయణుడు కళ్ళుతెరిచి వారికి కనిపించాడు. నారాయణుడి దర్శనం కావటంతో దేవతలంతా ఎంతో సంతోషించారు. ఇది ఊర్వశీకుండం గొప్పతనం. ఎవడైతే ఈ కుండంలో స్నానంచేసి ఒక రాత్రి అక్కడ నివసిస్తాడో వాడు సకల పాపాలనుంచీ విముక్తి పొందుతాడు. మరణానంతరం ఊర్వశీలోకాన్ని చేరుకుంటాడు.

పరమపావనమైన ఈ బదరికాశ్రమ వృత్తాంతాన్ని, మహాత్మ్యాన్ని ఎక్కడ స్మరించినా అక్కడ విష్ణువు ఉన్న భావన కలుగుతుంది. ఎవరైతే ఈ మహాత్మ్యాన్ని పఠిస్తారో లేక ప్రవచిస్తారో వారు సత్యవాదిగా, క్రోధాన్ని జయించిన వారిగా, జితేంద్రియులుగా మారి విష్ణులోకాన్ని చేరుకుంటారు.

## రాజాన్నదోషం - ప్రాయశ్చిత్తం

భాగవతులైనవారు ఎవ్వరూ రాజుల్ని యాచించి వారుపెట్టిన అన్నం తినకూడదు. క్షత్రియుడైన వాడు నారయణుడి అంశతో ఉన్నప్పటికీ, రజస్సు, తమోగుణం కలిసి ఎన్నో దారుణమైన పనులు చేస్తుంటాడు. అందుకే అతడు పెట్టే అన్నం నిందనీయంగా చెప్పబడింది. ఒకవేళ రాజాన్నం స్వీకరించాల్సివస్తే రాజుద్వారా పొందిన అన్నాన్ని ముందుగా నారాయణుడికి నివేదించి ఆ తరువాత దాన్ని ప్రసాదంగా భావించి స్వీకరిస్తే దోషం అంటదు. ఇలా చేయక రాజాన్నం తిన్నవారు ప్రాయశ్చిత్తం ఆచరించాలి.

ఒక చాంద్రాయణ వ్రతం లేదా ఒక తప్తకృచ్ఛ్రవ్రతం, లేక సాంతపనవ్రతం ఆచరిస్తే ఆ దోషం పోతుంది. చాంద్రాయణ వ్రతం అనగా– చంద్రుడి క్షీణత్వాన్ని బట్టి కృష్ణ పక్షంలో ఒక్కో ముద్ద ఆహారాన్ని తగ్గిస్తూ శుక్లపక్షంలో ఒక్కోముద్దని పెంచుతూ అహారాన్ని స్వీకరించి చేసే వ్రతం. తప్తకృచ్ఛ్రవ్రతం అంటే–వేడినీళ్ళు, పాలు, నెయ్యి వరుసగా మూడు రోజులు ఆహారంగా తీసుకుంటూ ఉండటం.

వేడి గాలిని పీల్చటం అనేవి ఈ వ్రత నియమాలు. ఇక సాంతపనవ్రతం అంటే – మూడు రోజులు పళ్ళని మాత్రమే తినటం. మూడు రోజులు రాత్రిపూటే భుజించటం, తరువాత మూడు రోజులూ ఎవర్నీ ఏమీ యాచించకుండా ఏది లభిస్తే దాన్ని తినటం. ఆ తరువాత మూడు రోజులు కూడా ఉపవాసం ఉంటూ చేసే వ్రతం ఈ విధంగా రాజాన్నం తిన్నవాడు ప్రాయశ్చిత్తం చేసుకుంటే వాడికి ఎలాంటి దోషం అంటదు.

## పళ్లుతోమకుండా చేసే విష్ణుపూజ - ప్రాయశ్చిత్తం

ఉదయాన్నే పళ్ళుతోముకోకుండా విష్ణు ఆలయానికి వెళ్ళేవాడికి, విష్ణువుని పూజించేవాడికి, వాడు పూర్వజన్మలో చేసిన పుణ్యమంతా ఒక్కసారిగా నశిస్తుంది. మనిషి సహజంగా సకల దోషాలతో వుంటాడు. శరీరంలో వాత పిత్త కఫాలుంటాయి. ఉదయాన్నే అతడి ముఖం చెడ్డ వాసనతో ఉంటుంది. పళ్ళు తోముకున్నట్లైతే ఆ దోషం తొలగిపోతుంది. ఒకవేళ ఎవరైనా పళ్ళు తోమకుండా విష్ణుపూజ చేసినట్లైతే వారు ఏడురోజుల పాటు 'ఆకాశశయనం' (ఆరుబైట పడుకోవటం) చేస్తే పాపాలనుంచి విముక్తుడవుతాడు.

## రజస్వల అయిన స్త్రీని తాకితే - ప్రాయశ్చిత్తం

తెలిసికానీ, తెలియకకానీ రజస్వల అయిన స్త్రీని తాకి విష్ణువుని తాకేవాడు (ఏదైవాన్నైనా) ఆ సమయంలో మోహంతో కామవశుడైనవాడు ఒక వెయ్యి సంవత్సరాలపాటు రజస్సు త్రాగుతూ, కుంటి, గ్రుడ్డి, దరిద్రుడు, జ్ఞానహీనుడు, మూర్ఖుడు అవుతాడు. ఎవరైనా పొరపాటున ఈ దోషాన్ని చేసినట్టైతే, మూడు రాత్రులు ఆకాశశయనం (ఆరుబైట నిద్రపోవటం) చేయాలి. ఈవిధంగా ప్రాయశ్చిత్తం చేసుకున్నవాడికి దోషం అంటదు.

## శవాన్ని తాకటం - ప్రాయశ్చిత్తం

మరణించిన వ్యక్తిని తాకి ఆలయప్రాంగణంలోకి వచ్చి నిల్చుండేవాడు వందవేల సంవత్సరాలు గర్భంలో పడి దొర్లుతుంటాడు. పదివేల సంవత్సరాలు ఛండాలుడుగా పుడతాడు. ఏడువేల సంవత్సరాలు గ్రుడ్డివాడిగా జన్మిస్తాడు.

వంద సంవత్సరాలు కప్పగా, మూడు సంవత్సరాలు ఈగగా, పదకొండు సంవత్సరాలు లకుముకి పిట్టగా జన్మిస్తాడు. ఇలా ఎన్నో నీచమైన జన్మలు పొందుతాడు. ఒకవేళ ఎవరైనా తెలియక ఈ దోషాన్ని కలిగివుంటే పదిహేనురోజుల పాటు ఒంటిపూట భోజనం చేయాలి. ఇలా ఉన్న తరువాత పంచగవ్య ప్రాశన చేయాలి. ఆ విధంగా ప్రాయశ్చిత్తం ఆచరించిన వాడికి ఎలాంటి దోషం అంటదు.

## అపానవాయు దోషం - ప్రాయశ్చిత్తం

నారాయణుణ్ణి (ఏదేవుడైనా) పూజించేడప్పుడు అపాన వాయువు వదిలేవాడు వాయువుద్వారా పీడించబడతాడు. అయిదేళ్ళు ఈగగా, మూడేళ్ళు ఎలుకగా, తిరిగి మూడు సంవత్సరాలు కుక్కగా పుడతాడు. పొరపాటున ఎవరైనా ఈ దోషాన్ని చేసినట్లైతే వారు అలచందల పిండిని ఆహారంగా తీసుకుంటూ మూడురోజులు, కేవలం రాత్రిపూట మాత్రమే భోజనం చేస్తూ మూడు రోజులు గడపాలి. అలా ప్రాయశ్చిత్తం చేసుకున్నవాడికి దోషాలు అండవు.

## పనికిరాని పూలతో పూజిస్తే - ప్రాయశ్చిత్తం

ఎవరైనా తెలిసికానీ తెలియక కానీ పాడైపోయిన పనికిరాని పూలతో పూజచేయకూడదు. అలా చేసిన వారు రౌరవాది నరకాల్లో పడి తిరిగి నీచజన్మలు ఎత్తుతారు. పొరపాటున ఎవరైనా ఈ అపరాధాన్ని చేసినట్లైతే వారు ఒక నెలరోజుల పాటు ఒంటిపూట మాత్రమే భోజనంచేయాలి. పద్నాలుగురోజులు పాటు రోజూ వీరాసనం వేయాలి. ఒక నెలరోజులు తాము నిత్యం తినే ఆహారంలో నాలుగోవంతు మాత్రమే తింటూ నేతి పాయసం త్రాగాలి. ఆ తరువాత మూడు రోజులు యవల అన్నాన్ని మరోమూడు రోజులు పూర్తిగా ఉపవాసాన్ని ఆచరించాలి. అలా చేస్తేనే పై తెలిపిన దోషం తొలగిపోతుంది.

## చీకటిలో దైవస్పర్శ - ప్రాయశ్చిత్తం

కనీసం దీపం వెలుగు లేకుండా దేవతా మూర్తిని ఎవ్వరూ తాకకూడదు. అలాంటిపాపం చేసినవాడు ఎన్నో కష్టాలు పొందుతాడు. ఒక జన్మలో గ్రుడ్డివాడిగా

పుడతాడు. ఎవరైనా తెలియక ఈ దోషాన్ని చేస్తే ఇరవై రోజులు శ్రద్ధగా ఒంటిపూట భోజనం చేయాలి. ఏదో ఒకనెలలో ద్వాదశినాడు కేవలం నీళ్ళు త్రాగుతూ ఉపవాసం చేయాలి. తరువాత ఒకరోజు గోమూత్రంతో వండిన యవల్ని భుజించాలి. ఇదే ఈ దోషానికి ప్రాయశ్చిత్తం.

## నల్లని వస్త్రాలు ధరించినందుకు ప్రాయశ్చిత్తం

నల్లటివస్త్రాలు ధరించి విష్ణుపూజ ఎప్పుడూ చేయకూడదు. ఒకవైళ ఎవడైనా అలా చేస్తే చెట్లమీద పురుగుగా అయిదేళ్ళు, దోమగా మూడేళ్ళు, ఈగగా మూడేళ్ళు, చేపగా పదేళ్ళు, పిట్టగా పదిహేనేళ్ళు, ఇలా ఎన్నో నీచజన్మల్ని ఎత్తుతాడు. ఎవరైనా పొరపాటున ఈ పనిచేస్తే వారు ఏడురోజుల యవలపిండిని, మూడు రాత్రులు పేలాలపిండిని తింటూ ఉపవాస దీక్ష చేస్తే ఆ దోషం నుంచి విముక్తి లభిస్తుంది.

## కుక్క ఎంగిలి దోషం - ప్రాయశ్చిత్తం

ఎవరైనా తెలిసీ తెలియక కుక్క ఎంగిలి చేసిన పదార్థాన్ని దేవుడికి నివేదన చేస్తేవాడు ఏడు జన్మలు కుక్కగా, మరో ఏడుజన్మలు నక్కగా మరో ఏడు సంవత్సరాలు గుడ్లగూబగా పుడతాడు. ఈ దోషానికి ప్రాయశ్చిత్తంగా దుంపలు, పళ్ళు, కూరలు, పాలు, పెరుగు, పాయసం,గాలి వీటిని మాత్రమే మూడు రోజుల పాటు ఆహారంగా తింటూ ఆ తరువాత ఇరవై ఒక్క రోజులు ఒంటిపూట ఉపవాసాన్ని ఉండాలి. అలాచేస్తే ఈ దోషం నివారించబడుతుంది.

## మద్యపాన దోషం - ప్రాయశ్చిత్తం

ఎవడైనా మద్యాన్ని సేవించి దైవ దర్శనానికిగానీ, దైవాన్ని అర్చించటానికి గానీ వస్తే అది మహాదోషం. అలా చేసినవాడు పదివేల సంవత్సరాలు దరిద్రుడిగా జన్మిస్తాడు. ఈ పనిచేసినవాటకి ప్రాయశ్చిత్తం ఏమిటంటే పవిత్రమైన వస్తువులో నిప్పు రంగులో ఉండేలా ద్రవాన్ని తయారుచేసి దాన్ని పుచ్చుకోవాలి. అలాచేస్తే మద్యపాన దోషం నుంచి విముక్తి లభిస్తుంది.

# ద్వారకా మాహాత్మ్యం

ద్వాపరయుగంలో యాదవకుల శ్రేష్ఠుడుగా వాసుదేవుడైన శ్రీకృష్ణుడు అవతరించాడు. ఆయన చిన్నతనంలో మధురా బృందావనాల్లో గడిపాడు. తరువాత విశ్వకర్మ సముద్రంలో నిర్మించిన ద్వారకా పట్టణాన్ని తన నివాసంగా చేసుకున్నాడు.

ద్వారకానగరం ఎంతో సుందరంగా నిర్మంచబడింది. అక్కడ 'పంచసర' అనే పేరుతో ఒక దివ్య క్షేత్రం వుంది. ఆ క్షేత్రంలో ఆరురోజులు నివసించి అక్కడే స్నానం చేస్తే అలా చేసినవారు స్వర్గసుఖాల్ని పొందుతారు. ఎవరైనా ఆ పంచశర క్షేత్రంలో విధివశాత్తు ప్రాణాలు కోల్పోతే వారు సరాసరి వైకుంఠధామానికి చేరుకుంటారు.

ద్వారకానగరం పక్కనున్న సముద్రంలో మకరం (మొసలి) ఆకారంలో ఒక అందమైన ప్రాంతం ఉంది. అక్కడ చేపలు, మొసళ్ళు ఇంకా ఎన్నోరకాల జలచరాలు అటూ ఇటూ తిరిగుతూ కనిపిస్తాయి. అయితే అక్కడ స్నానం చేసేవారిని అవి ఎప్పుడూ బాధించవు. ఎవరైనా ఆ ప్రాంతంలో పిండప్రదానం చేసి పిండాల్ని నీళ్ళలో వదిలితే ఆ జలచరాలు వాటిని తీసుకువెళ్ళతాయి. అలాగే ఎవరైనా పాపాత్ములు పిండాల్ని వేస్తే వాటిని అవి కనీసం తాకవు. ధర్మాత్ములు వేసిన పిండాల్నే అవి స్వీకరిస్తాయి.

ద్వారకాక్షేత్రంలో 'పంచపిండకం' అనే పేరుతో ఒక రహస్యమైన స్థానం ఉంది. ఆ ప్రాంతంలో ఒక అగాధమైన జలం ఉంది. దాన్ని దాటటం ఎవరికీ సాధ్యంకాదు. అది మొత్తం ఒక క్రోసెడు దూరం విస్తరించి ఉంది. ఎవరైనా ఆ ప్రాంతంలో అయిదు రోజులు నివసించి అక్కడున్న విష్ణుభగవానుణ్ణి అభిషేకిస్తే నిస్సందేహంగా అతడు ఇంద్రలోకాన్ని చేరుకుంటాడు. ఆ ద్వారకలోనే 'హంసకుండ' అనే మరో తీర్థం వుంది. ఆ తీర్థంలోకి పక్కనే ఉన్న మణిపురం అనే పర్వతం మీదనుంచి జలధారపడుతుంది. ఆ తీర్థంలో స్నానం చేసి దాని తీరంలో ఆరురోజులు నివసిస్తే సకల పాపాలనుంచీ విముక్తి లభిస్తుంది.

ఇంకా ఆ ద్వారకలో 'కదంబం' అనే పేరుతో ఒక దివ్య స్థానం, చక్రతీర్థం అనే మరో దివ్య ప్రదేశం,అలాగే 'రైవతకం' అనే పుణ్యస్థలాలు ఎన్నో ఉన్నాయి. అవన్నీ విష్ణుభగవానుడు శ్రీకృష్ణుడుగా సంచరించిన దివ్యప్రదేశాలు – ద్వారకలో మరో సుప్రసిద్ధ ప్రాంతం 'విష్ణుసంకామం' అనేది. అక్కడే 'జర' అనే పేరు గల ఒక వేటగాడు శ్రీకృష్ణుణ్ణి తన బాణంతో కొట్టాడు. ఇలా ఎన్నో విశేషాలతో పుణ్య స్థలాలతో నిండిన ద్వారకా క్షేత్రం మొత్తం ముప్ఫైయోజనాలు దూరం విస్తరించింది. అక్కడికి వెళ్ళి శ్రీమహావిష్ణువుని దర్శిస్తే ద్వారకాధీశు డైన ఆ కృష్ణ పరమాత్మ ఆయురారోగ్య ఐశ్వర్యాల్ని ప్రసాదిస్తాడు.

## సంసారం నుంచి ముక్తి ప్రసాదించే ధర్మాలు

వర్షఋతువు పూర్తికాగానే ప్రసన్నమైన శరత్కాలం వస్తుంది. ఆ ఋతువులో ఆకాశం నిర్మలంగా, స్వచ్ఛంగా వుంటుంది. ఎక్కువ ఎండా ఎక్కువ చలిలేని ఆ శరదృతువులో వచ్చే కార్తీక మాస శుక్లపక్షద్వాదశి శ్రీమహావిష్ణువుకి ప్రీతికరమైనది. ఈ పవిత్రమైన ద్వాదశినాడు విష్ణువుని అర్చించేవాడు ఎంతో ధన్యుడు. వైకుంఠ ధామాన్ని చేరాలనుకునేవారు ఆరోజు ఇలా స్తుతించాలి.

బ్రహ్మణారుద్రేణచయః స్తూయమానో భగవాసృష్టిః ।
వందితో వందనీయః ప్రాప్తాద్వాదశీయంతే ॥
ప్రబుద్ధస్వజాగ్రతో లోక నాథ మేఘాగతాః ।
నిర్మలః పూర్ణచంద్రః శారణాది పుష్పాణి లోకనాథ ॥
తుభ్యమహం దదామీతి ధర్మహేతో స్తవప్రీతయే ।
ప్రబుద్ధం జాగ్రతం లోకనాథ త్వాం భ్రాజమానం యజ్ఞేన॥
యజంతే సత్రే సత్రిణో వేదైః పఠంతి భాగవతాః ।
శుద్ధాః ప్రబుద్ధా జాగ్రన్తో లోకనాథ ॥ *(శ్లో॥12-14,అధ్యా-122)*

బ్రహ్మరుద్రాది దేవతలు స్తుతించే ఆ పరబ్రహ్మఋషివందితుడు అందరిచేతా వందనీయుడు అటువంటి విష్ణు పరమాత్మకి సంబంధించింది ద్వాదశీతిథి. దేవా! లోకనాథా! మేలుకోవయ్యా! మేఘాలన్నీ వెళ్ళిపోయాయి.

చంద్రుడు నిర్మలంగా ఉన్నాడు. నీవు ధర్మానికి హేతువు లాంటివాడివి. అలాంటి నీకోసం శరత్కాలంనాడు లభించే పూలను సమర్పించుకుంటాను.

**శరదృతువు :** ఓ లోకనాథా! నీవు మేలుకో. మేలుకొని వున్న నిన్ను పుణ్యాత్ములు యజ్ఞాలతో యజిస్తున్నారు. భాగవతులు వేదమంత్రాలతో నిన్ను ప్రశంసిస్తున్నారు. పరిశుద్ధులైనవారు మేలుకొన్న నిన్ను ఎంతో జాగ్రత్తగా అర్చిస్తున్నారు. ఈ విధంగా ద్వాదశినాడు శ్రీమహావిష్ణువుని స్తుతించిన వారు పరమగతిని పొందుతారు. దీనినే శ్రీమహావిష్ణు శరత్కాల పూజ అంటారు. ఇది సంసార తాపాల్ని నశింపచేస్తుంది.

**శిశిరఋతువు :** శిశిర ఋతువులో విష్ణుభక్తులైనవారు రెండు చేతులూ జోడించి నాకు నమస్కరించి

శిశిరోభవాన్ భర్తలోకనాథ హిమందుస్తరం ।
దుష్ప్రవేశం కాలం సంసారాన్మాం తారయేమం ధర్త త్రిలోకనాథ ॥

*(శ్లో॥20,అధ్యా-122)*

ఓ లోకనాథా! శిశిర ఋతువు మంచుతో నిండి గడపటానికి చాలా దుష్కరంగా వుంది. దీన్ని భరించలేము. ఈ శిశిరంలాంటి సంసారం నుంచి నన్ను తరింపచేయి. నన్ను రక్షించు. ఈ విధంగా శిశిర ఋతువునాడు భక్తిగా విష్ణువుని పూజించినవాడు తరిస్తాడు.

**మార్గశిర వైశాఖాలు :** శ్రీ మహావిష్ణువుకి అత్యంత ప్రీతిపాత్రమైన మాసాలు మార్గశిర-వైశాఖాలు. పవిత్రమైన ఈ రెండు మాసాలలో గంధపత్రం పూలు లభిస్తాయి. వాటితో శ్రీహరిని అర్చిస్తే 9900 సంవత్సరాలు విష్ణులోకంలో స్థిరంగా జీవిస్తారు. ఈ రెండునెలల్లోనే కాదు కార్తీక-మార్గశిర వైశాఖాలు మూడునెలల్లో వచ్చే ద్వాదశితిథినాడు గంధపత్ర పుష్పాలతో శ్రీమహావిష్ణువుని అర్చించాలి. ఆ విధంగా మూడు నెలలు వరుసగా పూజిస్తే 12 సంవత్సరాలు శ్రీహరిని పూజించిన ఫలితం లభిస్తుంది.

అన్ని తిథులకన్నా ద్వాదశి ఎంతో గొప్పది. అది అన్ని యజ్ఞాల ఫలాల్నీ ప్రసాదిస్తుంది. అందుకే శ్రీహరికి ఈ తిథి అంటే ఎంతో ఇష్టం. ద్వాదశినాడు శ్రీహరికి ఏది సమర్పించినా అది కొన్నివేలమంది విప్రులకి దానం చేసిన ఫలితాన్నిస్తుంది.

ఇక కార్తీక వైశాఖ మాసాలు ఎందుకు గొప్పవంటే కార్తీకమాసంలో శ్రీమహావిష్ణువు మేలుకొన్నాడు కనుక. అలాగే వైశాఖమాసంలో భూదేవిని ఉద్ధరించాడు కనుక. అందుకే ఈ రెండు మాసాలు శ్రీహరికి ప్రీతికరమైనవి. ఈ కార్తీక వైశాఖాలలో త్రికరణ శుద్ధిగా –

ఇమం బహుతరం నిత్యం వైశాఖం చైవ కార్తీకం ।
గృహాణ గంధపుష్పాణి ధర్మమేవం ప్రవర్ధయ ।
నమోనారాయణేత్యుక్త్వా గంధపత్రం ప్రదాపయే ॥ *(శ్లో॥36,అధ్యా-122)*

భగవాన్! ఇది ఎంతో గొప్పదైన వైశాఖ కార్తీకమాసాలు వచ్చిన కాలం. నేను సమర్పించే గంధపుషాల్ని స్వీకరించి ధర్మాన్ని వృద్ధిచేయి అని చెప్పి ఓం నమోనారాయణాయ అని పలికి గంధపుష్పాల్ని శ్రీహరికి సమర్పించాలి. ఈవిధంగా శ్రద్ధతో గంధపుష్పాల్ని శ్రీహరికి సమర్పించినవాడు వెయ్యి దివ్యవర్షాలు చావు పుట్టుకలు లేకుండా పరమపదమైన వైకుంఠ దివ్యధామంలో నివసిస్తాడు.

## గర్భవాస దుఃఖాన్ని పోగొట్టే ధర్మాలు

శ్రీహరి వరాహరూపాన్ని ధరించి భూదేవితో గర్భవాస దుఃఖాన్ని పొంద కూడదనుకునే మానవులు ఎలాంటి ధర్మాలు ఆచరించాలో ఈ విధంగా చెప్పాడు.

1. గొప్ప గొప్ప పనులు చేసినప్పటికీ తన్ను తాను పొగుడుకోకుండా నిర్మలమైన మనసుతో ఎన్నో సత్కర్మల్ని ఆచరించేవాడు.
2. శ్రీహరికి ప్రీతికరంగా షోడశోపచారాది పూజలుచేసి ఎలాంటి అహంకారం, కోపం పొందనివాడు.
3. మనసుతో అందీర్న సమానంగా దర్శిస్తూ లాభనష్టాల నేవేవీ పట్టించుకోకుండా ఇంద్రియనిగ్రహం కలిగినవాడు.

4. ఏదిమంచి పని ఏదిచెడ్డ పని అన్న విచక్షణ తెలిసినవాడు. అన్ని ధర్మాలు ఆచరించటంలో నిష్ఠకలిగినవాడు.
5. చలి, వేడి, గాలి, ఆకలి దప్పికల్ని సహించగలిగేవాడు.
6. దరిద్రుడైనప్పటికీ పనులు చేయటంలో ఎలాంటి సోమరితనం లేనివాడు. ఎప్పుడూ సత్యాన్నే పలికేవాడు.
7. ఇతరులభార్య మీద ఎలాంటి వ్యామోహాన్నీ పొందనివాడు.
8. సత్య స్వరూపుడైన పరమాత్మ గురించే నిత్యం పలికేవాడు.
9. వివేకవంతుడు, విశేషమైన ప్రజ్ఞ కలిగినవాడు బ్రహ్మజ్ఞానుల్ని గౌరవించేవాడు.
10. నిత్యం ప్రియమైన మాటల్నే పలికేవాడు. బ్రాహ్మణుల సేవలో, శ్రీహరిసేవలో శ్రద్ధా సక్తులు కలిగినవాడు. ఇలాంటిగణాలున్న వాడెవడూ గర్భవాస దుఃఖాన్ని అనుభవించడు. ఈ ధర్మాల్ని ఆచరించే వాడు పునరావృత్తి రహితమైన విష్ణులోకాన్ని చేరుకుంటాడు.

**శ్రీహరిసేవకుల గుణాలు :** పరంధాముడైన శ్రీహరిని త్రికరణశుద్ధిగా సేవించే భక్తులు ఎన్నో ఉత్తమ గుణాల్ని కలిగి ఉంటారు. వారు ఎప్పుడూ ప్రాణుల్ని హింసించరు. సకల ప్రాణుల హితాన్నే కోరుతుంటారు. పరిశుద్ధమైన మనసుతో అందర్నీ సమానంగా చూస్తుంటారు. బంగారాన్ని మట్టి పెళ్ళలాగా భావిస్తుంటారు. వయసు చిన్నదైనప్పటికీ క్షమ దయవంటి సుగుణాలతో ప్రవర్తిస్తూ పుణ్యకార్యాలనే ఆచరిస్తుంటారు. ఎప్పుడూ మంచి పనులే చేస్తుంటారు. పగవారు తమకి కీడు తలపెట్టినా వారికి ఎలాంటి నష్టాల్ని కలుగనివ్వరు. చేయాల్సిన పనుల్ని ఎప్పుడూ మరిచిపోరు. అబద్ధాలాడరు. మోసాలు చేయరు. తన ఇల్లాల్ని సైతం కేవలం సంతానం కోసమే కలుస్తారు. ఇలాంటి ఉత్తమ గుణ సంపన్నులైన శ్రీహరి సేవకులు గర్భవాసదుఃఖాన్ని పొందరు.

ఇంద్రియాల్ని గెలిచినవారు, క్రోధంమీద అదుపుకలిగినవారు, లోభమోహాల్ని వదిలినవారు, ప్రతి రోజూ దేవతల్ని, అతిథుల్ని, పితృదేవతల్ని

సంతృప్తిపరిచేవారు, హింసలాంటి నీచకార్యాలు చేయనివారు, మద్యమాంసాలు ముట్టనివారు, నిత్యం గోవులకి నమస్కరించేవారు, బ్రాహ్మణ స్త్రీలని దుష్టబుద్ధితో చూడనివారు, విప్రులకి కపిల గోవుని దానం చేసేవారు, వృద్ధుల్ని ప్రేమతో సంరక్షించేవారు, తన సంతానాన్ని భేదబుద్ధితో చూడని కపిల గోవుల్ని భక్తితో తాకి నమస్కరించేవారు, కన్యల్ని చెడ్డ భావంతో చూడనివారు, నిప్పుని కాళ్ళతో తాకనివారు, కుమారుడితో వివాదం పడనివారు, నీళ్ళలో మలమూత్రాలు విసర్జించనివారు, గురువుమాటల్ని తిరస్కరించనివారు, గర్భవాసదుఃఖాన్ని పొందకుండా శాశ్వతమైన వైకుంఠ ధామాన్ని చేరుకుంటారు.

## మధురాతీర్థ మాహాత్మ్యం

జగన్నాథుడైన శ్రీకృష్ణ పరమాత్మకి మధురానగరం కన్నా ప్రియమైన లోకం ముల్లోకాలలో మరేదీలేదు. ఈ దివ్య నగరంలోనే శ్రీకృష్ణుడు అవతరించాడు. అందుకే ఆ నగరం పుష్కర, ప్రయాగ, కాశీ, ఉజ్జయినీ, నైమిశారణ్య క్షేత్రాలకన్నా గొప్పది. ఆ నగరంలో విధి పూర్వకంగా నివసించే మానవులు నిస్సందేహంగా ముక్తిని పొందుతారు. మాఘమాసంలో వచ్చే పర్వదినాల్లో ప్రయాగక్షేత్రంలో ఉంటే ఎలాంటి పుణ్యఫలం లభిస్తుందో అలాంటి పుణ్యఫలం మధురలో ఒక్కరోజు ఉంటేనే చాలు లభిస్తుంది. అదేవిధంగా వారణాసిలో ఒకవెయ్యి సంవత్సరాలు నివసిస్తే ఎలాంటి ఫలం లభిస్తుందో అంతే ఫలం మధురలో ఒక్క క్షణం నివసించినా లభిస్తుంది.

కార్తీకమాసంలో పుష్కరక్షేత్రంలో నివసిస్తే వచ్చే ఫలం, మధురలో నివసించేవారికి సహజంగానే లభిస్తుంది. ఎవరైనా మధురా మండలం అనే పేరుని ఉచ్చరించినా లేక మధుర అనే శబ్దాన్ని విన్నా చాలు. వారు అన్ని పాపాల నుంచీ ముక్తిని పొందుతారు. ఈ భూమండలం మీద ఎన్ని తీర్థాలు, సరోవరాలు ఉన్నాయో అవన్నీ మధురా నగరంలో అంతర్గతంగా వున్నాయి. ఎందుకంటే పరమాత్మ అయిన శ్రీకృష్ణుడు గుప్తరూపంలో అక్కడ శాశ్వత నివాసాన్ని ఏర్పాటుచేసుకున్నాడు గనుక భూలోకంలో ఉన్న తీర్థాలలో కుబ్జామ్రకం, సౌకరం, మధుర అనే ఈ మూడూ పరమ విశిష్ఠమైనవి.

ద్వాపరయుగంలో శ్రీకృష్ణ పరమాత్మ యయాతి వంశంలో అవతరించాడు. మథురలో అవతరించిన పరమాత్మ శ్రీకృష్ణ బలరామ, ప్రద్యుమ్న అనిరుద్ధులుగా మారి చతుర్వ్యూహాలతో వంద సంవత్సరాలు నివసించాడు. ఆయన అవతరించిన కాలంలోనే కంసుడులాంటి భయంకరులైన ముప్పై రెండు మంది దానవులు భూమిమీద అవతరించారు. వారందర్నీ కృష్ణ పరమాత్మ సంహరించాడు.

మధురానగరంలో సూర్యుడి పుత్రిక అయిన యమునానది ఎంతో అందంగా, మందంగా ప్రవహిస్తూ ఉంటుంది. మధురలో కృష్ణుడికి సంబంధించిన ఎన్నో తీర్థాలు గుప్తంగా ఉన్నాయి. ఆ తీర్థాల్లో స్నానం చేసిన నరులు పుణ్యలోకాల్ని చేరుకుంటారు. ఆ తీర్థాల సమీపంలో ప్రాణం వదిలినవాళ్ళు సరాసరి విష్ణులోకాన్నిచేరుకుంటారు.

మధురామండలంలో 'విశ్రాంతి అనే తీర్థం ఉంది. అది ముల్లోకాల్లో ప్రసిద్ధిచెందింది. అందులో స్నానం చేసే మానవుడు సకల పుణ్యాలనీ పొందుతాడు. అక్కడున్న విష్ణు ప్రతిమని దర్శించి రెండుసార్లు దానికి ప్రదక్షిణ చేస్తే శుభం జరుగుతుంది. అక్కడే 'కణకల్' అనే మరో గుహ్య స్థానం కూడా ఉన్నది. అక్కడ స్నానం చేస్తే చాలు స్వర్గలోకాన్ని చేరుకుంటారు. ఇంకా ఆ మధురలో 'విందుక' అనే తీర్థం కూడా ఉంది. అది ఎంతో మహిమాన్వితమైనది.

మధురలో ఉన్న అన్ని తీర్థాల్లోకీ ఎంతోవిశిష్టమైనది 'సూర్యతీర్థం'. అది సకల పాపాల్నీ పోగొడుతుంది. ఆ తీర్థం దగ్గరే పూర్వం విరోచనుడి కుమారుడైన బలిచక్రవర్తి సూర్యుణ్ణి ఉపాసించాడు. బలి తపస్సుకి సంతోషించిన సూర్య భగవానుడు ప్రత్యక్షమై "ఎందుకు తపస్సు చేస్తున్నావు" అని అడిగాడు. అప్పుడు బలి దేవేశ్వరా! నా నివాసం పాతాళలోకంలో ఉంది. ప్రస్తుతం నేను రాజ్య హీనుణ్ణి, ధనహీనుణ్ణి నన్ను నీవే కరుణించాలి. అందుకే ఈ తపస్సు చేస్తున్నాను అని విన్నవించాడు. బలి మాటలు విని మనసు కరిగిపోయిన సూర్యుడు వెంటనే తన కిరీటంలో ఉన్న దివ్యమణిని తీసి అతడికిచ్చాడు. ఆ మణిని తీసుకుని బలి ఆనందంగా పాతాళానికి వెళ్ళిపోయాడు. ఇదీ సూర్యతీర్థం మహిమ.

ఆదివారంనాడు, సూర్యగ్రహణాలు సంభవించినప్పుడు ఆ తీర్థంలో స్నానం చేస్తే రాజసూయయాగం చేసిన ఫలితం లభిస్తుంది. పూర్వం ధ్రువుడు కూడా ఇక్కడే తపస్సుచేసి ధ్రువలోకాన్ని పొందాడు. అతడి పేరుతో మధురలో ధ్రువతీర్థం ఏర్పడింది. ఈ తీర్థంలో స్నానం చేసినవారు సకల శుభాలు పొందుతారు. ఈ ధ్రువ తీర్థానికి సమీపంలోనే తీర్థరాజం అనే ఒక తీర్థం వుంది. దానికి పడమర భాగంలో కోటి తీర్థం నెలకొంది. పితృదేవతల అనుగ్రహం పొందాలనుకునేవారు కోటితీర్థంలో స్నానంచేసి పితృదేవతల్ని అర్చించాలి. ఆ తీర్థంలో పవిత్రంగా స్నానం చేసినవాడు బ్రహ్మలోకాన్ని చేరుకుంటాడు.

మధురా నగరంలోనే పితృదేవతల అనుగ్రహాన్ని సంపూర్ణంగా అందించే వాయుతీర్థం ఉన్నది. ఇక్కడ పిండప్రదానం చేసినవాడు పితృలోకాన్ని చేరుకుంటాడు. గయలో పిండప్రదానం చేస్తే ఎంత గొప్ప ఫలం లభిస్తుందో అదే ఫలితం మధురలో వున్న ఈ వాయు తీర్థంలో, జ్యేష్ఠ మాసంలో పిండప్రదానం చేస్తే లభిస్తుంది. ఇలా మధురా క్షేత్రంలో మొత్తం పన్నెండు దివ్య తీర్థాలున్నాయి. వీటిని ఒక్కసారి స్మరించినా చాలు. ఆ తీర్థాల్లో స్నానంచేసిన ఫలం లభిస్తుంది.

## బృందావనం ఇతర తీర్థాలు

మధురామండలంలో పరమపుణ్యప్రదమైన 'వత్సక్రీడనకం' అనే పవిత్ర తీర్థంవున్నది. అక్కడ ఎర్రటి రంగుతో ఎన్నో విశాలమైన శిలలున్నాయి. ఒక్కసారి ఆ తీర్థంలో స్నానం చేస్తే చాలు పుణ్యం ప్రాప్తించి వాయులోకాన్ని చేరుకుంటారు. ఆ ప్రదేశంలో విధివశాత్తు మరణించినవారు సరాసరి విష్ణులోకాన్ని చేరుకుంటారు. దానికి సమీపంలోనే భాండీరక వనం అనే దివ్య స్థలం వున్నది. ఆ వనంలో మద్ది, తాళ, శాల, తమాల, ఇంగుదీ, పీలుక, కిరీల అనే ఎంతో విలువైన వృక్షాలున్నాయి. అవన్నీ ఆ వనం శోభని ద్విగుణీకృతం చేస్తున్నాయి. భాండీరక వనంలో ఉన్న తీర్థంలో పవిత్రమైన మనస్సుతో స్నానం చేసినవాడు సకల పాపాలూ నశించి ఇంద్రలోకాన్ని చేరుకుంటాడు.

బృందావనం మధురామండలంలో వున్న పరమపవిత్రమైన దివ్యధామం. దేవతలకు దానవులకు సిద్ధులకూ పరమదుర్లభమైంది. ఈ బృందావన ధామంలో

గోవులతో, గోపాలురతో శ్రీకృష్ణుడు ఇక్కడే ఎన్నో లీలలు ప్రదర్శించాడు. ఈ దివ్య ధామంలో ఒక్కరాత్రి నిద్రించి అక్కడే వున్న కాళిందీ నదిలో స్నానం చేసినవారికి గంధర్వలోకప్రాప్తి కలిగి అప్సరసలతో సుఖించే యోగం ప్రాప్తిస్తుంది.

ఈ బృందావనంలోనే 'కేశి' అనే మరో తీర్థం ఉంది. అది గంగానది కన్నా పవిత్రమైనది. పూర్వం ఇక్కడే శ్రీమహావిష్ణుడు 'కేశి' అనే రాక్షసుణ్ణి సంహరించాడు. ఈ కేశీ తీర్థం కాశీకన్నా గొప్పది. ఈ తీర్థం దగ్గర పితృదేవతలకి పిండప్రదానం చేస్తే గయలో చేసినంత ఫలితం లభిస్తుంది. అంతేకాదు ఈ ప్రాంతంలో స్నానం దానం హోమం చేస్తే అగ్నిష్టోమ యజ్ఞం చేసినంత పుణ్యం ప్రాప్తిస్తుంది. ఇక్కడ ద్వాదశాదిత్య తీర్థం దగ్గరే యమునానది ప్రవహిస్తూ ఉంటుంది.

బృందావనంలో కాళీయుడు నివసించిన ప్రాంతానికి కాళీయ హ్రదం అనే పేరు వచ్చింది. అది ఒక మడుగు. ఇక్కడే కృష్ణుడు తన పదఘట్టవనాలతో కాళీయుడి దర్పాన్ని అణిచివేసాడు. దీనికి సమీపంలోనే హరిదేవక్షేత్రం ఉంది. ఈ క్షేత్రానికి ఉత్తర భాగాన, కాళీయ హ్రదానికి దక్షిణ భాగాన ఎవరు మరణిస్తారో వారికి పునర్జన్మ వుండదు.

యమునానది అవతలి ఒడ్డున 'యమలార్జకం' అనే మరో దివ్య తీర్థమున్నది. అక్కడే శ్రీకృష్ణుడు పెద్ద శకటాన్ని ధ్వంసం చేసాడు. (శకటాసురవధ) ఆ ప్రాంతంలో స్నానం, ఉపవాసం అధికమైన ఫలితాన్నిస్తుంది.

జ్యేష్ఠమాసం శుక్లపక్ష ద్వాదశి తిథినాడు ఆ తీర్థంలో స్నానంచేసి దానాలు, ధర్మాలు చేసినవాడు మహా పాతకుడైనప్పటికీ ఉత్తమగతుల్ని పొందుతాడు. ఇంద్రియనిగ్రహంతో యమునానదిలో స్నానంచేసి ఆలయంలో వున్న శ్రీకృష్ణుణ్ణి దర్శించినవాడు పరమపవిత్రుడవుతాడు. అదే తిథినాడు యమునానది ఒడ్డున పిండప్రదానం చేయటం వల్ల పితృదేవతలు సంతోషించి వరాలిస్తారు. బృందావనంలో ఉంటూ ఆ దివ్య క్షేత్రానికి ప్రదక్షిణ చేస్తూ, అక్కడే కొద్ది రోజులుండి, నిత్యం గోవిందుణ్ణి స్మరించేవారు అన్ని కోరికల్ని సాధిస్తారు.

మధురా మండలంలో ఉన్న పవిత్ర తీర్థాలు పరబ్రహ్మ దేవాదిదేవుడైన శ్రీకృష్ణ పరమాత్మ అవతరించిన మధురానగరం పరమపావన దివ్యక్షేత్రం అక్కడ ఎన్నో దివ్య తీర్థాలు, క్షేత్రాలు, వనాలు నెలకొన్నాయి. వాటిలో ముఖ్యమైనవి. 1.బహుళాతీర్థం2.భాండహ్రదం 3.సప్తసాముద్రకం 4.వీరస్థలం 5.కుశస్థలం 6.పుష్పస్థలం 7.గోపీశ్వరం 8.గోవింద తీర్థం. 9.వత్సపుత్రక తీర్థం10.ఫాల్గుణ తీర్థం 11.వృషభాంజక తీర్థం 12.తాళవనం 13.సంపీరకకుండం అనేవి ప్రధానంగా ఉన్నాయి.

కృష్ణావతార సమయంలో భగవానుడైన పరమాత్మ పుత్రసంతానం కోసం సూర్యుణ్ణి ఆరాధించాడు. సూర్యుడి అనుగ్రహంతో శ్రీకృష్ణుడికి జ్ఞానవంతుడు మహాసౌందర్యవంతుడు అయిన సాంబుడు అనే పుత్రుడు జన్మించాడు. ఈ దివ్య మండలంలోనే చేతిలో పద్మాన్ని ధరించిన సూర్యభగవానుడు కృష్ణుడికి దర్శనమిచ్చాడు. సూర్యుడు ఆయనకి దర్శనమిచ్చిన తిథి భాద్రపద కృష్ణపక్ష సప్తమి. ప్రతి సంవత్సరం ఆ తిథినాడు సూర్యభగవానుడు ఆ క్షేత్రంలో స్వయంగా విరాజిల్లుతాడు. సూర్యకుండం అంత మహిమాన్వితమైనది. సప్తమీ ఆదివారం సూర్యుడికి ప్రీతి పాత్రమైన తిథి. ఆ రోజు సూర్య కుండంలో స్నానం చేస్తే సూర్యానుగ్రహంతో సకల సంపదల్నీ పొందుతారు.

## మధురాతీర్థం - ప్రదక్షిణా విధి - మాహాత్మ్యం

అయోధ్యా మధురామాయా కాశీకాంచీ అవంతికా ।
పురీ ద్వారవతీం చైవ సప్తైతే మోక్షదాయికా ॥

అన్న శ్లోకం ప్రకారం మధురానగరం సప్తమోక్షపురాల్లో ఒకటిగా ఎంతో ప్రసిద్ధి చెందింది. ఈ దివ్య నగరం ఇరవై యోజనాలు విస్తరించివుంది. దీని ప్రాచీన నామం మధుపురి, మధుహోలి. మధురామండలం చుట్టూ నాలుగు మైళ్ళ పరిధిలో ఎన్నో దివ్యస్థలాలున్నాయి. ఈ మండలం మొత్తంలో ఎక్కడ స్నానం చేసినా ఏ ప్రాంతంలో మరణించినా వారికి మోక్షం తప్పక లభిస్తుంది.

వర్ష ఋతువులో మధురానగరం ఎంతో శోభాయమానంగా ఉంటుంది. సప్తద్వీపాలలో ఉన్న పుణ్యనదులు, తీర్థాలు అన్నీ మధురకి వచ్చి చేరతాయి.

మధురకు చేరి శ్రీకృష్ణుణ్ణి దర్శించిన వారికి సకల పాపాలూ హరిస్తాయి. మధురలో నివసించినవారందరికీ ముక్తి తథ్యం. ఏ మానవుడు మధురలో ప్రవేశించి కాళిందీ (యమున) నదిలో స్నానం చేసి నిరంతరం కృష్ణ నామస్మరణ చేస్తాడో అలాంటివాడు అశ్వమేథ, రాజసూయ యాగాలు చేసిన ఫలితం పొందుతాడు.

**మధురానగర ప్రదక్షిణ :** కార్తీకమాసం శుక్లపక్ష నవమినాడు గోవిందనామ స్మరణ చేస్తు మధురానగర ప్రదక్షిణ చేయటం ఉత్తమం. ఇలా చేస్తే సకల పాపాలు హరిస్తాయి. ఈ ప్రదక్షిణకి ఒక పద్ధతుంది. కార్తీక శుక్ల అష్టమినాడు మధురానగరానికి చేరి బ్రహ్మచర్య దీక్షని పాటిస్తూ ఆ రోజు ఉపవాసముండి ఆ రోజు రాత్రి నేను ప్రదక్షిణ చేస్తాను అని ముందుగా సంకల్పం చెప్పుకోవాలి. మర్నాడు ఉదయం యథావిధిగా దంతధావనాది క్రియలు ముగించుకుని తెల్లని వస్త్రాలు ధరించి మౌనంగా నగర ప్రదక్షిణ ప్రారంభించాలి.

ఈ విధంగా దీక్షగా మధురానగర ప్రదక్షిణ చేసేవాడికి సకలశుభాలూ కలుగుతాయి. ఇవి ప్రదక్షిణ చేసేవాడికే కాదు. అతన్ని దారిలో తాకినవాడికి కూడా మనోరథాలు నెరవేరుతాయి. ప్రదక్షిణ పూర్తయిన తరువాత మధురలో ఉన్న శ్రీకృష్ణమూర్తిని దర్శించాలి. దానితో దీక్ష పరిసమాప్తవుమవతుంది.

ఈ భూమండలం మొత్తం మీద 66000 కోట్ల తీర్థాలున్నాయి. అదేవిధంగా ఆకాశంలో కూడా అంతే సంఖ్యలో తారలు ప్రకాశిస్తున్నాయి. ఈ లెక్కని చెప్పిన వారు ప్రపంచానికి ఆయుఃస్వరూపులైన వాయువు, బ్రహ్మ, లోమశమహర్షి, నారదుడు, ధ్రువుడు, జాంబవంతుడు, బలి, హనుమంతుడు. వీరంతా వనాలతో, సముద్రాలతో, పర్వతాలతో కూడిన ఈ భూమండలాన్నంతా బైటి వైపు నుంచి ఎన్నో సార్లు ప్రదక్షిణ చేసి ఈ లెక్క చెప్పారు.

**మధురప్రదక్షిణ ఫలం :** సప్తద్వీపాలతో కూడిన ఈ భూమండలం మొత్తం ప్రదక్షిణ చేస్తే వచ్చే పుణ్యఫలం కన్నా అధికపుణ్యం మధుర ప్రదక్షిణ చేస్తే లభిస్తుంది. ఒకనాడు స్వయంగా బ్రహ్మదేవుడే ఇలా చెప్పాడు. సమస్త వేదాల్ని అధ్యయనం చేయటం, అన్ని తీర్థాల్లో స్నానం చేయటం, ఎన్నో రకాల దానాలు చేయటం, యజ్ఞ యాగాది క్రతువులు ఆచరించటం, బావులు,

చెరువులు, ఆలయాలు నిర్మించటం వీటన్నిటి ద్వారా లభించే పుణ్యం కన్నా వందరెట్లు అధికమైన పుణ్యం మధురానగర ప్రదక్షిణ వల్ల లభిస్తుంది.

బ్రహ్మదేవుడి ద్వారా ఈ విషయాన్ని తెలుసుకున్న సప్తర్షులు వెంటనే మధురానగరానికి వెళ్ళి అక్కడ ఆశ్రమాన్ని నిర్మించుకున్నారు. వారితో పాటు ధ్రువడు కూడా అక్కడికి వెళ్ళాడు. తరువాత వారంతా తమ తమ కోరికలు నెరవేరాలని సంకల్పించుకుని శుక్లపక్ష నవమి తిథినాడు విధివిధానంగా నగర ప్రదక్షిణ చేసారు. తద్వారా వారి కోరికలన్నీ నెరవేరాయి

**మధురానగర ప్రదక్షిణలో ఎదురయ్యే తీర్థాలు, దేవతలు :** మధురానగరాన్ని ప్రదక్షిణ చేయాలనుకునేవారు ముందు రోజు సంకల్పం చెప్పుకుని మర్నాడు ఉదయం పరిక్రమని ప్రారంభించాలి. పరిక్రమకి ముందు మధురలో ఉన్న 'దక్షిణకోటి' అనే తీర్థానికి వెళ్ళి అక్కడ స్నానం చేయాలి. ఆ తరువాత ముందుగా బ్రహ్మచారి హనుమంతుణ్ణి ఆ తరువాత గణపతి, విష్ణువు కార్తికేయుడు తదితర దేవతల్ని పూజించాలి. వెంటనే అక్కడ నుంచి బయలుదేరి వసుమతీదేవిని దర్శించుకోవాలి. ఆ తరువాత అష్టమాతల్ని దర్శించి వారందరి అనుమతి తీసుకుని యాత్ర ప్రారంభించాలి.

ప్రదక్షిణ చేసే దారిలో శ్రీకృష్ణుడిచేత పూజించబడ్డ 'ఇక్షువాస' దేవికి నమస్కరించాలి. ఇంకా ఆ దారిలో వాసపుత్ర, అర్కస్థల, వీరస్థల, కుశస్థల, పుణ్యస్థల, హయముక్తి, సిందూర అనే దివ్య స్థలాలు కనిపిస్తాయి. వాటన్నిటినీ దర్శించి ముందుకు సాగిపోవాలి. గుర్రం మీదకానీ, వాహనం మీద కానీ ప్రదక్షిణ ఎప్పుడూ చేయకూడదు. శక్తిమేరకు నడిచి మాత్రమే చేయాలి.

మధురాప్రదక్షిణ మార్గంలో శివకుండం, కదంబకుండం, వర్షాఖాత కుండం, కృష్ణ క్రీడాసేతు బంధకుండం, బలిహరణ కుండం కనిపిస్తాయి. ఇవన్నీ కృష్ణ పరమాత్మ జల విహారంచేసిన కుండాలు వాటిని చూస్తేనే చాలు పాపాలు నశిస్తాయి. అదే దారిలో స్తంభోచ్ఛ్యం అనే శిఖరం ఉంది. ఆ శిఖరానికి నమస్కరించి ముందుకు సాగాలి. దారిలో నారాయణస్థాన తీర్థం, కుబ్జికా

వామన తీర్థం కనిపిస్తాయి. వాటిని దాటి ముందుకు వెళ్ళాక సిద్ధేశ్వరీ దేవి దివ్యస్థలం కనిపిస్తుంది. అక్కడే ఒక దివ్యకుండం కూడా ఉంది. అమ్మవార్ని దర్శించి ముందుకు సాగితే గోకర్ణేశ్వరీదేవి, గణపతి దర్శనమిస్తారు.

ఇంకా ఆ దారిలో వరుసగా గార్హ్యతీర్థం, భద్రేశ్వర తీర్థం, సోమేశ్వర తీర్థం, ఘంటాభరణ గరుడకేశ, ధారాలోపసక, వైకుంఠ ఖండవేలక, మందాకినీ, సంయమున, అనకొండ, గోపతీర్థ, ముక్తికేశ్వర, వైలక్ష, మహాపాతనాశక అనే దివ్య తీర్థాలున్నాయి. ప్రదక్షిణ చేసేవాడు వీటన్నిటినీ దర్శిస్తే మంచిది.

ప్రదక్షిణ చేసేవారు దారిలో ఉన్న అన్ని తీర్థాల్ని దర్శించి పరమేశ్వరుణ్ణి భక్తిగా స్తుతించాలి. "ఓ పరమేశ్వరా! నీ ఆజ్ఞతో మధురా ప్రదక్షిణ చేస్తున్నాను. నాకు తగిన ఫలం లభించేలా చేయి" అని ప్రార్థించాలి. ఆ తరువాత విశ్రాంతి సంజ్ఞకం అనే తీర్థానికి వెళ్ళాలి. అక్కడ స్నానం తర్పణం చేసి అక్కణ్ణుంచి మంగళాదేవి మందిరానికి వెళ్ళి తమ యాత్ర సఫలం చేయమని వేడుకోవాలి. అక్కణ్ణుంచి సరాసరి పిప్పలేశ్వరుడి ఆలయానికి చేరుకోవాలి. అక్కడి స్వామిని దర్శించి పూజించి ప్రదక్షిణ యాత్రలో చివరిగా సూర్య తీర్థానికి చేరి అక్కడున్న సూర్య నారాయణమూర్తిని దర్శించుకోవాలి. దీనితో మధురానగర ప్రదక్షిణ పూర్తవుతుంది.

పరమపవిత్రమైన మధురానగరంలో ప్రదక్షిణ చేసే మానవుడు భూమిమీద ఎన్ని అడుగులు వేస్తాడో అన్ని వేల సంవత్సరాలు అతడు అతడి పూర్వీకులు సూర్యలోకంలో నివాసాన్ని పొందుతారు. మధురానగర పరిక్రమ చేసి వచ్చే వ్యక్తిని చూసినా చాలు, వారు పాపాలనుంచి విముక్తి పొందుతారు. ఈ ప్రదక్షిణకు సంబంధించిన విషయాలు విన్నవారికి కూడా పుణ్యఫలాలు లభిస్తాయి.

## గోవర్ధనగిరి పరిక్రమ - మాహాత్మ్యం

మధురకు సమీపంలోనే పశ్చిమ దిక్కున రెండు యోజనాలు విస్తరించి గోవర్ధన గిరివుంది. దానినే అన్నకూటపర్వతమని కూడా అంటారు. ఆ పర్వతం మీద చక్కని చెట్లు, లతలు అందంగా వున్నాయి. అక్కడే ఒక అందమైన సరోవరం కూడా ఉంది.

మధురానగరానికి తూర్పుదిశలో ఇంద్ర తీర్థం, పడమర దిశలో వరుణ తీర్థం, ఉత్తర దిశలో కుబేర తీర్థం. దక్షిణ దిశలో యమతీర్థం అని నాలుగు సుప్రసిద్ధ తీర్థాలున్నాయి. ఇక్కడే 'అన్నకుండం' అనే పేరుతో ఒక దివ్యక్షేత్రం ఉన్నది. అదే గోవర్ధనగిరి. దీనిచుట్టూ ప్రదక్షిణ చేసేవాడు తిరిగి జన్మించడు. ముందుగా మానసీగంగలో స్నానంచేసి ఆ తరువాత గోవర్ధనగిరిపై ఉన్న కృష్ణ పరమాత్మని దర్శించుకోవాలి.

గోవర్ధనగిరి పరిక్రమ చేసినవారికి ఏ రకమైన బరువు భాద్యతలూ ఉండవు. ఉన్నా అవి వారిని ఏమాత్రం బాధించవు. సోమవతీ అనగా సోమవారం నాడు వచ్చిన అమావాస్య తిథినాడు గోవర్ధన గిరి దగ్గర పితరులకి పిండప్రదానం చేస్తే వారికి రాజసూయ యాగ ఫలం లభిస్తుంది. గయాతీర్థంలో పిండ ప్రదానం చేసిన దాని కన్నా అధికఫలం గోవర్ధనగిరి మీద పిండప్రదానం చేస్తే లభిస్తుంది.

**గోవర్ధనగిరి ప్రదక్షిణా విధి :** భాద్రపద మాసం శుక్లపక్ష ఏకాదశి తిథినాడు ఈ పర్వతం దగ్గరకి చేరి ఆరోజు ఉపవాసముండాలి. మర్నాడు ఉదయం సూర్యోదయానికి ముందే స్నానం చేసి ఆ పర్వతం మీద ఉన్న గోవిందుణ్ణి అర్చించాలి. తరువాత అక్కణ్ణుంచి పుండరీక తీర్థానికి వెళ్ళి ఆ కుండంలో స్నానం చేయాలి. తరువాత అక్కడ దేవతల్ని పితృదేవతల్ని పూజించి అక్కడేవున్న పుండరీక భగవానుణ్ణి సేవించాలి. దానికి సమీపంలో అప్సరకుండం వుంది. కొంతదూరంలో సంకర్షణ కుండం కూడా వుంది. ఆ రెంటిలో స్నానం చేయాలి. దానివల్లస కల పాపాలూ నశిస్తాయి.

ఈగోవర్ధన గిరికి సమీపంలోనే శక్ర(ఇంద్ర) తీర్థం ఒకటుంది. ఇక్కడే శ్రీకృష్ణుడు ఇంద్రుడికోసం మధురానగర ప్రజలు చేయబోయే యాగాన్ని నివారించాడు. అందుకు కోపించిన ఇంద్రుడు మధురమీద భయంకరమైన వర్షం కురిపించాడు. అంతకుముందే యజ్ఞంలో నివేదన కోసం ఎన్నో రకాల ఆహార పదార్థాలు గోవర్ధనగిరి దగ్గరకి చేర్పించారు. ఆ ఆహార పదార్థాలన్నీ గుట్టలుగా పడి ఉన్నాయి. ఇంద్రుడు కురిపించిన వాన నుంచి తన ప్రజల్ని

ఆవుల్ని రక్షించాలని సంకల్పించిన కృష్ణుడు తన చిటికినవేలుతో గోవర్ధనగిరిని ఎత్తి పైకి లేపాడు. దానిక్రింద వర్షానికి తడవకుండా మధురానగర వాసులు గోవులు వచ్చి చేరాయి. ఆ నాటినుంచి ఈ పర్వతం అన్నకూట పర్వతంగా కూడా ప్రసిద్ధిచెందింది.

ఈ పర్వతానికి కొద్ది దూరంలో 'కదంబఖండం' అనే మరో కుండం ఉంది. అలాగే దారిలో దేవగిరి ఉంది. ఆ తరువాత ప్రదక్షిణ చేస్తూ ముందుకి వెళ్ళగా పరమపవిత్రమైన రాధాకుండం కనిపిస్తుంది. ఇది అన్నిటికన్నా మహిమాన్వితమైన దివ్యకుండం. అక్కడి ప్రజలు దాన్ని అరిష్టకుండం (అరిష్టాలు నాశనం చేసేకుండం) అని పిలుస్తారు. ఆ కుండంలో స్నానం చేస్తే రాజసూయ అశ్వమేధయాగాలు చేసిన ఫలితం లభిస్తుంది.

మధురకి పూర్వ దిశలో ఇంద్ర ధ్వజం అనే తీర్థం ఉంది. అందులో స్నానం చేసినవాడు ఇంద్రలోకానికి చేరుకుంటాడు. ఈ గోవర్ధన గిరి ప్రదక్షిణ పూర్తి చేసినవారు ఆ యాత్రా ఫలితాన్ని గోవిందుడికే సమర్పించాలి. అంతేకాదు యాత్ర ప్రారంభంలో చక్రతీర్థంలో స్నానంచేసి, యాత్ర పూర్తయ్యాక పంచకుండ తీర్థంలో ముగింపు స్నానం ఆచరించాలి. ఈ గోవర్ధన గిరి దగ్గర రాత్రిపూట జాగారం చేసే నియమంకూడా ఉంది. జాగరణ చేసిన వారి పాపాలన్నీ సునాయాసంగా నశిస్తాయి.

గోవర్ధనగిరి పరిక్రమని ఆషాఢమాసంలో కూడా చేసే ఆచారం వుంది. గోవర్ధనగిరి ప్రదక్షిణ చేసినా ఆ ఇతివృత్తాన్ని గురించి విన్నా గంగానదిలో స్నానం చేసినంత పుణ్యం ప్రాప్తిస్తుంది.

## అగస్త్యుడు చెప్పిన అవిఘ్నకర వ్రతం

ఫాల్గుణ శుద్ధచవితి తిథినాడు ఈ వ్రతాన్ని ఆచరించాలి. ముందు రోజు రాత్రి నువ్వులు కలిపిన అన్నాన్ని భుజించాలి. తరువాత నువ్వులతోనే హోమం చేసి, విప్రుడికి నువ్వుల్ని బియ్యాన్ని కలిపి దానమివ్వాలి. ఈ వ్రతాన్ని వరుసగా నాలుగు నెలలు ఆచరించి అయిదో నెలలో బంగారంతో యథాశక్తి

గణపతి ప్రతిమని తయారుచేయించాలి. దానితో పాటు అయిదు పాత్రల్లో నువ్వులు నింపి పాయసంతో పాటు, ఆ నువ్వుల పాత్రని గణపతి ప్రతిమని యోగ్యుడైన విప్రుడికి దానమివ్వాలి.

ఈ విధంగా విఘ్నకర గణపతివ్రతాన్ని చేసినవాడికి ఎలాంటి విఘ్నాలు కలుగవు. పూర్వం సగర చక్రవర్తి అశ్వమేధయాగం చేయటానికి ముందు విఘ్నం కలగగా ఈ వ్రతాన్ని ఆచరించి విఘ్నాల్ని తొలగించుకున్నాడు. త్రిపురాసురుణ్ణి సంహరించేముందు పరమేశ్వరుడు కూడా ఈ వ్రతాన్నే ఆచరించాడు. అలాగే అగస్త్యుడు సముద్రాన్ని త్రాగే ముందు ఈ వ్రతాన్ని చేసాడు. ఈవిధంగా ఎంతో మంది రాజులు, తాపసులు, జ్ఞానులు, ఈ దివ్య వ్రతాన్ని ఆచరించి తాముచేసే పనులు నిర్విఘ్నంగా పూర్తి చేసుకున్నారు.

"శూరుడు, ధీరుడు, గజముఖుడు, లంబోదరుడు ఏకదంతుడు అయిన విఘ్నరాజుకి నమస్కారం" అని చెప్పి గణపతిని శ్రద్ధగా పూజించాలి. విఘ్నాలు నివారించటానికి గణపతికి హోమం చేయాలి. శ్రద్ధా భక్తులతో ఈ వ్రతాన్ని నియమంగా ఆచరించిన వాడికి సకల శుభాలూ కలుగుతాయి. శ్రీగణేశుడి దివ్యానుగ్రహం లభిస్తుంది.

## సౌభాగ్య కరణ వ్రతం

స్త్రీలకి, పురుషులకీ సౌభాగ్యాన్ని ప్రసాదించే దివ్యవ్రతం ఈ సౌభాగ్యకరణ వ్రతం. ఈ వ్రతాన్ని అగస్త్యమహర్షి చెప్పాడు. ఫాల్గుణ మాసం శుక్ల పక్ష తదియనాడు రాత్రిపూట ఈ దివ్యవ్రతాన్ని ఆచరించాలి. వ్రతంలో భాగంగా లక్ష్మీ నారాయణుల్ని గానీ, ఉమామహేశ్వరుల్నిగానీ శ్రద్ధగా పూజించాలి. లేదా ఇద్దర్నీ పూజించవచ్చు.

రుద్రుడు–విష్ణువు ఇద్దరూ ఒక్కటే. అలాగే పార్వతీ లక్ష్మీ కూడా ఒక్కరే. వీరిద్దర్నీ వేరు భావంతో చూడటం చాలాపాపం. వ్రతంలో భాగంగా లక్ష్మీనారాయణుల్ని స్థాపించి వారిద్దర్నీ శివసంబంధమైన మంత్రాలతో పూజించాలి. ఎందుకంటే వారిద్దరికీ ఎలాంటి భేదం లేదు కనుక.

ఓం గంభీరాయ నమః–పాదౌ పూజయామి, ఓం సుభగాయనమః – కటిం పూజయామి, ఓం నమో దేవదేవాయ నమః – ఉదరం పూజయామి, ఓం నమస్త్రినే త్రాయ నమః ముఖం పూజయామి, ఓం నమో వాచస్పతయే నమః – శిరః పూజయామి, ఓం నమో రుద్రాయ నమః సర్వాంగాని పూజయామి అని పూజించాలి.

ఈ విధంగా లక్ష్మీనారాయణులు లేక గౌరీశంకరుల్ని గంధపుష్పాక్షతలతో పూజించి ఆ తరువాత వారిముందు ఒక హోమకుండాన్ని ఏర్పాటు చేసుకుని అందులో తేనె, నెయ్యి, నువ్వులు ఉపయోగించి 'ఓం నమః సౌభాగ్య పతయే స్వాహా' అనే మంత్రాన్ని పఠిస్తూ హోమం చేయాలి. (108 సార్లు)

హోమం పూర్తయిన తరువాత వ్రతం చేసిన వాళ్ళు ఉప్పు కారం లేని, నూనె తగలని గోధుమ అన్నాన్ని మాత్రమే తినాలి. కృష్ణ పక్షంలో కూడా ఇది విధానాన్ని ఆచరించాలి. ఆ తరువాత ఆషాఢమాసంలో వచ్చే విదియనాడు యవల భోజనాన్ని చేసి ఈ వ్రతాన్ని ఆచరించాలి. తిరిగి కార్తీకం నుంచి మూడు నెలలు అనగా పుష్యమాసం వరకూ నియమంగా చామల అన్నాన్ని మాత్రమే ఆహారంగా స్వీకరించాలి.

మాఘకృష్ణ తదియనాడు గౌరీ శంకరులు లేదా లక్ష్మీ నారాయణుల బంగారు లేక యథాశక్తి వేరే లోహంతో ప్రతిమల్ని తయారు చేయించి, యోగ్యుడైన విప్రుడికి దానం చేయాలి. ఆ ప్రతిమలతో పాటు ఆరుపాత్రల్లో తేనె, నెయ్యి, నువ్వులనూనె, బెల్లం, ఉప్పు, ఆవుపాలు వీటిని నింపి ఇవి కూడా దానం చేయాలి. ఈవిధంగా సౌభాగ్యకరణ వ్రతాన్ని ఆచరించిన స్త్రీ లేక పురుషుడు ఏడు జన్మలదాకా దివ్య సౌందర్యంతో వర్ధిల్లుతారు. అందర్నీ ఆకర్షిస్తారు.

## శాంతి వ్రతం

గృహస్థులైన వారందరికీ మనశ్శాంతిని ప్రసాదించే వ్రతంశాంతి వ్రతం. ఎంతో గొప్పదైన ఈ వ్రతాన్ని అగస్త్య మహర్షి ప్రబోధించాడు. కార్తీకమాసం శుక్లపక్ష పంచమినాడు ఈ వ్రతాన్ని ఆచరించాలి.

ఈ వ్రతాన్ని ప్రారంభించినప్పట్నుంచీ ఒక సంవత్సరం పాటు పులుసుని, పులుపు పదార్థాల్ని తినకూడదు. వ్రతం చేసే రోజు రాత్రి ఆదిశేషుడిమీద పవళించివున్న శ్రీమహావిష్ణువు ప్రతిమని గానీ, చిత్రపటాన్ని గానీ స్థాపించి ఓం అనంతాయ నమః పాదౌపూజయామి, ఓం వాసుకయే నమః జఘనం పూజయామి, ఓం తక్షకాయ నమః ఉదరం పూజయామి, ఓం కర్కోటకాయ నమః హృదయం పూజయామి, ఓం పద్మాయనమః కంఠం పూజయామి, ఓం మహాపద్మాయ నమః భుజే పూజయామి, ఓం శంఖపాలాయ నమః ముఖం పూజయామి, ఓం కుటిలాయనమః శిరః పూజయామి అని విష్ణుగతంగా, విడిగా అక్షతలతో పూజచేయాలి.

పై తెలిపిన సర్పమంత్రాలతో శ్రీమహావిష్ణువునుద్దేశించి పాలతో అభిషేకం చేయాలి. అలాగే వ్రతం చేసే రోజు చిత్రపటం, ప్రతిమ ముందు చిన్న హోమకుండం ఏర్పాటుచేసుకుని పాలతో నువ్వులతో పైమంత్రాల చివర 'స్వాహా' ని చేర్చి హోమం చేయాలి. ఇలా ఒక సంవత్సరం నియమంగా వ్రతాన్ని ఆచరించిన తరువాత బంగారు లేదా ఏదైనా లోహంతో ఒక నాగ ప్రతిమని తయారుచేయించి యోగ్యుడైన విప్రుడికి దక్షిణ తాంబూలాలతో సహా దానం చేయాలి. ఈవిధంగా శాంతి వ్రతాన్ని చేసిన వారికి, వారి కుటుంబ సభ్యులకి సంపూర్ణంగా మనశ్శాంతి లభిస్తుంది.

## కామవ్రతం

కోరిన కోరికలు తీర్చే శుభప్రదమైన వ్రతం ఈ కామవ్రతం. ఈ వ్రతాన్ని అగస్త్యుల వారు ప్రబోధించారు. ఎంతో ప్రభావవంతమైన ఈ వ్రతాన్ని పుష్యమాసం శుక్లపక్ష చవితినాడు భోజనంచేసి తరువాత వచ్చే షష్ఠి తిథినాడు ఈ వ్రతాన్ని ప్రారంభించాలి. ఆరోజు మౌనవ్రతాన్ని పాటించి, కేవలం ఫలాల్ని ఆహారంగా తీసుకోవాలి. ఆ రోజంతా కేవలం పళ్ళనే స్వీకరిస్తూ మర్నాడు ఉదయం సప్తమినాడు భోజనం చేయాలి.

షష్ఠితిథినాడు హోమకుండాన్ని ఏర్పాటుచేసుకుని అక్కడ విష్ణుమూర్తి ప్రతిమను స్థాపించాలి. ముందుగా విష్ణుమూర్తిని అక్షతలతో ఓం కార్తికేయాయ నమః, ఓం గుహాయ నమః, ఓం సేనాన్యై నమః, ఓం కృత్తికా కుమారాయ నమః, ఓం కుమారస్వామినే నమః, ఓం స్కందాయ నమః అని కుమార స్వామి పేర్లతో పూజించాలి. ఈ వ్రతంలోని విశేషం ఇదే కుమార స్వామి పేర్లతో శ్రీమహావిష్ణువుని పూజించటం. ఆ తరువాత ఇదే నామాల్ని చివర 'స్వాహా' అని చేర్చి అనగా ఓం కుమారస్వామినే నమః స్వాహా అని చెబుతూ నువ్వులతో హోమం చేయాలి. ఈవిధంగా వ్రతాన్ని పూర్తిచేసాక బ్రాహ్మణులకి భోజనం పెట్టి దక్షిణ తాంబూలాలతో పాటు బంగారం లేదా ఏదైనా లోహంతో చేసిన కుమార స్వామి ప్రతిమని దానం చేయాలి.

"ఓ కుమారస్వామీ! విప్రుడి రూపంలో వచ్చిన నీకు భక్తితో ఈ దానం చేస్తున్నాను. దీన్ని స్వీకరించి నన్ను సంపూర్ణంగా అనుగ్రహించు. నీ దయవల్ల నా కోరికలన్నీ నెరవేరుగాక"! అని సంకల్పం చెప్పుకుని ఆ ప్రతిమని దానం ఇవ్వాలి. ఈ ప్రతిమతో పాటు పంచె ఉత్తరీయాన్ని కూడా ఇవ్వటం ఆచారం.

పరమపవిత్రమైన ఈ కామవ్రతాన్ని ఆచరించిన వారికి కోరిన కోరికలన్నీ తీరతాయి. పుత్రులు లేనివారికి పుత్రులు, ధనహీనులకి ఐశ్వర్యం, ఉద్యోగం లేనివారికి ఉద్యోగం, వ్యాపారంలో నష్టాలు వచ్చేవారికి వ్యాపారాభివృద్ధి కలుగుతాయి. పూర్వం నలమహారాజు ఈ వ్రతాన్ని ఆచరించాడు. అలాగే ఎంతోమంది రాజ్యభ్రష్టులు ఈ కామవ్రతం చేసి తిరిగి తమ తమ రాజ్యాల్ని అధికారాల్ని పొందారు. ఇది ఎంతో పురాణ ప్రసిద్ధమైన వ్రతం.

## ఆరోగ్య వ్రతం

ఆరోగ్యం భాస్కరాధిచ్ఛేత్ అని ఆర్యోక్తి. అనగా ఆరోగ్యం కావలసినవారు సూర్యభగవానుణ్ణి ఉపాసించాలి. వ్రతాలన్నిటిలోకీ గొప్పది ఆరోగ్యాన్నిచ్చేది 'ఆరోగ్య వ్రతం'. దీన్ని అగస్త్యులవారు లోకానికందించారు. మాఘమాసం శుక్లపక్ష సప్తమినాడు ఉపవాసం ఉండి విష్ణు స్వరూపుడు, సనాతనుడు అయిన

సూర్యనారాయణుణ్ణి – ఓం ఆదిత్యాయనమః, ఓం భాస్కరాయ నమః, ఓం రవయే నమః, ఓం భానవే నమః, ఓం సూర్యాయ నమః అని ఎర్రటి అక్షతలతో పూజించాలి. ఆ మర్నాడు అనగా అష్టమినాడు భోజనం చేయాలి. ఈవిధంగా ఒక సంవత్సరం పాటు ప్రతినెలా శుక్లపక్ష సప్తమినాడు ఈ వ్రతాన్ని ఆచరించాలి. శ్రద్ధా భక్తులతో ఈ వ్రతాన్ని ఎవరైతే ఆచరిస్తారో వారికి సూర్యుడి అనుగ్రహంతో ఆయురారోగ్య ఐశ్వర్యాలు లభిస్తాయి.

పూర్వం అనరణ్యుడు అనే మహారాజు ఈ వ్రతవిధానంతోనే భాస్కరుణ్ణి పూజించాడు. సూర్యుడు సంతోషించి అతడికి సంపూర్ణ ఆరోగ్యాన్ని ప్రసాదించాడు. అతడికి వచ్చింది కుష్ఠురోగం ఎందుకంటే ఆ రాజు ఒకనాడు మానస సరోవరానికి వెళ్ళాడు. అక్కడ సరోవరంలో అందంగా మెరుస్తున్న బంగారు పద్మం కనిపించింది. రాజు వెంటనే తన సేవకుల్ని పిలిచి ఆ బంగారు పద్మాన్ని తెమ్మన్నాడు. సేవకులు సరోవరంలోకి వెళ్ళి ఆ పద్మాన్ని తాకగానే 'హూం' అనే పెద్ద శబ్దం వచ్చి ఒక్కసారిగా ఆ సేవకులు ఎగిరిపడ్డారు. పద్మాన్ని కోయమన్న అనరణ్య మహారాజుకి వెంటనే శరీరమంతా కుష్ఠురోగం ప్రాప్తించింది.

మహారాజు కోయమన్న పద్మం సామాన్యమైంది కాదు. ఈ పద్మం గర్భంలో స్వయంగా సూర్యుడు నెలకొని వున్నాడు. అతడే శాశ్వతమైన పరమాత్మ. రాజు అహంకారంతో బంగారు పద్మాన్ని తలమీద ధరించి వెలిగిపోవాలనుకున్నాడు. అతడి దురాశ కారణంగానే కుష్ఠువ్యాధి సంక్రమించింది. ఇలా రాజు వ్యాధితో బాధపడుతూ తిరిగి తన రాజ్యానికి వచ్చాడు. కొన్నాళ్ళకి వశిష్ఠమహర్షి అక్కడికి వచ్చి ఈ ఆరోగ్యవ్రతాన్ని ఉపదేశించి వెళ్ళాడు. అనరణ్యుడు ఎంతో శ్రద్ధగా ఈ వ్రతాన్ని ఆచరించి తనకు కుష్ఠువ్యాధిని సూర్యానుగ్రహంతో సంపూర్ణంగా తొలగించుకున్నాడు.

## పుత్రప్రాప్తి వ్రతం

పుత్ర సంతానం లేని వారికి యోగ్యుడైన పుత్రుణ్ణి ప్రసాదించే వ్రతం పుత్రప్రాప్తి వ్రతం. మహాపురుషుడైన శ్రీకృష్ణ భగవానుణ్ణి ఈ వ్రతం చేసేవారు

అర్చించాలి. ఈ దివ్య వ్రతాన్ని అగస్త్య మహర్షి లోకానికందించారు. భాద్రపద మాసంలో వచ్చే కృష్ణపక్ష అష్టమినాడు ఈ పుత్ర ప్రాప్తి వ్రతాన్ని చేయాలి. వ్రతానికి ముందు షష్ఠినాడు వ్రతసంకల్పం చెప్పుకుని, సప్తమినాడు దేవకీదేవి ఒడిలో కూర్చున్న బాలకృష్ణుడి ప్రతిమ లేక చిత్రపటాన్ని స్థాపించి భక్తిగా అర్చించాలి. మర్నాడు కృష్ణాష్టమినాడు యథావిధిగా షోడశోపచారాలతో పూజచేసి, హోమకుండాన్ని ఏర్పాటుచేసుకుని నల్లనువ్వులు, నేయి, యవలు, పెరుగు కలిపిన ద్రవ్యంతో హోమం చేయాలి. హోమం చేసేడప్పుడు ఓం శ్రీకృష్ణాయ స్వాహా అనే మంత్రాన్ని పఠిస్తూ 108 లేక 1008 సార్లు హోమం చేయాలి. తరువాత యథాశక్తి విప్రులకి దక్షిణ తాంబూలాలు సమర్పించాలి.

ఈ పుత్రప్రాప్తి వ్రతాన్ని ఆచరించిన వారు వ్రతం పూర్తయిన తరువాత కృష్ణస్వామికి నివేదించిన మారేడుపండు తినాలి. ఆ తరువాత యథేచ్ఛగా భోజనం చేయవచ్చు. ఈవిధంగా నియమంగా వ్రతాన్ని ఆచరిస్తే వారికి తప్పకుండా పుత్రసంతానం కలుగుతుంది.

పూర్వం మహాపరాక్రమవంతుడైన శూరసేన మహారాజుండేవాడు. ఆయనకి ఎంతకాలానికీ సంతానం కలగకపోవటంతో హిమాలయాలకి వెళ్ళి తపస్సు ప్రారంభించాడు. ఆయనలా తపస్సు కొనసాగిస్తుండగా ఒకనాడు భగవంతుడు ప్రత్యక్షమై ఈ పుత్రప్రాప్తి వ్రతాన్ని చేయమని చెప్పాడు. శూరసేనుడు శాస్త్రోక్తంగా ఈ వ్రతాన్ని ఆచరించి యోగ్యుడైన పుత్రుణ్ణి పొందాడు. ఆయనకి జన్మించిన కుమారుడే వసుదేవుడు.

పరమపవిత్రమైన ఈ వ్రతాన్ని ఆచరించినవారు ఒక సంవత్సరం గడిచాక తిరిగి కృష్ణాష్టమినాడు యథావిధిగా కృష్ణుణ్ణి పూజించి, రెండు కృష్ణుడి ప్రతిమల్ని తయారుచేయించి పూజానంతరం విప్రులకి దక్షిణతో సహా దానమివ్వాలి. దీనితో వ్రత పరిసమాప్తి అవుతుంది.

## శుభవ్రతం

అన్ని వ్రతాలకన్నా ఎంతో ప్రశస్తమైనది చేసిన వారికి సకల సంపదల్ని చేకూర్చేది శుభవ్రతం. ఈ వ్రతాన్ని అగస్త్యమహర్షి లోకానికి అందించాడు.

మార్గశిరమాసం శుక్లపక్ష పాడ్యమినుంచి దశమితిథివరకు, ఒకపూట మాత్రమే భోజనం చేస్తూ, ఈ వ్రతాన్ని ఆచరించాలి. దశమినాడు మధ్యాహ్నం స్నానంచేసి శ్రీమహావిష్ణువుని పూజించి, ద్వాదశీవ్రతానికి సంకల్పం చెప్పుకోవాలి. ఆరోజు యవలు విప్రుడికి దానం చెయ్యాలి. దానం చేసేడప్పుడు, పూజచేసేడప్పుడు ఓం కృష్ణాయనమః అని హరిని స్మరించాలి. ఈవిధంగా మార్గశిరం నుంచి నాలుగు మాసాలు గడిపి చైత్రమాసం ప్రారంభంకాగానే తిరిగి శుక్లపక్ష పాడ్యమి నుంచి దశమివరకూ ఒంటిపూట భోజనం చేస్తూ దశమినాడు విష్ణువుని పూజించి, పేలపిండి, బంగారు లేదా వెండి నాణాలను యథాశక్తి విప్రులకి దానమివ్వాలి.

శ్రావణ మాసం నుంచి ఆశ్వయుజ మాసం దాకా మూడు నెలలు ఇదేవిధంగా ప్రతిమాసం పాడ్యమి నుంచి దశమిదాకా ఒంటిపూట నియమాన్ని ఆచరిస్తూ ఈ మూడు నెలలూ దశమితిథినాడు విష్ణువుని పూజించి బియ్యాన్ని విప్రులకి దానం చేయాలి.

కార్తీకమాసంలో కూడా పాడ్యమి నుంచి దశమిదాకా పూర్వంలాగానే నియమాన్ని పాటించి ఏకాదశినాడు శ్రీమహావిష్ణువుని పూజించి సంకల్పంచెప్పుకోవాలి. ఆ మర్నాడు ద్వాదశినాడు అందంగా పూజమందిరాన్ని అలంకరించుకుని అందులో శ్రీమహావిష్ణువునిస్థాపించి ఆయనముందు నేలమీద గంధపుష్పాక్షతలు చల్లి రెండు తెల్లటి వస్త్రాల్ని ఉంచాలి. ఆ వస్త్రాల మీద అక్షతలు చల్లుతూ భూదేవిని పూజించాలి. పూజలో భాగంగా ఓం ప్రియదత్తాయై నమః, అనే నామాన్ని పఠించాలి. ఆవిధంగా విష్ణువుని, భూదేవిని ద్వాదశినాడు పూజించాక ఆ రాత్రి అక్కడే నిద్రపోవాలి.

మర్నాడు ఉదయం ఇరవైనాలుగుమంది బ్రాహ్మణుల్ని పిలిపించి ఒక్కొక్కరికి ఒక్కో గోవుని, ఎద్దుని, పంచ ఉత్తరీయాల్ని, ఉంగరాన్ని తమ తమ శక్తిననుసరించి దానమివ్వాలి. లోభించకుండా తనకు ఉన్నదానిలో ఘనంగా దానంచేయాలి. తరువాత ఆ విప్రులకి భోజనం పెట్టి పాదరక్షలు, గొడుగు

ఇచ్చి సగౌరవంగా సాగనంపాలి. వీరికి దానం చేసేడప్పుడు "శ్రీకృష్ణుడు దామోదరుడు, విశ్వరూపుడు, హరిదేవుడు ఎల్లప్పుడూ నా ఎడల సంప్రీతుడై ఉండుగాక" అని పలకాలి. ఈవిధంగా వ్రతాన్ని చేసినవాడికి లభించే శుభఫలితాలు ఇంత అని చెప్పటానికి ఎవరికీ సాధ్యంకాదు.

పూర్వం ధర్మాత్ముడైన ఒక రాజుండేవాడు. అతడికి పుత్ర సంతానం లేకపోవటంతో తపస్సు చేయగా బ్రహ్మ ప్రత్యక్షమై ఈ శుభవ్రతాన్ని ఆచరించమని చెప్పాడు. ఆ రాజు యథావిధిగా వ్రతాన్ని ఆచరించగా శ్రీహరి ప్రత్యక్షమై వరం కోరుకోమన్నాడు. అప్పుడా రాజు స్వామికి నమస్కరించి దేవా! ఏ దోషాలు లేనివాడు, ధర్మాత్ముడు, సకల శాస్త్రాలు తెలిసినవాడు అయిన ఒక పుత్రుణ్ణి ప్రసాదించు, అలాగే నేను మరణించాక నాకు దుఃఖం అనేదే కలగని పరమపదాన్ని అనుగ్రహించు అని కోరుకున్నాడు. తథాస్తు అని వరాలిచ్చి శ్రీహరి అదృశ్యమయ్యాడు. తరువాత కొంతకాలానికి ఆ రాజుకి 'వత్సశ్రీ' అనే పుత్రుడుదయించాడు. అతడు అన్నివిద్యలూ నేర్చి మహా పరాక్రమశాలిగా, ధర్మాత్ముడిగా కీర్తి పొందాడు.

రాజు తన కుమారుడికి రాజ్యాన్ని అప్పగించి పవిత్రమైన హిమాలయాలకి వెళ్ళాడు. అక్కడ చక్కటి మునివృత్తిని అవలంబించి దీక్షగా ఎలాంటి ప్రత్యేక కోరికలు లేకుండా నిశ్చలమైన మనసుతో పురుషోత్తముడైన శ్రీహరిని నిత్యం ఇలా స్తుతిస్తూ తన తపస్సు కొనసాగించాడు.

## శ్రీ పురుషోత్తమ స్తుతి

క్షరాక్షరం క్షీరసముద్ర శాయినం క్షితీధరం మూర్తిమతాం పరంపదమ్ ।
అతీంద్రియం విశ్వభుజాం పురఃకృతం నిరాకృతం స్తౌమి జనార్దనం ప్రభుమ్॥ 1

త్వమాది దేవః పరమార్థరూపీ విభుః పురాణః పురుషోత్తమశ్చ ।
అతీంద్రియో వేదవిదాం ప్రధానః ప్రపాహి మాం శంఖగదాస్త్ర పాణే ॥ 2

కృతం త్వయా దేవ సురాసురాణాం సంకీర్త్యతే ఒ_సౌ చ అనంతమూర్తే ।
సృష్ట్యర్థ మేతత్ తవ దేవ విష్ణో న చేష్టితం కూటగతస్య తత్స్యాత్ ॥ 3

తథైవ కూర్మత్వ మృగత్వ ముచ్చై స్త్వయాకృతం రూప మనేక రూప ।
సర్వజ్ఞభావా దసకృచ్ఛ జన్మ సంకీర్త్యతే తేఽచ్యుత నైత దస్తి ॥ 4

నృసింహ నమోవామన జమదగ్నినామ దశాస్య గోత్రాంతక వాసుదేవ ।
నమోఽస్తుతే బుద్ధ కల్కిన్ ఖగేశ శంభో నమస్తే విబుధారి నాశన ॥ 5

నమోఽస్తు నారాయణ పద్మనాభ నమో నమస్తే పురుషోత్తామాయ ।
నమః సమస్తామర సంఘ పూజ్య నమోఽస్తుతే సర్ఫవిందాం ప్రధాన ॥ 6

నమః కరాళాస్య నృసింహమూర్తే నమో విశాలాద్రి సమాన కూర్మ ।
నమః సముద్ర ప్రతిమాన మత్స్య నమామి త్వాం క్రోడరూపి న్ననంత ॥ 7

సృష్ట్యర్థ మేతత్ తవ దేవ చేష్టితం న ముఖ్యపక్షే తవ మూర్తితా విభో ।
అజానతా ధ్యాన మిదం ప్రకాశితం నైభి ర్వినా లక్ష్యసే త్వం పురాణ ॥ 8

ఆద్యో మఖస్త్వం స్వయమేన విష్ణో మఖాంగభూతో ఽసి హవిస్త్వమేవ ।
పశుర్భవాన్ ఋత్విగిజ్యం త్వమేవ త్వాం దేవ సంఘా మునయో యజన్తి ॥ 9

యదేతస్మిన్ జగద్ధ్రువ చలాచలం సురాది కాలానల సంస్థ ముత్తమమ్ ।
న త్వం విభక్తోఽసి జనార్దనేశ ప్రయచ్ఛ సిద్ధిం హృదయేఽప్సితాం మే ॥ 10

నమః కమలపత్రాక్ష మూర్తామూర్త నమో హరే ।
శరణం త్వాం ప్రపన్నో ఽస్మి సంసారా న్మాం సముద్ధర ॥ 11

*(శ్లో॥31-41,అధ్యా-55)*

మహాత్ముడైన ఆ మహారాజు ఒక మామిడి చెట్టు క్రింద కూర్చుని ఈవిధంగా స్తుతించగానే భక్తవరదుడైన శ్రీహరి స్వయంగా ఒక మరగుజ్జు రూపంలో అక్కడికి వచ్చాడు. ఆయన రాగానే అక్కడున్న మామిడి చెట్టు కూడా కుంచించుకుపోయింది. అది చూసి ఆ మహారాజు ఎంతో ఆశ్చర్యపోయాడు. ఎంతో విశాలంగా వున్న ఆ చెట్టు హఠాత్తుగా కుచించుకు పోయేసరికి ఆయనకి ఆందోళన కలిగింది.

ఎదురుగా ఆ రాజుకి ఒక చిన్న విప్రుడు కనిపించాడు. అతన్ని చూడగానే ఇదంతా ఆ జగన్నాథుడి మాయేనని గ్రహించాడు రాజు. వెంటనే

భక్తిప్రపత్తులతో ఆ విప్రుడికి నమస్కరించి స్వామీ! దయచేసి నీ నిజరూపాన్ని చూపించు అని వేడుకున్నాడు. వెంటనే శ్రీహరి చిరునవ్వులు చిందిస్తూ శంఖ చక్ర గదా పద్మాలని ధరించి తన నిజరూపాన్ని చూపించాడు. వరం కోరుకోమని రాజుతో పలికాడు.

మహారాజు శ్రీహరిని దర్శించే వేరే ఏ ఇతర వరాలూ కోరుకోకుండా మోక్షాన్ని ప్రసాదించమని అడిగాడు. అప్పుడు శ్రీహరి "రాజా! నేను రాగానే ఈ విశాలమైన మామిడిచెట్టు చాలా చిన్నగా కుబ్జలా మారిపోయింది. రాబోయే కాలంలో ఈ ప్రాంతం "కుబ్జామ్రక తీర్థంగా విఖ్యాతి పొందుతుంది. ఎవరైనా సరే పశుపక్ష్యాదులు సైతం ఇక్కడ ప్రాణాలు కోల్పోతే వారిని స్వర్గానికి తీసుకువెళ్ళటానికి ఎన్నో దివ్యవిమానాలు వస్తాయి. ఇక్కడ యోగం చేసిన వారికి సరాసరి ముక్తి లభిస్తుంది"అని చెప్పి తన చేతిలోవున్న శంఖాన్ని చిన్నగా ఆ రాజుకి తాకించాడు. అంతే ఆ మహారాజు ప్రాణాలు విడిచి శ్రీమన్నారాయణుడి పరమపదాన్ని చేరుకున్నాడు.

పరమపావనమైన ఈ శుభవ్రతాన్ని ఆచరించిన వారికి సకలశుభాలూ కలుగుతాయి. మరణానంతరం శ్రీహరి పరమపద ప్రాప్తి కూడా లభిస్తుంది.

## భూదేవి చేసిన విష్ణు వర్ణనం

పూర్వం భూదేవి నీటిలో మునిగి పోయినప్పుడు శ్రీమన్నారాయణుడు వరాహావతారాన్ని ధరించి తన కోరలతో భూమిని పైకి లేపాడు. ఆయన మహాశరీరాన్ని ధరించి భూమిని ఎత్తేడప్పుడు ఎంతో ఉన్నతమైన మేరుపర్వతం ఆయన గిట్టల మధ్యలో చిక్కి ఖడ ఖణలాడింది. అలా క్రమంగా భూదేవి ఉద్ధరించబడ్డ తరువాత ఒకనాడు బ్రహ్మమానసపుత్రుడైన సనత్కుమారుడు భూదేవి దగ్గరకి వెళ్ళి అమ్మా! శ్రీమహావిష్ణువు నిన్ను ఉద్ధరిస్తున్నప్పుడు నీవు చూసిన అద్భుతాలు వర్ణించు తల్లీ! అని కోరాడు.

భూదేవి సనత్కుమారుడితో నాయనా! సనాతనుడైన శ్రీహరి ముఖతః నేను తెలుసుకున్న దాన్ని విన్నదాన్ని, పరమధర్మమైనదాన్ని నీకు చెబుతాను విను అని ఇలా చెప్పటం ప్రారంభించింది.

పూర్వం భారం పెరిగిపోగా నేను నదులు, పర్వతాలు, సముద్రాలతో సహా పూర్తిగానీటిలో మునిగిపోయాను. నీళ్ళలో ఉండిపోయిన నాకు ఏమీ దిక్కుతోచలేదు. ఆ నీళ్ళలో నక్షత్రాలు, గ్రహాలు, సూర్యచంద్రులు ఏవీ కనపడటం లేదు. ఏం చేయాలో నాకు తోచలేదు. ఎవరు నన్ను ఉద్ధరిస్తారో తెలియటం లేదు. అలా కొంతకాలం గడిపాను. కొన్నాళ్ళ తరువాత శక్తి తెచ్చుకుని రూపాన్ని ధరించి సరాసరి బ్రహ్మలోకానికి వెళ్ళాను. ఆయనతో...... "పితామహా! నీవే నాకు దిక్కు, నేను పూర్తిగా నీళ్ళలో మునిగిపోయాను. నాకేం చేయాలో తెలియటం లేదు. అంతా లోపల చీకటిగా ఉంది-దయచేసి నన్ను ఉద్ధరించు" అని ప్రార్థించాను. నా ప్రార్థన విన్న బ్రహ్మ ఒక్క క్షణం ధ్యానంలోకి వెళ్ళి నాతో ఇలా అన్నాడు.

దేవీ! వసుంధరా! నిన్ను ఉద్ధరించే శక్తి నాకు లేదు. సకల లోకాలకీ ప్రభువు, అందరికీ కర్త, లోకేశుడు, మాయాశక్తి సంపన్నుడు అయిన శ్రీహరిని శరణువేడుకో ఆయనే నిన్ను ఉద్ధరించగల సమర్థుడు అని చెప్పాడు.

నేను సరాసరి బ్రహ్మలోకం నుంచి వైకుంఠానికి వెళ్ళాను. అక్కడ శేషపాన్పు మీద శ్రీహరి యోగ నిద్రలో ఉన్నాడు. ఆయనకి చేతులు జోడించి ప్రభూ! నేను నా బరువుని మోయలేక నీళ్ళలోకి పడిపోయాను. బ్రహ్మ దగ్గరకి రక్షించమని వెళితే ఆయన నీ దగ్గరకి వెళ్ళమని చెప్పాడు. లోకనాథా! జనార్దనా! నన్ను దయచేసి నీళ్ళలోనించి ఉద్ధరించు అని ఇలా దీనంగా ప్రార్థించాను.

## భూదేవి చేసిన మాధవ స్తవం

ప్రసీద మమ దేవేశ లోకనాథ జగత్పతే,<br>
భక్తాయాః శరణాయాశ్చ ప్రసీద మమ మాధవ ॥ 1

త్వ మాదిత్యశ్చ చన్ద్రశ్చ త్వం యమో ధనదస్తు వై<br>
వాసవో వరుణ శ్చాపి అగ్ని ర్మారుత ఏవ చ ॥ 2

అక్షరశ్చ క్షరశ్చా సి త్వం దిశో విదిశో భవాన్,<br>
మత్స్యః కూర్మో వరాహో౽థ నారసింహో ౽సి వామనః<br>
రామో రామశ్చ కృష్ణో౽సి బుద్ధః కల్కి ర్మహాత్మవాన్ ॥ 3

ఏవం యాస్యసి భోగేన శ్రూయతే త్వం మహాయశాః
యుగే యుగే సహస్రాణి వ్యతీతా యేచ సంస్థితాః ॥ 4
పృథివీ వాయు రాకాశ మాపో జ్యోతిశ్చ పంచమమ్
శబ్దస్పర్శస్వరూపో౽సి రసోగన్ధో౽సి నో భవాన్ ॥ 5
సగ్రహా యే చ నక్షత్రాః కలాకాలముహూర్తకాః
జ్యోతిశ్చక్రం ధ్రువ శ్చాసి సర్వముద్యతతే భవాన్ ॥ 6
మాసః పక్షమహెూరాత్రి మృతః సంవత్సరాణ్యపి,
ఋతువశ్చాపి షణ్మాసాః షడ్రసా శ్చాసి సంయుతః ॥ 7
సరితః సాగరా శ్చాసి పర్వతాశ్చ మహోరగాః
త్వం మేరు ర్మన్దరో విన్ధ్యో మలయో దర్దురోభవాన్ ॥ 8
హిమవాన్ నిషధశ్చాసి చక్రో౽సి చ వరాయుధః
ధనూంషి చ పినాకో౽సి యోగః సాంఖ్యో౽సి చోత్తమః ॥ 9
పరంపరో౽సి లోకానాం నారాయణ పరాయణః
సంక్షిప్తం చైవ విస్తారో గోప్తా క్షేప్తా చ వై భవాన్ ॥ 10
యజ్ఞానాం చ మహాయజ్ఞో యుపానా మసి సంస్థితః
వేదానాం సామవేదో ౽సి యజుర్వేదో వరానన ॥ 11
ఋగ్వేదో ౽థర్వ వేదో౽సి సాంగోపాంగో మహాద్యుతే
గర్జనం వర్షణం చాసి త్వం వేధా అనృతానృతే ॥ 12
అమృతం సృజసే విష్ణో యేన లోకా నధారయత్
త్వం ప్రీతి స్త్వం పరా ప్రీతిః పురాణః పురుషో భవాన్ ॥ 13
ధ్యేయాధ్యేయం జగత్సర్వం యచ్చ కిఞ్చిత్ ప్రవర్తతే
సప్తానామపి లోకానాం త్వం నాథ స్త్వంచ సంగ్రహః ॥ 14
త్వం చ కాలశ్చ మృత్యుశ్చ త్వం భూతో భూతభావనః
ఆదిమధ్యాంతరూపో ౽సి మేధా బుద్ధిః స్మృతి ర్భవాన్ ॥ 15
ఆదిత్యస్త్వం యుగావర్తః సచ పంచ మహాతపాః
అప్రమాణప్రమేయో౽సి ఋషీణాంచ మహానృషిః ॥ 16
ఉగ్రదణ్డశ్చ తేజస్వీ హ్రీ ర్లక్ష్మీ ర్విజయో భవాన్

అనన్తశ్చాసి నాగానాం సర్పాణా మసి తక్షకః
ఉద్వహః ప్రవహశ్చాసి వరుణో వారుణో భవాన్ ॥ 17
క్రీడా విక్షేపణ శ్చాసి గృహేషు గృహదేవతాః
సర్వాత్మకః సర్వగతో వర్ధనో మాన ఏవ చ ॥ 18
సాఙ్గస్త్వం విద్యుతీనాం చ విద్యుతానాం మహాద్యుతిః
యుగో మన్వన్తర శ్చాసి వృక్షాణాం చ వనస్పతిః ॥ 19
అండజోద్భిజ్జ స్వేదానాం జరాయూణాం చమాధవ,
శ్రద్ధాఽసి త్వం చ దేవేశ దోషాన్ హన్తాఽసి మాధవ ॥ 20
గరుడోఽసి మహాత్మానాం వహసే త్వం పరాయణః
దున్దుభి ర్నేమి ఘోషైశ్చ ఆకాశగమనో భవాన్ ॥ 21
జయశ్చ విజయశ్చాసి గృహేషు గృహదేవతాః
సర్వాత్మకః సర్వగత శ్చేతనో మన ఏవ చ ॥ 22
భగస్త్వం వృషలిఙ్గశ్చ సరస్త్వం పరమాత్మకః
సర్వభూతనమస్కార్యో నమోదేవ నమో నమః
మాం త్వం మగ్నామసి త్రాతుం లోకనాథ ఇహార్హసి ॥ 23
ఆది కాలాత్మకం హ్యేతత్ సర్వపాపహరం శివమ్
య ఇదం పఠతే స్తోత్రం కేశవస్య దృఢవ్రతః
వ్యాధితో ముచ్యతే రోగాత్ బద్ధో ముచ్యేత బంధనాత్ ॥ 24
అపుత్రో లభతే పుత్రం దరిద్రో ధన మాప్నుయాత్
అభార్యో లభతే భార్యా మపతిః పతి మాప్నుయాత్ ॥ 25
ఉభేసంధ్యే పఠేద్ యస్తు మాధవస్య మమాస్తవమ్
స గచ్ఛేద్ విష్ణులోకం హి నాత్ర కార్యా విచారణా ॥ 26
అయంతు అక్షరోక్తో ఽపి భవేత్ తు పరికల్పనా
తావద్ వర్ష సహస్రాణి స్వర్గలోకే మహీయతే ॥ 27

*(శ్లో॥25-51,అధ్యా-112)*

ఈ స్తోత్రం విన్న శ్రీహరి ఎంతో సంతోషించి వెంటనే వరాహావతారాన్ని ధరించి నన్ను ఉద్ధరించాడు. ఎంతో గొప్ప దయామయుడైన శ్రీహరి దయవల్ల

నేనీనాడింత ఆనందంగా ఉన్నాను. ఆయన నన్ను ఉద్ధరిస్తున్నప్పుడు ఎన్నో అద్భుతాలు చూసాను. ఆయన శక్తి సామర్థ్యాలు నాకెంతో ఆశ్చర్యం కలిగించాయి. ఎంతో అవలీలగా తన కోరలతో నన్నాయన రక్షించాడు" అని భూదేవి సనత్కుమారుడికి చెప్పింది.

భూదేవి చేసిన ఈ మాధవ స్తుతి మహిమాన్వితమైనది. సకల పాపాల్ని హరిస్తుంది. మంగళకరమైనది. శ్రద్ధా భక్తులతో ఈ దివ్య స్తుతిని చేసినవాడు సకల రోగాలనుంచీ, భవబంధాలనుంచీ విముక్తుడవుతాడు. పుత్రులు లేనివాడికి పుత్రులు కలుగుతారు. దరిద్రుడికి ధనసంపద లభిస్తుంది. భార్యలేనివాడికి ఉత్తమ ఇల్లాలు వస్తుంది. ఉదయ, సాయం సంధ్యల్లో ఈ మాధవ స్తవాన్ని కేవలం ఒక్కసారి పఠిస్తే చాలు. వేలసంవత్సరాలు స్వర్గలోక నివాసాన్ని పొందుతారు.

## శ్రీవరాహ పురాణం ఫలశ్రుతి

పరమపవిత్రమైన ఈ వరాహపురాణాన్ని పఠించినవారికి, విన్నవారికి, చెప్పిన వారికి సకల శుభాలు కలుగుతాయి. శ్రీవరాహమూర్తికి, భూదేవికి సంవాద రూపంలో జరిగిన ఈ పురాణాన్ని భక్తి పూర్వకంగా పఠించిన వారు సకల పాపాలనుంచీ విముక్తులై పరమపదాన్ని పొందుతారు.

యథాచమత్యమనాదవైద్నశోధార్య తేఘృతం ।
ఏమసర్వేషు శాస్త్రేషు వారాహం ఘృత సమ్మితం ॥ *(శ్లో॥21,అధ్యా-48)*

ఈ వరాహపురాణాన్ని పఠిస్తే చాలు వేదాలతో కూడిన సకల శాస్త్రాలనీ అన్ని పురాణాలనీ పఠించినట్టే అవుతుంది.

నైమిశం, ప్రభాసక్షేత్రం, హరిద్వారం, కాశీ, పుష్కరం.ప్రయాగ, అమరకంటకాది పుణ్యక్షేత్రాల గురించి తెలుసుకున్న దానికన్నా కోటి రెట్లు అధికఫలం ఈ పురాణ పఠనం వల్ల మానవులకి లభిస్తుంది.

**స్వస్తి**

**సర్వేజనాః సుఖినోభవన్తు**

